# డిపీ ది కిడ్ 'ఆహారపు గడ్డంగ లూటీ'లో

డిపీ బంగళావైపే చీకట్లో కదిలే రెండు నీడలు



ఆగంతక సోదరలిద్దరూ జొరబడ్డారు



డిపీ ది కిడ్ కునుకు తీసాడు ఓమూల




వీర అశ్వం పసిగట్టింది













చివరికి గెలుపెవరిదో తెలుసుకో...









అవునర్రా...పిల్లలకి డిపీస్ స్క్వాష్‌లంటే మహ యిష్టం. పెద్దవాళ్ళకుక్కూడా యివంటే మహ మోజు. డిపీస్ సిరప్స్, కెచప్స్, సాసెస్, జామ్స్ మరియు జెల్లీస్ రుచిచూసేదాకా ఆగండి మరి. ఓహో– మరి అవి రుచికీ జనాదరణకి పేరెన్నికగన్నవి.

డిపీస్ లెమన్, ఆరెంజి, మేంగో స్క్వాష్‌లు, లెమన్ బార్లీవాటర్, లైమ్ కార్డియల్, పైనాపిల్ క్రష్, మరియు రుచిగల సిరప్స్.

**డిపీస్ అసలైన పళ్ళరుచిగలది- ఎంతో తాజాగా,రసమొలికేలా**

# కొత్త స్టేఫ్రీ బెల్టులేని నేప్‌కిన్లు





ఈ ఎడ్హెసివ్ పట్టీ నేప్‌కిన్‌ను మీ బిగువైన చెడ్డీలలో సురక్షితంగా నిలుపుతుంది.




## లూపులు, బెల్టులు, పిన్నులు ఇక ఏమి అవుసరంలేదు. మీకు కావసిన పూర్తిరక్షణతో, మీరు కోరుకున్న పూర్తిస్వేచ్ఛ

మీరు ప్రతిఒక్కరోజు సద్వినియోగం చేయాలని కోరేస్త్రీ అయితే, మేము మీకు అతి ప్రత్యేకమైన దానిని సమర్పించ కోరుతున్నాం: **స్టేఫ్రీ** బెల్టులేని నేప్‌కిన్లు.

### మీరు కోరుకున్న పూర్తి స్వేచ్ఛ

మీరు లూపులు, పిన్నులు, తాళ్ళు లేక బెల్టులతో బాధ పడాల్సిన రోజులు పోయాయి. **స్టేఫ్రీ** నేప్‌కిన్లు సరైనట్లు అమరుటకోసం ఎడ్హెసివ్ పట్టీలు ఉన్నాయి. మీ బిగువైన చెడ్డీల లోపల దీనిని నొక్కండి. మీరు తీసివేసేదాకా చెమ్మను పీల్చి సురక్షితంగా అక్కడే ఉంటుంది. **స్టేఫ్రీ** నేప్‌కిన్లు మీరు ఏ దుస్తులతోనైనా




ధరించ వచ్చును ఏంకావలసినా చేయవచ్చును. అవి నిజంగా అమర్చినచోట అట్లానే ఉంటాయి.

### మీకు కావలసిన రక్షణ

**స్టేఫ్రీ** మీకు కావలసిన రక్షణ నిశ్చయంగా ఇచ్చెటట్లు ప్రత్యేకంగా డిజైను చేయబడ్డది. అధికంగా చెమ్మనుపీల్చి లోపలి మడతలలో చెమ్మనిలిచి పోతుంది. మరి. 3–వైపులా ప్లాస్టిక్ షీల్డ్ నేప్‌కిన్ దిగువభాగము మరియు. ప్రక్కల మరకలు పడనీయదు. నేడే ఒక ప్యాక్ కొనండి. బెల్టులేని దాని స్వేచ్ఛను అనుభవించండి. మరి మీ రెప్పటికీ లూప్‌లు లేక బెల్టులు, పిన్నులు, తాళ్ళ జోలికి పోరు !

భారత దేశంలో తయారు చేయువారు జాన్సన్ & జాన్సన్ లిమిటెడ్, బొంబాయి–400 036

చూపుకీ
అందం
కంటికి
చలవ

అదే
**ఐటెక్స్**
కాటుక



స్థానికమైన ఉత్తమ తైలముల మూలికల మిశ్రమంతో శాస్త్రరీత్యా తయారైనది ఐటెక్స్.




పెట్రోలియమ్ జెల్లీగాని, మైనం గాని, ఏ విధమైన రంగుగాని చేర్చబడనిది ఐటెక్స్.

కళ్ళకు కాంతి, చలవ ఆకర్షణలను కల్పించుటలో సాటిలేనిది ఐటెక్స్.

35 ఏళ్లుగా మీ అపార విశ్వాసమునకు ఒక చిహ్నము ఐటెక్స్.

మీ సౌందర్యమునకు మీ కన్నులే జీవనాడి. దానికి సాటిలేని ఉత్తమమైన కాటుకనే వాడాలి. అదే ఐటెక్స్ కాటుక అని వేరే చెప్పాలా?

ARAVIND LABORATORIES MADRAS-600 033




ఏప్రిల్ నెల 'వనిత'లో ఉగాది కథల పోటీలో బహుమతి పొందిన మూడు కథానికల సబ్జెక్ట్‌లో ఎంతో వెరైటీ కనిపించింది! బాధ్యతారహితంగా ప్రవర్తించే భర్తలకు కనువిప్పును కలిగించే మొదటి బహుమతిని పొందిన 'దావాగ్ని చెప్పిన సత్యం' కథానికలో 'కాంత' పాత్ర మరచిపోదామన్నా మరుపురానిది! నిష్కల్మషమయిన మాతృ ప్రేమకు అద్దం పట్టింది రెండవ బహుమతి పొందిన 'వంచిత'! జీవితాలను 'సెంటిమెంటల్ వే'లో తీర్చిదిద్దుకునేవారు వాస్తవికతకు సుదూరంగా తమ దృక్పథాలను మలచుకొంటుంటారు! అలాంటివారి ప్రతినిధిగా 'అన్నపూర్ణమ్మ' పాత్ర 'పసుపు కుంకుమలు' కథానికలో ప్రత్యక్షమయ్యింది! ఈ కథ ముగింపు ఆడదాని ఐదవతనానికి అసలయిన పరమావధిని ప్రబోధించింది! '...ఉషోదయం లేని నా జీవితం రసికులందరికి నిషాద సమయం...' పతితల అంతరాత్మలను ఈ రీతిన ప్రతిధ్వనింపజేసిన 'కవ్వలి' 'విషాదగీతం' ఎంతో హృదయ విదారకంగా ఉంది!

—శ్రీమతి నజీర్‌హుసేన్, కావలి

"విశ్వ సాహిత్యంలో ఉద్గ్రంథాలు' శీర్షిక ద్వారా ప్రపంచ భాషలన్నిటిలోని స్త్రీ పురుషుల మహోన్నత గ్రంథాలను ఒక క్రమపద్ధతిలో పరిచయం చేస్తూ పాఠకులకు పూర్తి మనో వికాసాన్ని, సంతృప్తిని అందించగలరని భావిస్తున్నాను. ఈ వ్యాసాలు మరింత రసవత్తరంగా ఉంటే స్త్రీలకు మంచి సాహిత్యాభిరుచి ఏర్పడుతుంది.

—ఆకొండి వెంకటలక్ష్మి, విశాఖపట్టణం

మీరు భాషలు నేర్చుకోండి' అను శీర్షికలో నెలకొక అక్షరం చొప్పున కొన్ని నెలల నుండి వేస్తున్నారు. మీ పత్రిక ద్వారా అక్షరాలన్నీ నేర్చుకోవటానికి 4 సంవత్సరాలు పడుతుంది. ఇక భాష పూర్తిగా నేర్చుకోవటానికి ఒక జీవిత కాలం సరిపోదు. కాబట్టి ఈ శీర్షికను ప్రచురించడం శుద్ధ దండుగ అని గ్రహించగోరుతాను.

—కస్తూరి సరస్వతి, సికింద్రాబాదు

గుండె జబ్బుగల వారు ఎలాంటి ఆహారము తీసికొనవలెను? అవి తీసుకొన్న వారి జబ్బు ఎలా నయమవుతుంది? మీరు చాలా బాగా తెలియజేసినారు. మీకు మా కృతజ్ఞతలు.

—వీరపల్లి వరలక్ష్మి, ఏలూరు

వనితలోని 'వంచిత', 'దావాగ్ని చెప్పిన సత్యం' అనే రెండు కథలూ ఆణిముత్యాల్లా ఉన్నాయి. ఇంట్లో కూర్చునే ఎంతోమంది ప్రముఖులని కలుసుకోవడమే కాకుండా, ఎన్నో పుణ్యక్షేత్రాలను కూడా దర్శించి, ఆయా పుణ్యక్షేత్రాల మహిమలను తెలియజేస్తున్న వనితకు అభినందనలు. అల్సర్ గురించి, గుండె జబ్బు గురించి చదివాక డాక్టర్ ప్రత్యక్షంగా మా ఎదుట నిలబడి ఈ విషయాలన్నీ తెలియజేసిన అనుభూతి పొందాము.

—గుత్తికొండ సుధారాణి, కొల్లూరు.

ఏప్రిల్ 'వనిత' ముఖచిత్రం ఒక వింతానుభూతిని కల్గించింది. ఆణిముత్యాల్లా అందించిన పోటీ మూడు కథలు అద్భుతభావనతో, మంచి శైలిలో వ్రాసిన రచయిత్రులకు మా కృతజ్ఞతలు. 'వనిత'లో కొత్త మార్పులు తెస్తున్న నిర్వాహకులకు మా అభినందనలు.

—అజర్ ఫాతిమా, మంచిర్యాల

అభిప్రాయాలు శీర్షికలో హైందవ వనిత లక్షణాల గురించి 'అసలైన స్త్రీ ధర్మం యేది?' అని విమర్శించిన గార్ల సరస్వతిగార్కి నా అభినందనాలు.

—డి రామసీత, మద్రాసు

''రాధికాలైన్'' ముఖచిత్రంతో వెలువడిన వనితలో, ఉగాది కథల పోటీలో బహుమతి పొందిన మూడు కథలూ చాలా చక్కగా వున్నాయి. 'వనిత' తొలి సంచిక నుంచి కూడా ప్రయోజనకరమైన శీర్షికలతో పాఠకులకు అటు వినోదాన్ని ఇటు విజ్ఞానాన్ని సమపాళ్ళతో మిళితం చేసి అందిస్తోంది అని చెప్పడానికి సంతోషిస్తున్నాను. ముఖ్యంగా 'లోకజ్ఞానం', 'ప్రపంచం' వంటి శీర్షికలు వనితల అభ్యున్నతికి ఎంతైనా దోహదకారులు!

—ఎమ్. హరిప్రియ, శ్రీకాకుళం

వనిత పత్రికలో ఏప్రియల్ సంచికలో మన దేవాలయాలు అనే శీర్షికలో ''లేపాక్షి'' క్షేత్రం గూర్చి వ్రాసిన వ్యాసం చాలా బాగుంది. 'దావాగ్ని చెప్పిన సత్యం' చాలా బాగుంది. బామ్మగారి పేజీలు పెంచవలెను.

—బోడా వెంకట సాయిలక్ష్మి, అనకాపల్లి

ఉగాది కథల పోటీలో గెలుపొందిన మూడు కథలూ ఆశించినంత గొప్పగా లేవు! అంతంత బహుమతులకు అర్హమైన కథలు - అంటే ఎంత గొప్పగా వుండాలి!

—జి. అన్నపూర్ణేశ్వరి, విశాఖపట్నం

## లోపల

# సంస్కృత పాఠమాల [5]

## स्वरयुक्त व्यञ्जनानि

స్వరయుక్త వ్యఞ్జనాని = గుణింతములు

| | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ప | ఫ | బ | భ | మ | య | ర | ల | వ | శ | ష | స | హ | ళ | క్ష | జ్ఞ |
| प | फ | ब | भ | म | य | र | ल | व | श | ष | स | ह | ळ | क्ष | ज्ञ |
| పా | ఫా | బా | భా | మా | యా | రా | లా | వా | శా | షా | సా | హా | ళా | క్షా | జ్ఞా |
| पा | फा | बा | भा | मा | या | रा | ला | वा | शा | षा | सा | हा | ळा | क्षा | ज्ञा |
| పి | ఫి | బి | భి | మి | యి | రి | లి | వి | శి | షి | సి | హి | ళి | క్షి | జ్ఞి |
| पि | फि | बि | भि | मि | यि | रि | लि | वि | शि | षि | सि | हि | ळि | क्षि | ज्ञि |
| పీ | ఫీ | బీ | భీ | మీ | యీ | రీ | లీ | వీ | శీ | షీ | సీ | హీ | ళీ | క్షీ | జ్ఞీ |
| पी | फी | बी | भी | मी | यी | री | ली | वी | शी | षी | सी | ही | ळी | क्षी | ज्ञी |
| పు | ఫు | బు | భు | ము | యు | రు | లు | వు | శు | షు | సు | హు | ళు | క్షు | జ్ఞు |
| पु | फु | बु | भु | मु | यु | रु | लु | वु | शु | षु | सु | हु | ळु | क्षु | ज्ञु |
| పూ | ఫూ | బూ | భూ | మూ | యూ | రూ | లూ | వూ | శూ | షూ | సూ | హూ | ళూ | క్షూ | జ్ఞూ |
| पू | फू | बू | भू | मू | यू | रू | लू | वू | शू | षू | सू | हू | ळू | क्षू | ज्ञू |
| పృ | ఫృ | బృ | భృ | మృ | యృ | రృ | లృ | వృ | శృ | షృ | సృ | హృ | ళృ | క్షృ | జ్ఞృ |
| पृ | फृ | बृ | भृ | मृ | यृ | — | — | वृ | शृ | षृ | सृ | हृ | — | क्षृ | ज्ञृ |
| పౄ | ఫౄ | బౄ | భౄ | మౄ | యౄ | రౄ | లౄ | వౄ | శౄ | షౄ | సౄ | హౄ | ళౄ | క్షౄ | జ్ఞౄ |
| पॄ | फॄ | बॄ | भॄ | मॄ | यॄ | — | — | वॄ | शॄ | षॄ | सॄ | — | — | क्षॄ | ज्ञॄ |
| పౢ | ఫౢ | బౢ | భౢ | మౢ | యౢ | రౢ | లౢ | వౢ | శౢ | షౢ | సౢ | హౢ | ళౢ | క్షౢ | జ్ఞౢ |
| पॢ | फॢ | बॢ | भॢ | मॢ | — | — | — | वॢ | शॢ | षॢ | सॢ | — | — | क्षॢ | ज्ञॢ |
| పే | ఫే | బే | భే | మే | యే | రే | లే | వే | శే | షే | సే | హే | ళే | క్షే | జ్ఞే |
| पे | फे | बे | भे | मे | ये | रे | ले | वे | शे | षे | से | हे | ळे | क्षे | ज्ञे |
| పై | ఫై | బై | భై | మై | యై | రై | లై | వై | శై | షై | సై | హై | ళై | క్షై | జ్ఞై |
| पै | फै | बै | भै | मै | यै | रै | लै | वै | शै | षै | सै | है | ळै | क्षै | ज्ञै |
| పో | ఫో | బో | భో | మో | యో | రో | లో | వో | శో | షో | సో | హో | ళో | క్షో | జ్ఞో |
| पो | फो | बो | भो | मो | यो | रो | लो | वो | शो | षो | सो | हो | ळो | क्षो | ज्ञो |
| పౌ | ఫౌ | బౌ | భౌ | మౌ | యౌ | రౌ | లౌ | వౌ | శౌ | షౌ | సౌ | హౌ | ళౌ | క్షౌ | జ్ఞౌ |
| पौ | फौ | बौ | भौ | मौ | यौ | रौ | लौ | वौ | शौ | षौ | सौ | हौ | ळौ | क्षौ | ज्ञौ |
| పం | ఫం | బం | భం | మం | యం | రం | లం | వం | శం | షం | సం | హం | ళం | క్షం | జ్ఞం |
| पं | फं | बं | भं | मं | यं | रं | लं | वं | शं | षं | सं | हं | ळं | क्षं | ज्ञं |
| పః | ఫః | బః | భః | మః | యః | రః | లః | వః | శః | షః | సః | హః | ళః | క్షః | జ్ఞః |
| पः | फः | बः | भः | मः | यः | रः | लः | वः | शः | षः | सः | हः | ळः | क्षः | ज्ञः |

# వనిత

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి : 4 సంచిక : 11

మే : 1979

విడి ప్రతి : రెండు రూపాయిలు

సం॥ర చందా : ఇరవైనాలుగు రూపాయిలు

శ్రీలంక : రూ. 2.00 (ఇండియా)

మలేసియా : 90 సెంట్స్

చిరునామా :

చందమామ బిల్డింగ్స్

మద్రాసు-600 026


## మరొక సీరియల్ నవల త్వరలో ప్రారంభం!

సుప్రసిద్ధ రచయిత్రి

వాసిరెడ్డి సీతాదేవి

రచన

''నింగి నుండి నేలకు''

నశేష నవలగా త్వరలో 'వనిత'లో ఆరంభం కాబోతున్నది

చేయాలి. 3. రోజూ భోజనంలో ఏదన్నా ఒక రకం సూపు తీసుకుంటే మంచిది. టొమాటోలతో గాని, అన్ని కూరలు వుడికించిన నీరు అంటే వంకాయ అలాంటివి కాకుండా ఆకు కూరలు వుడికించిన సూపు అయినా తీసుకోవచ్చు. 4. ఆకు కూరలు ఎక్కువగా తీసుకోవాలి. 5. నెయ్యి రాయకుండా పుల్కాలు పొంగించి తింటే మంచిది. 6. వెన్న తీసిన మజ్జిగ మంచిది. పాలతోపాటు మీగడ తీసిన పెరుగు కూడా వేసుకోవచ్చు. 7. వేయించి పొట్టు తీసిన వేరుసెనగపప్పు; పెసలు గాని సెనగలు గాని నీటిలో నానపెట్టి, మొలకెత్తించినవి గాని తింటే మంచిది. 8. పళ్ళు విరివిగా తీసుకోవచ్చు.

సునర్ల జయారావు — గాంధీధామ్ (కచ్)

### కన్యాత్వ పరీక్ష

పోయిన మార్చి నెల 'వనిత'లో కోయంబత్తూరు నుండి శ్రీమతి రాధానాయుడుగారు వ్రాసిన 'కన్యాత్వ పరీక్ష' అన్న లేఖ చదివిన తర్వాత సమాధానంగా ఈ లేఖ వ్రాయవలసి వచ్చింది. 'కన్యాత్వ పరీక్ష'ను నిరోధిస్తూ ఆంధ్రప్రదేశ్‌లోని మహిళా మండలులు గానీ, లయన్ లేడీస్ క్లబ్‌లుగానీ, ఇతరులుగానీ నోరు మెదపలేదెందుచేత? – అని విమర్శించడం విచారించదగ్గ విషయం. రాధానాయుడుగారు కేవలం పత్రికల్లోని వార్తల ఆధారంపైనే మన రాష్ట్రంలోని మహిళల స్థాయి నిర్ణయిస్తున్నారని తెలుస్తుంది. ఆంధ్రప్రదేశ్‌లో కూడా ఈ విషయం మీద చాలామంది విమర్శించడం జరిగింది.

3వ తేదీ ప్రచురించిన వార్తను చూడగానే ఫిబ్రవరి 5 సోమవారం నాడు అఖిల భారతీయ విద్యార్థి పరిషత్ ఆదోని శాఖ మహిళా విభాగ్ ఒక అత్యవసర సమావేశం ఏర్పాటు చేసింది. అందులో కన్యాత్వ పరీక్షను తీవ్రంగా విమర్శించడం జరిగింది. ఆ సమావేశంలో ప్రతిపాదించిన తీర్మానంలో 'బ్రిటన్ ప్రభుత్వం భారత ప్రభుత్వానికే కాక, మహిళా లోకానికే క్షమాపణ చెప్పుకోవాలని, వెంటనే ఈ పని చేయని పక్షమున దేశవ్యాప్తంగా ఉద్యమం లేవదీస్తామని, తర్వాత జరిగే ఎలాంటి పరిణామాలకు పరిషత్ బాధ్యత వహించదని' తెల్పింది. ఈ సందర్భంలో రాష్ట్ర గవర్నరు, రాష్ట్రపతికి పంపిన ఒక విజ్ఞాపన పత్రంలో 'బ్రిటన్‌లోని భారత హైకమీషన్ ఈ సంఘటనపై చేస్తున్న దర్యాప్తును భారత ప్రభుత్వం ప్రోత్సహించాలని, ప్రపంచ మానవ హక్కుల పరిరక్షణ సంఘం ఈ విషయాన్ని దర్యాప్తుచేసి, భారతీయ మహిళలకు న్యాయం చేకూర్చాల'ని విజ్ఞప్తి చేసింది.

అందువల్ల, అన్యాయం జరిగినప్పుడు ఎవరైనా చైతన్యరహితంగా ఉంటారనుకోవడం పొరపాటు. ఒకవేళ ఫిబ్రవరి 13న బ్రిటన్ ప్రభుత్వం భారత ప్రభుత్వానికి క్షమాపణ చెప్పి వుండకపోతే, దాని పరిణామం రాధానాయుడుగారు గమనించిన విధంగా ఉండేది.

పి. వాగవేణి — ఆదోని

### 'దావాగ్ని చెప్పిన సత్యం'లోని సత్యం

భర్త వ్యసనలోలుడై, తన బాధ్యతలను విస్మరించినప్పుడు, భార్య తన పొట్ట కోసం కాకపోయినా, తన కన్నబిడ్డల ఆకలి తీర్చటం కోసమైనా, మరే విధంగానూ డబ్బు సంపాదించే మార్గం లేనప్పుడు. ఏ రకంగా నైతికంగా దిగజారిపోతుందో 'దావాగ్ని చెప్పిన సత్యం' కథలో బహు చక్కగా చెప్పారు రచయిత్రి. మన తెలుగు సినిమాల్లో చూస్తుంటాం, హీరోయిన్ ఏ నర్సుగానో, కుట్టుమిషనుతో టైలరింగ్ పనిచేస్తూనో, ఇంకా కూలిపని....బిచ్చమెత్తుకోవటం ఇలాంటివన్నీ చూస్తుంటాం. కానీ శిక్షణ లేకుండా కుట్టు-నర్సు పని, శక్తి లేకుండా కూలి పని, ఏ వంకర లేకుండా బిచ్చమెత్తుకోవటం ఎంత అసహజమైన చిత్రీకరణ? శిక్షణ పొంది-ఉద్యోగం సంపాదించే వరకు ఆకలి ఆగదు. మరి ఈ ఆకలి మంటలు ఆర్పాలంటే మరో మార్గం వెతుక్కోక తప్పదు.

వయసులో వున్న కుర్రకారు దగ్గర్నుంచి, షష్టి పూర్తి చేసుకున్న వృద్ధుడు కూడ, పరాయి స్త్రీపై చూపే మోజు....పెళ్ళాం నాలుగు రోజులు పుట్టింటికి వెళ్తే, పరాయి స్త్రీ పొందు కోసం పడే తహతహ, పురుషుడిలో ఈ బలహీనతవల్ల ఎన్నెన్ని పచ్చటి కాపురాలు కూలిపోతున్నాయో, ఎంత మంది స్త్రీలు బలైపోతున్నారో ఆలోచిస్తే హృదయం ద్రవించిపోతుంది.

తన సంపాదనతో తన భార్యాబిడ్డల్ని పోషించవలసింది పోయి, తన భార్య అక్రమ సంపాదన కూడ, సిగ్గు విడిచి దోచుకుపోవటం....వ్యసనలోలుడైన పురుషుడు, ఎంతకు దిగజారిపోతాడో ఎంతో సహజంగా విశదీకరించారు రచయిత్రి.

అయితే దీనికి పరిష్కార మార్గం ఏమిటి? స్త్రీ కేవలం పురుషుడి దయాదాక్షిణ్యాలపై ఆధారపడి జీవిస్తున్నంతకాలం ఈ తిప్పలు తప్పవు. స్త్రీకి విద్యతోపాటు, అనేక రంగాల్లో సాంకేతిక శిక్షణ కూడా ఎంతైనా అవసరం. ఆర్థిక స్వాతంత్ర్యం ఉన్న స్త్రీ, ఎట్టి విపత్కర పరిస్థితులెదురొచ్చినా, ధైర్యంగా తట్టుకుని నిలబడగల్గుతుంది, అంతేకాకుండా, పురుషుడి ప్రవర్తనలో కూడ మార్పు రావాలి. అప్పుడే మన వివాహ వ్యవస్థ జయప్రదమై, అన్ని కుటుంబాల్లోనూ సుఖ సంతోషాలు వెల్లి విరుస్తాయి.

పి. లక్ష్మీశారద — రాజమండ్రి

# సంస్కృత పాఠమాల [5]

**स्वरयुक्त व्यञ्जनानि**

స్వరయుక్త వ్యఞ్జనాని = గుణింతములు

| | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ప | ఫ | బ | భ | మ | య | ర | ల | వ | శ | ష | స | హ | ళ | క్ష | జ్ఞ |
| प | फ | ब | भ | म | य | र | ल | व | श | ष | स | ह | ळ | क्ष | ज्ञ |
| పా | ఫా | బా | భా | మా | యా | రా | లా | వా | శా | షా | సా | హా | ళా | క్షా | జ్ఞా |
| पा | फा | बा | भा | मा | या | रा | ला | वा | शा | षा | सा | हा | ळा | क्षा | ज्ञा |
| పి | ఫి | బి | భి | మి | యి | రి | లి | వి | శి | షి | సి | హి | ళి | క్షి | జ్ఞి |
| पि | फि | बि | भि | मि | यि | रि | लि | वि | शि | षि | सि | हि | ळि | क्षि | ज्ञि |
| పీ | ఫీ | బీ | భీ | మీ | యీ | రీ | లీ | వీ | శీ | షీ | సీ | హీ | ళీ | క్షీ | జ్ఞీ |
| पी | फी | बी | भी | मी | यी | री | ली | वी | शी | षी | सी | ही | ळी | क्षी | ज्ञी |
| పు | ఫు | బు | భు | ము | యు | రు | లు | వు | శు | షు | సు | హు | ళు | క్షు | జ్ఞు |
| पु | फु | बु | भु | मु | यु | रु | लु | वु | शु | षु | सु | हु | ळु | क्षु | ज्ञु |
| పూ | ఫూ | బూ | భూ | మూ | యూ | రూ | లూ | వూ | శూ | షూ | సూ | హూ | ళూ | క్షూ | జ్ఞూ |
| पू | फू | बू | भू | मू | यू | रू | लू | वू | शू | षू | सू | हू | ळू | क्षू | ज्ञू |
| పృ | ఫృ | బృ | భృ | మృ | యృ | రృ | లృ | వృ | శృ | షృ | సృ | హృ | ళృ | క్షృ | జ్ఞృ |
| पृ | फृ | बृ | भृ | मृ | यृ | — | — | वृ | शृ | षृ | सृ | हृ | — | क्षृ | ज्ञृ |
| పౄ | ఫౄ | బౄ | భౄ | మౄ | యౄ | రౄ | లౄ | వౄ | శౄ | షౄ | సౄ | హౄ | ళౄ | క్షౄ | జ్ఞౄ |
| पॄ | फॄ | बॄ | भॄ | मॄ | यॄ | — | — | वॄ | शॄ | षॄ | सॄ | — | — | क्षॄ | ज्ञॄ |
| పౢ | ఫౢ | బౢ | భౢ | మౢ | యౢ | రౢ | లౢ | వౢ | శౢ | షౢ | సౢ | హౢ | ళౢ | క్షౢ | జ్ఞౢ |
| पॢ | फॢ | बॢ | भॢ | मॢ | — | — | — | वॢ | शॢ | षॢ | सॢ | — | — | क्षॢ | ज्ञॢ |
| పే | ఫే | బే | భే | మే | యే | రే | లే | వే | శే | షే | సే | హే | ళే | క్షే | జ్ఞే |
| पे | फे | बे | भे | मे | ये | रे | ले | वे | शे | षे | से | हे | ळे | क्षे | ज्ञे |
| పై | ఫై | బై | భై | మై | యై | రై | లై | వై | శై | షై | సై | హై | ళై | క్షై | జ్ఞై |
| पै | फै | बै | भै | मै | यै | रै | लै | वै | शै | षै | सै | है | ळै | क्षै | ज्ञै |
| పో | ఫో | బో | భో | మో | యో | రో | లో | వో | శో | షో | సో | హో | ళో | క్షో | జ్ఞో |
| पो | फो | बो | भो | मो | यो | रो | लो | वो | शो | षो | सो | हो | ळो | क्षो | ज्ञो |
| పౌ | ఫౌ | బౌ | భౌ | మౌ | యౌ | రౌ | లౌ | వౌ | శౌ | షౌ | సౌ | హౌ | ళౌ | క్షౌ | జ్ఞౌ |
| पौ | फौ | बौ | भौ | मौ | यौ | रौ | लौ | वौ | शौ | षौ | सौ | हौ | ळौ | क्षौ | ज्ञौ |
| పం | ఫం | బం | భం | మం | యం | రం | లం | వం | శం | షం | సం | హం | ళం | క్షం | జ్ఞం |
| पं | फं | बं | भं | मं | यं | रं | लं | वं | शं | षं | सं | हं | ळं | क्षं | ज्ञं |
| పః | ఫః | బః | భః | మః | యః | రః | లః | వః | శః | షః | సః | హః | ళః | క్షః | జ్ఞః |
| पः | फः | बः | भः | मः | यः | रः | लः | वः | शः | षः | सः | हः | ळः | क्षः | ज्ञः |




ప్రపంచం అనేక రంగాలలో పురోగమిస్తున్నది. అనాగరికతకి ఆఖరి రోజులు ఎప్పుడో వచ్చాయని, ప్రపంచమంతటా నాగరికత వెల్లి విరుస్తున్నదని చెప్పుకుంటున్నారు. ఇందులో ఏ మాత్రమూ సత్యం లేదని మన పొరుగుదేశంలో నిన్నకాక మొన్న జరిగిన సంఘటన ఋజువు చేసింది.

1947 లో అవిభక్తభారతదేశం నుంచి విడిపోయిన పాకిస్తాన్ పాతిక సంవత్సరాలు తిరిగే సరికి తిరిగి రెండుగా చీలిపోయింది. రాజకీయ రంగంలో అశాంతి చోటుచేసుకుని, సాంఘిక జీవితంలో భద్రతలోపించి పాకిస్తాన్ మిలటరీ పాలకుల చేతుల్లో పడింది. ఈ ముప్ఫయి రెండు సంవత్సరాలుగా పాకిస్తాన్ భారతదేశం అంటే విద్వేషం పెంచుకుంటూనే వస్తున్నది. అయినా భారతదేశం పాకిస్తాన్‌కి ఎప్పుడూ స్నేహహస్తం అందిస్తోంది. 1971 లో అప్పటి మిలటరీ ప్రభుత్వాన్ని ప్రజాస్వామ్యపుశక్తితో కూలద్రోసి అధికారంలోకి వచ్చిన జుల్ఫికర్ అలీ భుట్టో చరిత్ర పునరావృతమవగా తిరిగి మిలటరీ పాలకుల చేతుల్లో పడిపోయాడు. ఒక రాజకీయ హత్యకి సూత్రధారి అనే నెపంతో భుట్టోని ఏప్రిల్ 4 న పాకిస్తాన్ మిలటరీ ప్రభుత్వం ఉరి తీసింది. ఈ విషయాన్ని పాకిస్తాన్ ఆంతరంగిక సమస్యగా భావించిన దేశాలు సహితం పాకిస్తాన్ సైనిక నియంత జనరల్ జియా ఉల్‌హక్ తీసుకున్న చర్య అమానుషమని పేర్కొన్నాయి. ఉరిశిక్షని ప్రపంచ వ్యాప్తంగా రద్దు చేయాలనే ఉద్యమానికే ఇది 'ఉరిశిక్ష'గా కొందరు భావిస్తున్నారు.

భుట్టో తాను అధికారంలో వున్నప్పుడు నలుగురు సైనికాధికారులని ఉపేక్షించి జనరల్ జియాని ఉన్నతపదవిలో కూర్చుండపెట్టాడు. రాజకీయాలలో స్వార్థం తప్ప న్యాయం వుండదనీ, అక్రమాలు తప్ప నీతి వుండదనీ తమ ఉనికిని సుస్థిరం చేసుకోడానికి బలమయిన ప్రత్యర్థులని ఏదో వంకతో అంతం చేస్తారనీ భుట్టో ఉరిశిక్ష ఋజువు చేసింది.

అయితే పాకిస్తాన్ ప్రజలలో భుట్టో అంటే వున్న అపారమయిన ప్రేమాభిమానాలు ఈ సంఘటనతో పాకిస్తాన్ చరిత్రనే మరోసారి పూర్తిగా మార్చివేయవచ్చు.

*

పిచుక మీద బ్రహ్మాస్త్రం ప్రయోగిస్తే ఏమవుతుంది? పిచుక నామరూపాలు లేకుండా పోతుంది. అయితే ఆ పిచుకకి బ్రహ్మాండమయిన శక్తులు సహాయానికి వస్తే కథ స్వరూపమే మారిపోతుంది. వియత్నాం అతి చిన్న దేశం. జనాభా ఐదుకోట్లు. చైనా ప్రపంచంలో సైనికపరంగా మహాశక్తివంతమయిన దేశం. చైనా జనాభా 90 కోట్లు. అటువంటి చైనా వియత్నాం మీద దాడిచేసింది. అయితే మరో అగ్రరాజ్యం రష్యాకి వియత్నాం మీద ఎంతో సానుభూతి వుంది. సంపూర్ణసహకారం అందించే సానుభూతి అది. అంతేకాక రెండు దేశాల మధ్య ఒక రక్షణ ఒడంబడికా అమలులో వుంది. ఇక చైనా రష్యాల మధ్య ఎప్పుడూ పచ్చగడ్డి వేస్తే భగ్గుమని మండే వాతావరణం వుండనేవుంది.

అలా చిలికి చిలికి గాలివానయి ప్రపంచ యుద్ధానికి దారి తీస్తుందనుకున్న సంఘటన పూర్వపరాలు పరిశీలిస్తే, వియత్నాం రష్యా అనుకూల దేశం కావడమే చైనాకి వియత్నాం మీద కన్నెర్రకి కారణమని విశదమవుతుంది. వియత్నాం సరిహద్దులలో 120 వేల సైనికశక్తిని, ఆధునిక వైమానిక బలాన్ని చైనా సమీకరించింది. ఇదివరకు అమెరికా మీద వీరోచితంగా పోరాడి విజయం సాధించిన వియత్నాం 'పొగరు' అణచి, అమెరికా అభిమానం సంపాదించాలనే 'చిన్న కోరిక' చైనాని ఎంతో కలవరపరుస్తూ వచ్చింది. అయితే ఒక రోజున భారతదేశం మీద సులభంగా దాడిచేసిన చైనా ఈ రోజున వియత్నాం మీద అంత సులభంగా దాడిచేసే అదృష్టానికి నోచుకోలేదు. కారణం సోవియట్ రష్యా.

మొత్తం మీద మూడవ ప్రపంచయుద్ధం 'ప్రారంభం'లోనే ఆగిపోయింది. చైనా, వియత్నాంల మధ్య ఫిబ్రవరి 17 న ఏర్పడిన సరిహద్దు వివాదం మార్చి 16 న చైనా సైన్యం ఉపసంహరణతో యుద్ధభీతిని తగ్గించింది. అయితే వియత్నాం విదేశాంగమంత్రి మటుకు పదివేలమంది చైనా సైనికులు తమ వైపు, సరిహద్దుకి ఇరవయిమైళ్ళ లోపునే వున్నారని ఆరోపించాడు. ఆ ఆరోపణలో నిజం లేదని తమ సైనికులు వున్న స్థావరాలు తెలియ చేయమని చైనా అడుగుతోంది. అలా పరస్పర ఆరోపణలతో రెండు దేశాలు ఇంకా ప్రపంచశాంతికి కొంత విఘాతాన్ని కలిగిస్తున్నాయి. చైనా చర్యని గర్హించిన ప్రపంచదేశాలు వియత్నాం కాంపూచియాలో సైనిక పెత్తనం సాగించడాన్ని నిందిస్తున్నాయి. 'నీ తప్పులు తెలుసుకుని అవతలివాడిలో తప్పులు వెతుకు' అనే సూత్రం ప్రతి దేశమూ పాటిస్తే 'యుద్ధం' అనే పదాన్ని నిఘంటువులోంచి తీసేయవచ్చు.

*

ఎన్నికలు ఎక్కడ జరిగినా ప్రపంచం ఎంతో ఆసక్తితో వాటి ఫలితాల కోసం ఎదురు చూస్తుంది. మే 3 న బ్రిటన్‌లో జరిగే ఎన్నికలు ప్రపంచానికి ఎన్నడూ లేనంతగా ఆసక్తిని కలిగిస్తున్నాయి. ఆ ఎన్నికలలో కన్సర్వేటివ్ పార్టీ నెగ్గి బ్రిటన్‌కి మొట్టమొదటిసారిగా ఒక వనిత–శ్రీమతి మార్గరెట్ థాచర్ ప్రధానమంత్రి అవుతుందని అందరూ ఆశిస్తున్నారు.

రాజకీయ స్వాతంత్ర్యమే కాక ఆర్థిక సమానత్వమూ వున్న దేశంగా బ్రిటన్‌నే చెప్పుకుంటారు. ప్రజాస్వామ్యంలో నైతిక విలువలు బ్రిటన్‌లో ఉన్నతస్థాయిలో వున్నాయని పేర్కొంటారు. అయితే ప్రపంచవ్యాప్తంగా వచ్చిన పరిణామాలెన్నో బ్రిటన్‌లోనూ చోటు చేసుకున్నాయి. ద్రవ్యోల్బణం అరికట్టడానికి ప్రభుత్వాలు చేసిన కృషి బ్రిటన్‌లో ఫలించలేదు. కార్మిక రంగంలో తీవ్రమయిన అశాంతి వ్యాపించగా విద్యుచ్ఛక్తి రంగంలోనూ, రవాణా రంగంలోనూ పనులు మందకొడిగా సాగడం ప్రారంభమయింది. కార్మికోద్యమం మరింతగా బలపడింది.

ఇటువంటి వాతావరణంలో ఏ ప్రభుత్వమయినా 'మీనమేషాలు లెక్కిస్తూనే' అధికారంలో వుండాలి. ఈ విషయం జేమ్స్‌కెలహన్ ప్రధానిగా వున్న లేబర్ ప్రభుత్వానికి వర్తించింది. అయిదు సంవత్సరాల పరిపాలనా కాలపరిమితిలో ఇంకా ఆరునెలల వ్యవధి వుండగానే కన్సర్వేటివ్ పార్టీ ప్రవేశపెట్టిన అవిశ్వాస తీర్మానం ఒక్క ఓటు తేడాలో నెగ్గగా, ఓడిపోయిన కెలహన్ ప్రభుత్వం రాజీనామా సమర్పించింది. బ్రిటన్ రాజకీయాలలో గత అర్ధ శతాబ్దిలో యిటువంటి సంఘటన జరగలేదు. ఎన్నికలలో నెగ్గినట్లయితే బ్రిటన్‌లో రాజకీయ సుస్థిరత శ్రీమతి థాచర్ ఎలా తీసుకు వస్తుందో చూడాలి. □

# ఒరిస్సా గ్రామీణ జీవితం – స్త్రీలు

2

– పెదపూడి రాజ్యలక్ష్మీదేవి –

గృహస్థు తండ్రి బాగున్నప్పుడు అన్నదమ్ము లంతా కలిసి వుండేవారుట. ఆయన పోయాక అంతా ఆస్తులు పంచుకుని విడిపోయారుట. అంతా కలిసి వున్నప్పుడు వాళ్ళ వృత్తి వ్యవసాయమే విడిపోయాక అంతా ఇంగ్లీషు చదువుల మీది మోజుతో పక్క పూరైన కేంద్రపాడాకు వచ్చి కాలేజీ చదువులు చదువుకున్నారు. అన్నగారి అబ్బాయిలిద్దరు అస్సాములో ఒకరు, నేపాల్‌లో ఒకరు డాక్టర్లుగా పని చేస్తున్నారని ఆ అత్తగారు చెప్పింది.

"మీరు మీ స్వామిని ఎలా చూసేవారు?" అని ప్రశ్నించాను. అక్కడివారు భర్తని 'స్వామి' అని అంటారు.

నేనలా అడగ్గానే ఆ పండు చెక్కిళ్ళు ఎర్ర బారాయి-గత స్మృతులామెను ముప్పిరి గొన్నాయి కాబోలు.

"ఎలా చూసేదాన్ని....! భగవంతుడిలా – స్వామిసేవ అంటే భగవంతుడి సేవే - ఆయన్ని రూపుదాల్చిన భగవంతుడిలా చూసేదాన్ని, ఆయన వున్నన్నాళ్ళూ ఆ చల్లని నీడలో నా జీవితం ఏ చీకూచింతా లేకుండా వెళ్ళిపోయింది. ఇంట్లో అంతా నా యిష్టప్రకారమే జరిగేది. ఆయన వున్నన్నాళ్ళూ యిల్లు కళకళ్ళాడుతూ వుండేది. ఆయన పోయాక పరిస్థితులు మారిపోయాయి. అద్దాలనాడు బిడ్డలు కాని గెడ్డాలనాడు బిడ్డలు కాదు కదా! తగువులాడుకుని ఆస్తి పంచుకుని నలుగురు కొడుకులూ విడిపోయారు.'' అంటూంటే ఆ వృద్ధురాలి గొంతు గద్గదమవటం గమనించాను. ఆమె కళ్ళలో నీళ్ళు చిమ్మాయి. "ఆఖరుకొడుక్కి మతి స్థిమితం లేదు. కోడలు అమాయకురాలు. అందుచేత వీళ్ళదగ్గరే వుండిపోయి యీ పసివాళ్ళను పెంచుతున్నాను. మిగతా కొడుకులకి కూడా ఎప్పుడేది అవసరమైనా వెళ్ళి సాయం చేస్తాను.'' అంటున్న ఆమెలో భగవంతుడి అంశ కనిపించింది నాకు.

"మరి మీ చిన్నబ్బాయికి మతిస్థిమితం లేదు కదా! మీరు చూస్తే ఆడవాళ్ళు, ఇల్లు ఎలా గడుస్తుంది....?'' అన్నాను.

నిట్టూర్చింది ముసలావిడ.

"మా అబ్బాయి ఎంత పాడుచేసినా పది ఎకరాల పొలం వుంది. దాని మీద ధాన్యం వస్తాయి. పెరట్లో పాదులుపెట్టి అన్ని రకాల కూరగాయలు పండిస్తాము. పశువులపాడి వుంది. మనుమడికి కాలేజీ చదువు అయిపోయి భగవంతుడి దయవల్ల ఏదేనా వుద్యోగం దొరికితే మా కష్టాలు గట్టెక్కుతాయి.'' అంటున్న ఆ వృద్ధురాలి కంఠంలో భవిష్యత్తుపై దృఢనమ్మకం కనిపించింది.

ఆ డెబ్బైఏళ్ళ కుటుంబ పెద్దని చూస్తూంటే గ్రామీణ స్త్రీలంతా ఒక్కలా వుండరనీ, ఘోషాలో వున్నా అవసరమైతే మగవాడి పనులు కూడా చేసి స్త్రీ అబలకాదు సబలే అని నిరూపించుకోగలరనీ నాకనిపించింది.

ఇంటి పనంతా కోడలు చూసుకుంటుందనీ తాను పశువులపని పొలం పనీ చూసుకుంటాననీ ఆవిడ చెప్పింది.

సంప్రదాయకమైన యిళ్ళల్లో కోడలి ధర్మాన్ని గురించి చెప్పమని గృహిణిని అడిగాను.

వివాహమై కోడలు కాపురానికి రాగానే అత్తగారు ఏడు రోజులు కొత్త కోడల్ని అలంకరించి కూర్చోబెడుతుంది. ఆ తరువాత ఇంటి బాధ్యత అంతా కోడలికి అప్పజెప్పి తాను పైనుంచి చూస్తూ పెత్తనం చేస్తూ వుంటుంది. అంటే కోడలు వచ్చాక అత్తగారికి పూర్తిగా విశ్రాంతి అన్నమాటే.

అత్తింటి కోడలు తెల్లవారు జామునే లేచి పేడ నీళ్ళతో ఇల్లంతా శుద్ధి చేసి తరువాత స్నానం చేసి అత్తగారి కాళ్ళుకడిగి ఆ నీళ్ళని కొద్దిగా తీర్థంలా పుచ్చుకుంటుంది. అంటే అత్తగారిని కోడలు దైవ సమానురాలిగా భావిస్తుందన్నమాట. ఇప్పుడిప్పుడు చదువుకున్న కోడళ్ళు ఈ పద్ధతిని వ్యతిరేకిస్తున్నారు. అత్తగారి కాళ్ళకి నమస్కారం చెయ్యడంతో తమ భక్తి ప్రపత్తులను ప్రకటించుకుంటున్నారు. తరవాత కోడలు అత్తగారికి తల దువ్వి నుదుట సింధూరం దిద్దాలి. ఇంటి పనంతా చక్కబెట్టి మూడు పూటలా అత్తగారికి కాళ్ళు చేతులు పట్టాలి. ఒకవేళ ఆస్తులు పంచుకుని కొడుకులు విడిపోయినా కోడలు మాత్రం రాత్రి వెళ్ళి అత్తగారి కాళ్ళుపట్టి మరీ రావాలి. భర్తతో అత్తమామల ఎదుట మాట్లాడకూడదు. సాధారణంగా భార్యాభర్తలు కలుసుకుని మాట్లాడుకోవడం ఒక్క రాత్రి పూటే వీలవుతుందట. ఈ లోపుగా కొడుకూ కోడలూ పెద్దవాళ్ళ ఎదుటగాని మాట్లాడుకుంటే కోడలు కొడుకుని కొంగుకి ముడేసుకుంటోందనీ, పెద్దవాళ్ళంటే భయభక్తులు సన్నగిల్లి పోతున్నాయనీ అత్తమామలు భావిస్తారుట. వీధిలో ఎక్కడికైనా వెళ్ళినా యింటికోడలు రిక్షాకో, బండికో చుట్టూ పరదా కట్టించుకుని మరీ వెళ్ళాలి. భర్త ఆమెతోపాటు రిక్షాలో వెళ్ళకూడదు. భార్య వెనుక కొంతదూరంలో వేరే రిక్షాలో గాని సైకిల్ మీద గాని వెళ్ళాలి. బ్రాహ్మణ కుటుంబాలలోనూ సంప్రదాయం పాటించే యితర కులాల్లోనూ కూడా ఈ నిబంధనలన్నీ పాటిస్తారు. కోడలు ఎప్పుడూ తల మీద ముసుగు బాగా క్రిందికి లాక్కుని వుండాలి. బావగార్లకి ఎదుటపడి భోజనం వడ్డించకూడదు. ఆ తరువాత ఆ ఎంగిళ్ళు తను ఎత్తకూడదు. ఇంట్లో పిల్లలు వుంటే వాళ్ళు ఎంగిళ్ళు ఎత్తుతారు.

సాయంత్రం పూట నేతిలో ముంచిన పత్తితో కాని గుడ్డతో కాని వత్తులు చేసి భగవంతుడి పటం దగ్గర తులసికోట దగ్గర దీపాలు వెలిగిస్తుంది కోడలు. కోడలు వచ్చాక పగటిపూజ కూడా కోడలికే అప్పగిస్తుంది అత్తగారు. అగరువత్తులు వెలిగించి సాంబ్రాణి ధూపం వేస్తుంది.

మన రాష్ట్రంలోని కోడలి కన్న ఒరిస్సాలో కోడలికి బాధ్యతలు ఎక్కువ. మన రాష్ట్రంలో కొత్త కోడల్ని అత్తగారు కొంచం అపురూపంగా



బారిమూళో గ్రామ పొలిమేరల్లో రాధాకృష్ణులు వెలసి వున్న చిన్న గుడి

చూసుకుంటుందనే చెప్పాలి. మహా ఐతే కొంచం పాతపద్ధ కోడలికి సాయంత్రం వంట, వడ్డన అప్ప జెప్పుతారు. పగలు సాధారణంగా అత్తగారే చేస్తారు వంటా వార్పూ. కాని ఒరిస్సాలో అలా కాదు. అందుచేత ఇక్కడ పెళ్ళికావలసిన ఆడ పిల్లలు వంటా వార్పూ, పిండి వంటలు చెయ్యడం, ఇల్లు సర్దడం మొదలైన గృహిణికి అవసరమైన కళలన్నీ తల్లి దగ్గర నేర్చుకుంటారు. ఇక్కడి తల్లులు చిన్నప్పటినుంచీ ఆడపిల్లలకి పనులన్నీ నేర్పుతారు.



బారిమూళో గ్రామంలో ధాన్యం దంపుకునే ఢింకి

ఇంతలో మా సంభాషణకి అంతరాయం కలిగిస్తూ గృహిణి బావగారి కొడుకు నావేపు చూసి, "భర్తని భార్య ఏ విధంగా చూస్తుందని పాతతరం అభిప్రాయం ఇందాకా తెలుసుకున్నారు కదా! భర్తపట్ల – అత్తగారిపట్ల యువతరం అభిప్రాయం ఏమిటో మా వదినని చెప్పమనండి." నవ్వుతూ అన్నాడు మాతోపాటు అక్కడే కూర్చున్న అన్నగారి భార్యని చూపుతూ.

ఆమెవేపు చూసి, "చెప్తారా?" అన్నాను నవ్వుతూ.

"నేనా....!" అంటూ తడబడిపోయిందా కొత్త కోడలు. ఆమె కళ్లలో భయం కనిపించింది. మరిది ఎదుట, పెద్దత్తగారి దగ్గర తన వ్యక్తిగత అభిప్రాయాన్ని వెలిబుచ్చడానికా అమ్మాయి భయపడుతోందని గ్రహించి "పోన్లెండి. ఆ అమ్మాయిని యిబ్బంది పెట్టకండి." అనేసాను.

తరువాత వుద్యోగినులైన స్త్రీల ద్వారా, పల్లెటూరి సంబంధాలు చేసుకున్న యువతుల ద్వారా నాకు తెలిసిందేమిటంటే చదువుకున్న వాళ్ళు పల్లెటూళ్ళలో వుండటాన్ని, అత్తవారింట్లోని ఆచారాలని ఆచరించడాన్నీ వ్యతిరేకిస్తున్నారని. కోడలు పల్లెటూరిలోనే ఉద్యోగం చేసి యిటు ఇంటి పని చేసి అటు నెల తిరిగేసరికి జీతం తెచ్చి చేతిలో పోస్తుందని పల్లెటూళ్లో వున్న అత్తగారు భావిస్తూంటే, అత్తవారింట్లో తన మీద పడ్డ పనులకి, బాధ్యతలకి బేజారెత్తిపోయిన ఒక కొత్త కోడలు తన టీచరు ట్రెయినింగు పూర్తికాగానే బెంగాల్‌లో వున్న భర్త దగ్గరికి వెళ్ళిపోతానే కాని పల్లెటూరికి ఛస్తే వెళ్ళనని తెగేసి చెప్పింది. కారణమేమిటని ప్రశ్నిస్తే యింటి పనిలో తనకి అత్తగారుగాని ఆడపడుచు కాని సాయానికి రావటం లేదనీ, సెలవుల్లో తను అత్తగారింటికి వెడితే అంతవరకూ తాము చేస్తూన్న పని అంతా కోడలికి అప్పగించేస్తారనీ, అటు వంట పనీ, యిటు అంట్లపనీ, నీళ్ళ పనీ అన్ని పన్లూ తన నెత్తినే పడతాయనీ, తన అవస్థ చూసి జాలిపడి భర్త సహాయం చెయ్యబోతే అత్తగారు కొడుకుని గదమాయిస్తుందనీ ఆ కొత్త కోడలు చెప్పింది. వాళ్ళ ట్రెయినింగు కాలేజీలో ఆమెతోపాటు మరో అయిదారుగురు కొత్తగా పెళ్ళయిన వాళ్ళు వున్నారుట. వీళ్లు తమ అత్తవారిళ్లలో కష్టాలను గురించి ఒకరితో ఒకరు చెప్పుకుని వూరట పొందుతూ వుంటారుట.

తరువాత వితంతువుల ఆచారాల్ని గురించి చెప్పమని అత్తగార్ని అడిగాను.

పునిస్త్రీలకి చేపలు, మాంసం తినడం విధాయకం. శుభసూచకం. కాని కొన్ని సంప్రదాయక కుటుంబాలలో గ్రుడ్లు నిషిద్ధం. మామూలు సమయాలలో ఉప్పుడు బియ్యం ఉన్నా పండగల్లోనూ దైవ కార్యాలలోనూ పచ్చిబియ్యం వాడుతారుట. భర్త పోయాక చేపలు, వెల్లుల్లి, మాంసం, నీరుల్లి వర్జిస్తారు, తెల్ల చీర కట్టుకుంటారు. జాకెట్టు వేసుకోరు. ఏకాదశినాడు వుపవాసం వుండి సంధ్యా సమయంలో శ్రీకృష్ణుని పూజించి తులసి, మహా ప్రసాదం తీసుకుంటారుట. వితంతువులకు ఏకాదశి చాలా ముఖ్యమైన రోజు.

మధ్య ఒరిస్సాలో గ్రామీణ స్త్రీలు పూలు పెట్టుకోరు, జాకెట్టు వేసుకోరు. అలా ఎవరైనా వేసుకుంటే వాళ్ళని వేశ్యలంటారుట. ఇప్పుడు కాలేజీ చదువులు వచ్చాక యువతరం వాళ్ళు పూలు పెట్టుకోకపోయినా జాకెట్లు వేసుకుంటున్నారు.

మేము వెళ్ళిన మరో గ్రామం 'బారిమూళో'. ఈ గ్రామం కటక్‌కి 38 మైళ్ళ దూరంలో వుంది.

ఈ గ్రామంలో ముగ్గురు స్త్రీలు గ్రామ సేవికలుగా పనిచేస్తున్నారు. మాకు ఆతిథ్యమిచ్చిన గృహస్థు కేంద్రపడా కాలేజీలో లైబ్రేరియన్‌గా పని చేస్తున్నాడు. గృహస్థు, అతడి తల్లి మా కెంతో మర్యాద చేశారు.

"ఈ వూళ్లో ఎలిమెంటరీ స్కూలు వుంది. కానీ పిల్లలకి శ్రద్ధలేదు. ఒక రోజు వెడితే ఒక రోజు వెళ్ళరు. వీళ్ళందర్లోనూ ఏ కొద్ది మందో అయిదో క్లాసు ప్యాసయి హైస్కూలు చదువుకు కేంద్రపడా వెడతారు. వీళ్ళు చదవరు. పెద్దవాళ్ళు చెప్పరు." అన్నాడు గృహస్థు.

అతడి భార్య పురిటికి పుట్టింటికి వెళ్ళిందట. 'కోడలు లేకపోవడం వల్ల నాకు కొంచం శ్రమగా వుంది' అంది అతడి తల్లి కొంచం ఆయాస పడుతూ. "కోడలు వుంటే అన్నీ తనే చూసుకునేది."

"వంట పై పని అంతా మీ కోడలే చేస్తారా?" అన్న నా ప్రశ్నకి, 'ఆఁ....అంతా తనే చేస్తుంది. పని సరిగ్గా జరిగిందా లేదా అని నేను పర్యవేక్షణ చేస్తూ వుంటాను-అంతే." అంది గృహస్థు తల్లి.

"మీరు వుదయం పూట పూజ చేస్తారా? లేక పూజ కూడా కోడలే చేస్తారా?" అని ప్రశ్నించాను.

"నాకేమీ లేదు. అదీ కోడలే చూసుకుంటుంది. పూర్వం వేదవ్యాసుడు రాసిన తాళపత్ర భాగవతాన్ని పూజించేవాళ్ళం. ఇప్పుడు జగన్నాధదాసు (ఒరిస్సాలో పేరెన్నికగన్న పంచ సఖులలో ఒకరు) రాసిన భాగవతాన్ని పూజిస్తున్నాం." అన్నారామె.

తరువాత ఆ గృహిణి నన్ను పక్క యింటికి తీసుకువెళ్ళి ధాన్యాన్ని దంపే ఢింకీని చూపించింది. మనవైపు వుండే రోలు, రోకళ్ళు ఇక్కడ తెలియవు. ఇక్కడ ఢింకీ సహాయంతో ధాన్యాన్ని దంపుతారు. ఇది కొంచం 'సీసా' ఆటలా వుంటుంది. దుంగకి ఒక వైపు లావాటి పొన్ను వుంటుంది. అడుగున వెడల్పాటి గుంట వుంటుంది. అందులో ధాన్యం పోస్తారు. దుంగ మీద రెండోవైపున ఎక్కగానే రోకలి పొన్ను పైకి లేస్తుంది. దుంగ నుంచి క్రిందికి దిగగానే రోకలి పొన్ను గుంటలోని ధాన్యం మీద పడుతుంది. ఈ విధంగా దుంగ మీద ఎక్కిదిగీ కసరత్తు చేస్తూ గృహిణి ధాన్యం దంపుతుంది.

ఆ రోజల్లా 'బారిమూళో' సోదరీమణులతో ఎంతో సరదాగా గడిచింది. గ్రామీణస్త్రీల జీవిత విధానం గురించి స్వయంగా చూసి తెలుసుకున్నాం. మన తెలుగువారి ఆచార వ్యవహారాలు, కట్టుబాట్ల గురించి వివరంగా చెబుతూంటే ఆ వనితలెంతో కుతూహలంగా విన్నారు. "జీవితంలో ఎప్పుడో ఒకసారి చేతిలో డబ్బున్నప్పుడు వచ్చి మీ తెలుగునాడునీ, అక్కడి దేవాలయాల్నీ చూడాలని మా కోరిక." అన్నారు వారు.

## రజస్వల

మొట్టమొదటిసారిగా అమ్మాయి రజస్వల అయినప్పుడు ఏడు రోజుల పాటు ఎవర్నీ చూడకూడదు. మొదటి రోజున ఏడుగురు ముత్తైదువులు ఆ అమ్మాయిని, తగలకుండా పసుపునీళ్ళు చల్లి 'హుళాహుళి' చేస్తారు. అంటే మనం చంటి పిల్లల్ని నిద్రపుచ్చడానికి 'ఓళోళోళోహాయీ_' అంటూ జోలపాట పాడతాం కదూ! అదే విధంగా నోట్లో నాలుకను వేగంగా అటూ యిటూ కదుపుతూ గట్టిగా కూతలుపెడతారు. దీనినే 'హుళాహుళి' అని అంటారు. శుభసమయాల్లోనూ, పూజల్లోనూ యీ 'హుళాహుళి' చేస్తారు. శంఖం వూదుతారు. తరువాత నాలుగవ రోజున రెండవసారి, మూడవసారి కూడా స్నానాలు చేయిస్తారు ఆ అమ్మాయి చేత. ఏడు రోజులపాటు ఆ అమ్మాయి పురుషులకంట పడకూడదు. ఉప్పు తినకూడదు. కొబ్బరి, పంచదార తినవచ్చు. భోంచేసాక విస్తరి ఎవరికంటా పడకుండా పారవేసి రావాలి. ఏడవ రోజు కొత్త చీర కట్టించి పూజచేసి అందర్నీ పిలిచి విందు చేస్తారు.

ఆంధ్ర సరిహద్దులకు దగ్గరగా వున్న ఒరిస్సాలో మినహాయిస్తే మధ్య ఒరిస్సాలో యీ బహిష్ఠు పట్ల అంత పట్టింపులేదు. ఎప్పుడయితే అప్పుడే_ రాత్రయితే రాత్రే తలారాస్నానం చేసి కట్టుకున్న చీర తడిపిపడేసి యింట్లోకి వస్తారు. పూర్వం విడిగా మూడు రోజులూ కూర్చునేవారుట. కాని యిప్పుడు ఆ ఆచారం చాలా ఇళ్ళలో తప్పిపోయింది. దూరంగా కూర్చోవటం అనాగరిక లక్షణంగా నేటి విద్యాధికులు భావిస్తున్నారు. మొదటిసారి అయినప్పుడు కూడా ఎవరికీ తెలియనీయడం లేదు. ఇంట్లో పెద్దవాళ్ళు కూడా దీనికి అభ్యంతరం చెప్పడం లేదు.

[ సశేషం ]



# దేవయాని చౌబాల్

'బ్రతకు లేక బడిపంతులు ఉద్యోగం' ''ఏ డిపార్ట్‌మెంట్ లేకపోతే ఎడ్యుకేషన్ డిపార్ట్‌మెంట్'' – లాంటి హాస్యోక్తులు ఉపాధ్యాయుల ఉవాచలుగా తరచూ వింటూ వుంటాం. అదే విధంగా కొందరు పత్రికా రచయితలే ''అం ఏముంది లెండి. అక్షరం ముక్క నేర్చిన ప్రతి ఒక్కరూ పత్రికా రచయితలై కూర్చుంటువ్నారు.'' అని అంటూ వుంటారు.

ఈ అభిప్రాయానికి పూర్తిగా విరుద్ధమైన ఒక ఉదాహరణ–దేవి! ఎంచేతంటే బొంబాయి విశ్వ విద్యాలయం నుంచి డిగ్రీ సంపాయించిన ఈ మహారాష్ట్ర వనిత జర్నలిజంలో ప్రత్యేక శిక్షణ కూడా పొందారు. విద్య విషయం ప్రస్తావించినప్పుడు హాస్య ధోరణిలో ''చదువులో నే నెప్పుడూ థర్డ్ క్లాసే'' అన్నారు 'దేవి' నవ్వుతూ.

ఫిలిం జర్నలిజంలో ముఖ్యంగా హిందీ సినిమా పత్రికలలో (గాసిప్) నీలి వార్తలు ప్రవేశ పెట్టింది ఎవరు?-అంటే వెంటనే జ్ఞాపకం వచ్చేది 'దేవి.' సుప్రసిద్ధులైన సినిమా పారిశ్రామిక వేత్తలను, సినిమా పరిశ్రమలోని అవకతవకలను విమర్శించి, గుట్టు బట్టబయలు చేసి వాఖ్యానించడంలో పేరు తెచ్చుకున్న 'దేవి' పూర్తి పేరు కుమారి దేవయాని చౌబాల్ !

'ఫిలింఫేర్' పత్రిక ద్వారా దేవి పత్రికా రంగంలో అడుగు పెట్టారు. కొన్నాళ్ళు 'స్క్రీన్' పత్రికలోనూ, మరికొన్నాళ్ళు ''స్టార్ అండ్ స్టయిల్'' పత్రికలోనూ ఉద్యోగం చేశాడు. ఏదో ఒకటి చెయ్యాలనే ఉత్సాహం ఆమెలో ఎప్పుడూ ఉరకలు వేస్తూ వుంటుంది. అంచేత ఏ ఒక్క పత్రికలోనూ చాలాకాలం ఇమడలేకపోయారు. ప్రస్తుతం 'స్టార్ అండ్ స్టయిల్', 'స్టార్‌డస్ట్', 'సూపర్', 'ఇండియా టుడే', 'కరెంట్' (ఇంగ్లీషు, హిందీ), 'లోక్‌సత్త' (మరాఠీ), 'చిత్రలేఖ' (గుజరాతి) మొదలైన పత్రికలలో ఫ్రీలాన్సర్‌గా తన రచనలు వెలువరిస్తున్నారు. తననొక మూడోరకం విద్యార్థినిగా చెప్పుకునే ఈ రచయిత్రి రచనలు అనేక భాషలలో, ప్రముఖ పత్రికలలో వెలువడడం విశేషమే మరి !

పత్రికా రచనతోపాటు అప్పుడప్పుడు కవిత అల్లడం అంటే కూడా 'దేవి'కి చాలా సరదా ! ◘



# వంటలు

## ప్పిట్టు

**ఇ**ది కేరళవాసుల ప్రత్యేకమైన ఫలహారము. దీనిని సాధారణంగా బ్రేక్‌ఫాస్ట్‌కు వీరు చేస్తూ వుంటారు. దీనిని తయారు చేయడానికి ఇక్కడ ప్రత్యేకమైన అల్యూమినియం పాత్ర దొరుకుతుంది. (ఒక చిన్న మూతిగల చెంబుకు పైన 7, 8 అంగుళాల గొట్టం అమర్చబడి వుంటుంది. దీన్ని చెంబు నుంచి వేరు చేయవచ్చు. ఈ గొట్టానికి అడుగున చిల్లులున్న బిళ్ళ, పైన చిల్లులున్న మూత వుంటాయి. ప్పిట్టును ఈ గొట్టంలోనే తయారు చేస్తారు.) పూర్వం వెదురు బొంగులలో చేసేవారట. ఇప్పటికీ కొద్ది మంది వీటిలోనే చేస్తూ వుంటారు. రుచి ఎక్కువగా వుంటుందని కొంతమంది కొబ్బరి చిప్పలలో కూడా చేస్తూ వుంటారు. పిండి కలపడం, పుడకడం సరిగా వుంటే దేనిలోనైనా ఈ ఫలహారం బాగానే వస్తుంది. ఇప్పుడు నేను కొబ్బరి చిప్పలో దీన్నెలా చేసేది వివరిస్తాను.

**కావలసిన పదార్థాలు : వచ్చిబియ్యం 1 కిలో, కొబ్బరికాయలు 2, కొద్దిగా ఉప్పు, అడుగున మూడు చిల్లులుండే కొబ్బరి చిప్ప 1, చిన్న మూతి గల చెంబు 1.**

బియ్యాన్ని నీళ్ళలో నానవేసి పిండికొట్టి రవ జల్లెడతో జల్లించాలి. పిండి వున్నా ఫరవాలేదు. ఈ పిండిని బూర్లె మూకుడులో వేసి మాడనివ్వకుండా మంచి వాసన వచ్చేంతవరకూ వేయించాలి. ఈ పిండిని ఒక వెడల్పాటి తాంబాణలో పోసి పెట్టుకోవాలి.

రెండు కొబ్బరికాయలు కొట్టి కోరి పెట్టుకోవాలి. పిండికి తగ్గ ఉప్పును కొద్దిగా నీళ్ళలో బాగా కరగనివ్వాలి. ఈ నీళ్ళను కొద్దికొద్దిగా చిలకరిస్తూ పిండిన్ని బాగా కలపాలి. (నీళ్ళను ఒకే సారి ఎక్కువగా పోసి కలపరాదు) పిండి ముద్దలా కాకుండా కలపాలి. ఎంతవరకూ కలపాలంటే పిండిని చేతిలో తీసుకుని వత్తితే ముద్దలాగ అయి మళ్ళీ వ్రేళ్ళలో చిదిపినప్పుడు పొడిపొడిగా కావాలి.

ఇప్పుడు పిండి రెడీ అయిందన్నమాట. చెంబులో రెండు గ్లాసుల నీళ్ళు పోసి పొయ్యి మీద పెట్టాలి. కొబ్బరి చిప్ప శుభ్రం చేసుకుని అడుగున కోరి పెట్టుకున్న కొబ్బరి వేయాలి. తరువాత చిప్ప నిండేవరకు పిండిని పోయాలి. మళ్ళీ పిండి పైన కొబ్బరి పరవాలి. ఈ చిప్పను చెంబు మీద పెట్టాలి. చిప్ప అడుగు భాగం నుంచి ప్రక్కలకు ఆవిరిపోకుండా చూసుకోవాలి. ఈ చిప్పపైన చిల్లులుండే మూతను ఉంచాలి. ఐదు నిమిషాలనంతరం చిల్లుల మూతలోనుంచి ఆవిరి పైకి వస్తుంది. అంటే పిండి వుడికినందుకు గుర్తు అన్నమాట. అలాగ ఆవిరి వచ్చిన రెండు మూడు నిమిషాలకు చిప్పను తీసి ఒక ప్లేటులో బోర్లించి తట్టితే ఇడ్లీ లాగ రెండువైపులా కొబ్బరితో తెల్లటి కండెపూడి పడుతుంది. ఇదే ప్పిట్టు. ఇలాగే అంతపిండిని చేసి పెట్టుకోవాలి. దీనికి ఆధరువుగా తినేందుకు ఇక్కడివాళ్ళు చాలా రకాలు చేస్తారు. ప్పిట్టు, పళం, పప్పడం, పైరు, పాయసం అనేది నానుడి. పాయసం లేకపోయినా మిగతావి వుంటేనే ప్పిట్టు రుచిగా వుంటుంది.

పైరు ఎలా చేస్తారో వివరిస్తాను.

**పెసలు ¼ కిలో, కొబ్బరికాయ 1, పచ్చిమిరపకాయలు 8, జీలకర్ర కొద్దిగా, తగినంత ఉప్పు.**

మొదట పెసలను మెత్తగా వుడికించుకోవాలి. కొబ్బరికాయను కోరాలి. ఇప్పుడు కొబ్బరి కోరును, జీలకర్ర, ఉప్పు, పచ్చిమిరపకాయలు వేసి మెత్తగా రుబ్బాలి. ఈ రుబ్బిన ముద్దను ఉడికించిన పెసలతో కలిపి మరొకసారి మరిగించాలి. ఇది సాంబారులాగ వుండాలి.

పైరు వేసుకుని కలుపుకుని అప్పడాలు పళ్ళు నంజుకుంటూ మధ్యలో టీ తాగుతూ వుంటే ఈ ప్పిట్టు చాలా రుచిగా వుంటుంది.

—వై. రేణుకాదేవి

## కేరెట్ కట్లెట్

**కావలసిన పదార్థాలు : కేరెట్లు – ½ కిలో, వేయించిన శనగపప్పు - 100 గ్రాములు, పచ్చిమిరపకాయలు-12, ఉల్లిపాయలు-5, డాల్డా-200 గ్రాములు, (నూనెగానీ, నెయ్యిగానీ డాల్డాకి బదులుగా ఉపయోగించవచ్చు), అల్లంముక్క, లవంగం, వెల్లుల్లి, కొత్తిమీర, తగినంత ఉప్పు.**

తయారు చేయు విధానం : కేరెట్ చెక్కు తీసి ముందస్తుగా నీరుపోసి వుడికించాలి. పచ్చిమిర్చి, ఉల్లిపాయలు, కొత్తిమీర చిన్న చిన్న ముక్కలుగా తరిగి వుంచుకోవాలి. శనగపప్పు మెత్తగా దంపుకోవాలి. అల్లం, లవంగం, వెల్లుల్లి ముద్దగా నూరి వుంచుకోవాలి. కేరట్లు బాగా వుడికిన తరువాత వాటిని ముద్దగా నూరాలి. ఇప్పుడిక దీనికి శనగపొడి, ఉల్లిపాయ, పచ్చిమిరపకాయ, కొత్తిమీర ముక్కలు, అల్లం ముద్ద, ఉప్పు కలపాలి. ఆ తరువాత పెనం మీద కొద్దిగా డాల్డాగానీ నూనెగానీ వేసి, నిమ్మకాయంత సైజు ముద్దను తీసి చేతిపై పెట్టి మనకి కావలసిన ఆకారంలో త్రికోణంవలె కానీ, నలుచదరంగాకానీ చేసుకుని పెనం మీద డాల్డాతో వేయించాలి.ఈ కేరెట్ కట్లెట్ వేడివేడిగా తింటే బాగా వుంటుంది.

—నందారజిని

## మద్దూరువడ

**కావలసిన పదార్థాలు : మైదా-1 కప్పు, రవ-1 కప్పు, బియ్యప్పిండి – 1 కప్పు, ఉల్లిపాయలు, పచ్చిమిరపకాయలు, అల్లం, కొత్తిమీర, వెల్లుల్లి, ఉప్పు తగినంత, కొద్దిగా నూనె.**

తయారుచేయు విధానం : మైదా, రవ, బియ్యప్పిండి మూడింటిని తడి తగలకుండా జల్లించుకోవాలి. ఉల్లిపాయ సన్నటి ముక్కలుగా తరుగుకొని ఈ మిశ్రమానికి చేర్చాలి. పచ్చిమిరప, అల్లం, కొత్తిమీర, ఉప్పు కలిపి మెత్తగా నూరి పిండిలో కలపాలి. ఇప్పుడు కాచిన నూనె ఒక గరిటెడు పిండిలో వేసి బాగా కలియదియ్యాలి. ఆ పిండి యింకా పొడిగా వున్నట్లయితే కొద్దిగా నీరు చేర్చి ముద్దగా చేసుకోవాలి. బాణలిలో నూనెపోసి, నూనె కాగిన తరువాత ఈ పిండిని చిన్న చిన్న ఉండలుగా చేసి, కొద్ది వెడల్పులో అరచేతి మీద తడుతూ చిన్న పూరీలువలె చేసుకుని వేయించాలి. ఇలా చేసుకున్న మద్దూరువడ రెండు మూడు రోజుల దాకా నిలవ వుంటాయి.

—ఎ. శ్రీలక్ష్మి




నిర్వహణ: మంగళా కందూర్

జయప్రద. జి, తెనాలి

ఆప్లిక్ వర్క్ డిజైన్స్ దొరకటం లేదు. మంచి ఫ్లవర్స్‌గాని, డిజైన్స్‌గాని 'వనిత'లో ప్రచురించండి.

**ఆప్లిక్ చేయటానికి మనమే ఊహించి డిజైన్స్ వేసుకొంటే బాగుంటుంది. అవి తేలిక. ముందు కావలసిన ఆకారంలో పూరేకులు కత్తిరించుకొని, కావలసిన విధంగా అమర్చుకొని కుట్టుకుంటే చాలు. అయినా అడిగారు కాబట్టి కొన్ని ఇస్తున్నాము. వాటిని చూసి మీరు మీకు కావలసిన రకాలలో పువ్వులు అమర్చుకోండి.**



క్రోషియా పిన్‌తో ఫ్లవర్స్ అల్లటం చూపించగోర్తాము.

**త్వరలో వ్రాసి ఫోటోతోసహా పంపుతాము.**

కృష్ణకుమారి, కమలాపురం

మీరు జూలై సంచికలో పద్మసుందరి గురించి చెప్పారు. అది సరిగ పద్మంలాగ రావటంలేదు.




**ఆ సుందరి సరిగ్గా కుచోవాలంటే ఆ రేకులు కట్ చేసే విధానం వేరుగా వుంది. బొమ్మలో లాగ A Bల మధ్య దూరం 6 అంగుళాలు C నుండి నిలువుగా 3 అంగుళాలు. షేప్ జాగ్రత్తగా తీయండి. A Bలు కలుపుతూ మడచి, ఆ భాగం పైకి వుంచాలి. అంటే ఈ భాగం నడుం దగ్గరకు రావాలి. C కొన మనవైపు అంటే క్రింద వుండాలి. ఇలా వుంచుకొని కుట్టండి పద్మం బాగ వస్తుంది.**

హనీకోంబ్ కుట్టు వెయ్యాలి అన్నారు. హనీకోంబ్ అంటే ఏమిటి?

**హనీకోంబ్ అంటే తేనెపట్టు అన్నమాట. అదేలా వుంటుందో అలాగ డైమండ్స్ వచ్చేలా కుట్టు వేయమని అర్థం. ఒక సెంటిమీటర్ దూరంలో చుక్కలు పెట్టుకోవాలి మనకు ఎంత కావాలో అంత పొడుగువా. క్రింద కూడా ఒక సెంటిమీటర్ దూరంలో ఒక చుక్క క్రింద ఇంకొక చుక్క ముగ్గులాగా పెన్సిల్‌తో పెట్టుకొని చుక్కల పైన టాకాలు వేయాలి, ప్రతి లైనుకు విడివిడిగ. తర్వాత అన్ని దారాలు పట్టుకు లాగి సర్దాలి. దీనిపైని కుట్టాలి. మొదటి వరుసలో 1, 2–3, 4–5, 6 ఇలా కుచ్చులు, కలిపి గట్టికుట్టు వేయాలి. రెండవ వరుసకు 2, 3–4, 5-6, 7 వేయాలి. తిరిగి 3వ వరుస మొదటి వరుసలాగా, 4 వ వరుస రెండవ వరుస లాగా కుత్తే డైమండ్స్ లాగా చక్కగా వస్తుంది. చూట్టానికి హనీకోంబ్ లాగా వుంటుంది. పిల్లల ఫ్రాకుల మీదికి చాలా బాగుంటుంది.**

కె. సుబ్బలక్ష్మి, హైదరాబాదు

నేను పూసలతో బ్యాగ్ అల్లాను. అయితే చాలా పూసలు మిగిలిపోయాయి. ఆ పూసలతో ఏమయినా చేయవచ్చునా?



**మిగిలిన పూసలతో 'వనిత'లో రకరకాల బొమ్మలు చేయటం మొదలైనవి చాలా మంది చెప్పారు ప్రయత్నించారా? మీరు ఏ రకాల బ్యాగ్‌లు వేశారు. నేను ఇంకో రకం బ్యాగ్ చెబుతాను.**

కావాలంటే చూడండి. నలుపు గొట్టాలు, క్రీమ్‌కలర్ పూసల కాంబినేషన్ చాలా బాగుంటుంది. లోపల లైనింగ్‌కు ఈ రెండు రంగులు వీటికి మ్యాచ్ అయ్యే వేరే రంగులో సాటిన్‌గాని, వెల్వెట్‌గాని తీసుకొంటే బాగుంటుంది.

బ్యాగ్‌కు (ఫోటో చూడండి) మధ్యన వున్న 7 పూసలు ముందు అల్లనవసరం లేదు. బ్యాగ్ అంతా అయిన తర్వాత విడిగా కలుపుకోవాలి. ఒంటిపొర వయర్‌తో ఈ బ్యాగ్ అల్లాలి.

I రౌండ్-ఒక గొట్టం ఎక్కించుకొని, దానికి 4 పూసలు ఎక్కించి డైమండ్ తయారు చేయాలి. తర్వాత ఇంకొక 3 పూసలు ఎక్కించుకొని ఇంకొక డైమండ్ చేసి మొదటి గొట్టంగుండా క్రిందికి వచ్చి, ఇంకొక గొట్టం ఎక్కించుకోవాలి. ఇలా 15 గొట్టాలు ఎక్కించి రౌండ్ చేయాలి.

II రౌండ్–ఒక్కొక్క డైమండ్‌కు ఒక్కొక్క గొట్టం చొ॥ 30 గొట్టాలు ఎక్కించుకుని రౌండ్ పూర్తి చేయాలి. పైన మాత్రం రెండు గొట్టాలకు మధ్య రెండు పూసల డైమండ్స్ వుండాలి.

III రౌండ్—దీనికి ప్రతి డైమండ్‌కు ఒక గొట్టము చొ॥న కాక ఒక మారు ఒక డైమండ్‌కు 1 గొట్టం తర్వాత రెండు మార్లు 2 డైమండ్స్‌కు 1 గొట్టం చొ॥న ఎక్కిస్తే మొత్తం 37 గొట్టాలు పడ్తాయి. ఇలా వేస్తే పైన కుచ్చుగారాదు. ఆఖరున పైన 3 డైమండ్స్‌గా వస్తుంది. లేకపోతే రౌండ్ సరిగారాదు.

IV రౌండ్-దీనికి ఒక మారు 2 డైమండ్స్‌కు ఒక గొట్టం, ఇంకొక మారు ఒక డైమండ్స్‌కు ఒక గొట్టం చొ॥న అల్లితే మొత్తం 50 గొట్టాలు పడ్తాయి.

ఇలాంటి రౌండ్స్ రెండు అల్లుకొని రెండు మధ్య 2 గాని 3 గాని గొట్టాల వెడల్పుతో సైడ్ అల్లాలి. పైన మనకు కావలసినంత వెడల్పు వదలాలి ఓపెన్‌కుగాను. రెండు అట్ట ముక్కలు పైకి, అడుగుకు తీసుకోవాలి. ఇంకొక పొడవు ముక్క ప్రక్కలకు, క్రిందికి అంటే బేస్‌కు తీసుకొని, లైనింగ్ వేసి స్కెలిటన్ చేసుకొని, ఆ తర్వాత బ్యాగ్‌లో దింపాలి. జిప్ వేయాలి. గ్యాప్ మూయాలంటే రెండు పొరల మధ్య అట్ట వుంచితే స్టిఫ్‌గా వుంటుంది. జిప్‌తో ఈ భాగం కుట్టుకుంటే సరిపోతుంది.

హేండిల్‌కుగాను ఎంత వెడల్పు కావాలంటే అంత వేసుకొని కలుపుకోవాలి. సరి అయిన రంగుల కలయికలో పూసలు, గొట్టాలు వుంటే బ్యాగ్ చాలా బాగుంటుంది.

## పొరుగింటి పుల్లకూర



కాపురానికి వచ్చిన దగ్గర్నుంచి గమనిస్తోంది విమల. తను ఎంత రుచిగా చేసిన వంటైనా ఏదో వంకపెట్టే భర్త-ఇరుగూ పొరుగూ ఇచ్చినది ఏమీ బాగుండకపోయినా, ఎంతో పొగుడుతూ అపురూపంగా తింటారు. పెళ్లై ఇన్నాళ్ళయినా తన వంటతో భర్త మెప్పు పొందలేకపోయానే, ఆయన్ని ఏంచేసి మెప్పించాలా అని ఆలోచనలో పడింది విమల.

రోజూలాగే భోజనం వడ్డిస్తూ ప్రక్కనే చిన్న ప్లేట్లో పెట్టి మూత పెట్టిన పచ్చడి తీసి భర్త కంచంలో వేస్తూ, "పొరుగింటి మీనాక్షమ్మగారితో ఆ మధ్యన ఒకసారి మాటల సందర్భంలో మీకు కంది పచ్చడి అంటే యిష్టం అని చెప్పాను. పాపం జ్ఞాపకం పెట్టుకుని ఇవాళ వాళ్ళింట్లో చేసిందట. మిమ్మల్ని రుచి చూడమని ఇచ్చింది" అంది.

వెంటనే మిగిలిన ఐటమ్స్‌కంటే ముందుగా అదే కాస్త నోట్లో వేసుకుని, "సుపర్బ్! నిజంగా చాలా బావుంది. అసలు మీనాక్షమ్మగారేది వండినా చాలా అద్భుతంగా వుంటుంది" అంటూ పొగడటం ప్రారంభించాడు. అతని మాటలకి అడ్డు తగుల్తూ, "ఆ(....కంది పచ్చడి చెయ్యటం కూడా బ్రహ్మ విద్యేనా" అని ఈసడించి పారేసింది విమల.

"అమ్మమ్మ! ఎంతమాట! నిజానికి వంట చెయ్యటం ఒక కళ. అది అందరికీ అబ్బదు. కందిపచ్చడే కదా అని తేల్గ్గా తీసి పారేశావు. కానీ పప్పు వేయించటం, నీళ్లు చల్లుతూ తగినంత మెత్తగా రుబ్బి, ఉప్పు, కారం, జీలకర్ర తగు మోతాదుల్లో వెయ్యటం – వీటిల్లో ఏది కాస్త ఎక్కువ తక్కువలు జరిగినా దాని అసలు రుచి పోతుంది. అంతెందుకు? నువ్వింతవరకూ ఎన్నోసార్లు కందిపచ్చడి చేశావు–కానీ ఇవాళ మీనాక్షమ్మగారు చేసిన రుచి ఎప్పుడూ రాలేదు. కావాలంటే తినిచూడు" అన్నాడు విమల భర్త.

"ఆ(....ఇంతోటిది తిని చూడక్కర్లేదులెండి. ఆవిడ ఇచ్చేవన్నీ ఎప్పుడూ చూస్తూనే వున్నాగా. అంత బాగుంటే పోనీ మీరే తినండి" అంటూ అంతా అతనికే వేసేసింది విమల.

"ప్చ్! ఆవిడని పొగిడావని నీకు కోపం వస్తే రావచ్చు కానీ, ఇది ఎంత బాగుందంటే ఇంకా ఈ పచ్చడి వుంటే నువ్వు చేసిన ఈ మిగిలిన ఐటమ్స్ అన్నీ వుంచేసి, అన్నమంతా దాంతోనే తినేవాడిని" అన్నాడు.

వెంటనే చివాలున లేచి, వంటింట్లోకి వెళ్ళి చిన్న గిన్నెడు పచ్చడీ తెచ్చి భర్త కంచంలో వేస్తూ, "అలాగే తినండి పోనీ. అంత బాగున్నప్పుడు మానెయ్యటం దేనికీ?" అంది విమల.

"అరే! ఈ పచ్చడి ఎక్కడిదీ?" అని ఆశ్చర్యం ప్రకటించాడు భర్త.

"మీనాక్షమ్మగారివ్వనేలేదసలు. నేనే ఎప్పుడూ చేసినట్లే చేశాను. మీ బుద్ధి ఎటువంటిదో చూడాలని కొంచెం తీసి వేరే ప్లేటులో పెట్టి ఆవిడ ఇచ్చారని చెప్పాను. అందుకని మీకీరోజు చాలా రుచిగా వున్నట్లనిపించి వుంటుంది." అంది విమల తాపీగా.

– వై. రత్న



# బామ్మగారిపేజి

ఏమర్రా!

పోయిన నెలలో పెళ్ళి మంత్రాలు – వాటి అర్థాలూ సూక్ష్మంగా చెప్పాను చూశారుగా – తక్కిన తతంగం గురించి ఈ నెలలో కొంత చెబుతాను. అయితే, 'మాకెందుకూ ఇవి? ఏం ఉపయోగం?' అని చిరాకు పడకండర్రా. పెళ్ళి చేసుకునే వాళ్ళు ఆ మంత్రం ఏమిటో, దాని అర్థం ఏమిటో, ఎందుకో – తెలుసుకోడం ముఖ్యం కాదంటారా! ఏదో పెద్దవాళ్ళు చేస్తున్నారు – మనం చేసేసుకుంటున్నాం-అని కాకుండా, అందులో వున్న అర్థం ఏమిటి – ఎందుకలా చెయ్యాలి- అని తెలుసుకోడం ఎంతైనా ముఖ్యం. ఏమంటారు? –

ఇందా—

ఆ తర్వాత,

కన్యాదాత, కూతురు ఆయుష్యాభివృద్ధి కోసం గౌరీ కంకణ పూజ చేస్తాడు. ఎడమచేతికి రక్ష బంధనం కడతాడు. అప్పుడు ఆ కన్యను ధాన్యపు మూట మీదనో, బియ్యం బస్తా మీదనో కూచోబెడతారు. అలా కూచోబెట్టడం ఎందుకంటారు? – ధనధాన్యాది సమృద్ధి కోసం అన్నమాట.

తర్వాత పూర్వీకుల పేర్లు, గోత్ర నామాలతో కలిపి చెప్పి- "ధర్మ ప్రజా సంపత్త్యర్థం వృణీమహే" అంటారు వధూవరులు. 'ధర్మప్రజా సంపత్త్యర్థం మేము వరించుకుంటాం' అని. 'వరించండి - ఇస్తాను' అంటాడు కన్యాదాత. అలా మ్మూడుసార్లు చెప్పుకుంటారు.

"ధర్మప్రజా సంపత్త్యర్థగ్ం శ్రీయముద్వహే" అని, వరుడు - సంకల్పం చేస్తాడు. కన్యాదాత "లక్ష్మీనారాయణ ప్రీత్యర్థం సాలంకృత కన్యా దానం కరిష్యే" అని సంకల్పం చేసి, పెళ్ళి కుమారుని – లక్ష్మీనారాయణ స్వరూపంగా భావించి, ఆసనం వేసి కాళ్ళు కడుగుతాడు. "కన్యాం కనక సంపన్నాం కనకాభరణైర్యుతాం – దాస్యామి విష్ణవేతుభ్యం, ధర్మ కామార్థ సిద్ధయే" అంటాడు. అంటే - 'బంగారంతో కూడినదీ, బంగారపు నగలు గలదీ అయిన కన్యను ధర్మ కామార్థసిద్ధికి, విష్ణు స్వరూపుడవైన నీకు ఇస్తాను' అని. అలా చెప్పిన తర్వాత, ఉదకపూర్వకంగా కన్యను దానం చేస్తాడు. అంగీకరించినట్టుగా వరుడు - 'స్వస్తీతి ప్రతివచనం స్వస్తి' అని మంత్రం చెబుతాడు. "కన్యాదాన సాద్గుణ్యార్థం దక్షిణాం తుభ్య మహం సంప్రదదే న మమ" అని, వధువు తండ్రి – కన్యాదాన దక్షిణ ఇస్తాడు. ఇచ్చి, "ధర్మార్థ కామేషు త్వ యైషా నాతి చరితవ్యా" అంటాడు. 'ధర్మంలోనూ అర్థంలోనూ దీన్ని నువ్వు ఉల్లంఘించి, ప్రవర్తించకూడదు' అన్నమాట. అప్పుడు వరుడు 'నాతిచరామి' అంటాడు. అంటే–'ధర్మార్థ కామాల్లో ఈ వధువును ఉల్లంఘించి, చరించను' అని. వరుడు కన్యాదాతకు ఇచ్చే వాగ్దానం ఇదే. వివాహ వేదిక మీద వరుడు అగ్ని ప్రతిష్ఠాపనం చేస్తాడు.

వివాహంలో వరుడిని, అతిథిని పూజించేలా పూజిస్తారు. ఈ సమయంలో మధుపర్కానికి ప్రాముఖ్యత వుంది. మధుపర్కం అంటే తేనెతో కలిసిన పదార్థం. వరునికి దగ్గరగా పీటల మీదికి వధువును తీసుకొచ్చి కూర్చోబెడతారు. వరుడు మంత్రాలతో సహా, మంచి ముహూర్తంలో పెళ్ళి కూతురును చూడాలి. అందువల్లనే, వాళ్ళిద్దరి మధ్య తెర పడతారు. కన్యాదాత - తన కుమార్తె ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధికోసం - వరుని మధుపర్క ద్రవ్యంతో పూజిస్తానని సంకల్పం చెప్పి - వరుడి కాళ్ళుకడిగి, వస్త్రాలూ అవీ ఇస్తాడు. అదే వస్త్రాలు చదివించడం! వాటినే 'మధుపర్కాలు' అంటారు. మధుపర్క పూజా సమయంలో ఇచ్చే వస్త్రాలు కాబట్టి-వాటికి మధుపర్కాలన్న పేరొచ్చేసింది! అదీ!

తర్వాత, పెరుగు, తేనె కలిపి కంచుపాత్రలో వుంచి, దానిమీద మరో కంచుపాత్ర మూతలాపెట్టి- "మధుపర్కో మధుపర్కో మధుపర్కః" అని మూడుసార్లు అని, ఆ మధుపర్కాన్ని అభిమంత్రిస్తాడు. "అమృత పదార్థమగు మధుపర్కానికి నువ్వు క్రింది పాత్రవంటి దానివి" అని— ("అమృతో ప స్తరణమసి") కొద్దిగా నీరు తాగుతాడు. "యన్మధునో మధవ్యం పరమమన్నాద్యం వీర్యం...." అన్న మంత్రంలోని అర్థం ఏమిటంటే- 'మధు సంబంధమైన దీన్ని త్రాగడం వీర్యకరమైనది. అందువల్ల నేను వీర్యవంతుడిని అవుతాను.' అని. తేనె మిశ్రమం పుచ్చుకుని, "అమృతాపిధానమసి" అంటాడు. 'ఓ ఉదకమా! నీవు అమృత పదార్థానికి పైకప్పు వంటి దానివి' అని కొంచెం నీరు త్రాగుతాడు. తర్వాత చెయ్యి కడుగుకుని, మిగిలినది తన దయకు పాత్రుడయ్యేవారికి ఇస్తాడు. మధుపర్కపూజ అయిన తర్వాత - కన్యాదానం చేస్తారు. అప్పుడు మంగళాష్టకం చదువుతారు- "తదేవలగ్నం సుదినం తదేవ తారాబలం చంద్ర బలం తదేవ...." అంటూ.

సుముహూర్త సమయంలో వధూవరుల తలల మీద బెల్లం, జీలకర్ర పెడతారు. ఎందుకో తెలుసర్రా – మంగళద్రవ్యాల్ని శిరసుల మీద పెట్టాలన్నారు పెద్దలు. మంగళద్రవ్యాల్లో సులభం గానూ, ఎప్పుడూ దొరికేవి బెల్లం, జీలకర్ర, పసుపు. అంచేత, అవి మూడూ కలిపి ముద్దలా చేసి, వధూవరుల తలల మీద ఉంచుతారు. అప్పుడు "ధ్రువంతే రాజా వరుణో ధ్రువందేవో బృహస్పతిః ధ్రువం త ఇంద్రశ్చాగ్నిశ్చ రాష్ట్రం ధారయతం ధ్రువమ్" అన్న మంత్రం చదువుతారు. 'వరుణుడు, బృహస్పతి, ఇంద్రుడు, అగ్ని — ఈ రాష్ట్రాన్ని ధ్రువమైనదానిగా చేయుదురుగాక! వృత్రాసురుని చంపివచ్చిన ఇంద్రుని లాగా స్థిరంగా రాష్ట్రాన్ని పాలించు' అని-అర్థం. ఈ మంత్రం చదవడంలో సరైన ఉద్దేశం తెలియకపోయినా – అది మాత్రం ఆచారమైపోయింది! ఆ–మరి, మళ్ళీసారి, మరి కొంత చెబుతానర్రా!

## ప్రశ్నలకు జవాబులు

**జి. ప్రమీల, సూర్యాపేట**

బామ్మగారూ! చిక్కుడుపాదు 'ఉగాది' దాటితే, ఉంచకూడదని, అది పూతతో వున్నా కూడా తీసెయ్యమంటారు. ఎందువల్లనండీ?

చిక్కుడు–ఉగాది – అంటే వసంత ఋతువు వచ్చేస్తే ఇహ కాయదు. అందుకని, పాదు

తీసేయొచ్చునన్నమాట. ఉంచడం వల్ల — అది తక్కిన పాదుల మీదా, మొక్కలు మీదా విపరీతంగా పాకుతుంది. ఆ మొక్కలు చావ పిద్దమవుతాయి. అందుకని, తీసేయ మంటారు.

**గుత్తికొండ సుధారాణి, కొల్లూరు**

నివసిస్తున్న ఇంట్లో తేనెపట్టు ఉండకూడదనీ, ఉంటే ఆ ఇల్లు నివాసయోగ్యం కాదనీ, అంటారు. ఇందులో నిజం ఎంత వుందో తెలియజేస్తారా ?

తేనెపట్టు వుంటే, తేనెటీగలు వుంటాయి. పట్టు కదిలిస్తే ఆ ఈగలు జుమ్మని రేగుతాయి. మనుషుల్ని కుడతాయి; ఇళ్ళలో ప్రవేశిస్తాయి. అంచేతనే ఆ మాట అంటారు గాని, ఇంకేమీ కాదు. అయితే, ఇవాళ తేనెపట్టును చాలామంది ఇళ్ళలో కావాలని పెంచుతున్నారు; తేనె తీయిస్తున్నారు.

ఎండాకాలంలో నల్లని వస్త్రాలు ధరించడం ఆరోగ్యకరం కాదంటారు. ఎంచేతనండీ బామ్మగారూ ?

గొడుగులు నల్లగుడ్డలతో చేస్తారు. ఎందుకంటే — ఎండ వేడిని నల్లగుడ్డ లాక్కుంటుంది. గొడుక్కీ, శరీరానికీ దూరం వుంటుంది గనక పర్వాలేదు; అదే నల్లగుడ్డలు తొడుక్కుంటే, ఆ వేడంతా శరీరానికే అంటుకుంటుంది. అది అనారోగ్యకారణం అవుతుంది.

**ఎమ్. పి. యస్. కుమారి, మాడుగుల**

రెండుగా అంటుకుని వున్న 'కవల అరటిపండు' తింటే, కవలపిల్లలు పుడతారంటారు. బామ్మగారూ నిజమేనా ?

అంతా వొట్టిదమ్మా. చెట్టుకు కాపు కాయడంలో, ఒక్కోసారి గెలలోని అరటిపళ్ళు అతుక్కుంటాయి. అవి కవలలనీ, వాటిని విడగొట్టి తినడం పాపం అనీ - చాలామంది అంటూ వుంటారు. మరి, ఒంటిగా వున్న పండు తిన్నా కూడా పాపం రావాలిగదా- ఆ మాట అడిగితే మాత్రం సమాధానం రాదు మరి !

**కె. జి. సరళకుమారి, కుప్పం**

తెల్లవారకముందే మేల్కొని, ప్రతి రోజూ బాల భాస్కరునికి సూర్యనమస్కారాలు చెయ్యడం ఉత్తమం అన్నారుగదా మన పూర్వులు - ఇలా క్రమం తప్పక చెయ్యడం వల్ల జరిగే మంచి ఏమిటి ?

సూర్యనమస్కారాలు చెయ్యడం వ్యాయామం కిందికి వస్తుంది గదమ్మా — ఆ విధంగా అది శరీరారోగ్యానికి ఎంతో మేలుచేస్తుంది. పోతే, ఉదయ సూర్యుని కిరణాలు శరీరం మీద పడితే, చాలా ఆరోగ్యం అన్నారు పెద్దలూ, వైద్యులూ — ఆ కిరణాల్లో రోగనాశన లక్షణాలున్నాయని.

**ఇ. శ్యామలాదేవి, చోడవరం**

నువ్వులు కలలోకి వచ్చినా, ఎవరి దగ్గర్నుంచయినా తీసుకున్నా 'శని' అంటారు. ఇది నిజమేనా ?

దానం చెయ్యడానికి నువ్వుల్ని ఉపయోగిస్తారు. 'తిలోదకాలు ఇవ్వడం' అంటే, వదులుకోడం అన్నమాట. అంచేత నువ్వులకి 'వొదిలివేసే' గుణం వుందని వాటిని పుచ్చుకోకూడదంటారు. శని దేవతకు నువ్వులనూనెతో దీపారాధన చెయ్యడం, నువ్వులు ఇవ్వడం చేస్తారు. నువ్వులు శనికి ఇష్టం కాబట్టి, అవి పుచ్చుకుంటే ఆ నువ్వుల కోసం శని వస్తాదని—ఓ నమ్మకం.

**ఎ. ప్రసన్న, నందిగామ**

నాకు తరచు జలుబు చేస్తూ వుంటుంది. ముక్కు మూసుకుపోయి పని చెయ్యకపోవడంతో, నోటితోనే శ్వాస పీల్చవలసి వస్తుంది. కాస్త కారణాలూ, నివారణోపాయాలూ చెప్పండి.

ఎక్కువగా గాలి తగిలినా, నీళ్ళలో ఎక్కువ సేపు నానినా ముక్కు మూసుకుపోతుంది. మీకు అలాంటి అనుభవం ఏమైనా వుందా— చూసుకోండి. నోటితో శ్వాసపీల్చడం ఆరోగ్యానికి మంచిది కాదు. కొన్నాళ్ళపాటు, రోజూ పసుపుపొడి, నీలగిరితైలం వేసిన నీళ్ళని బాగా ఆవిరిపట్టండి, తగ్గిపోవచ్చు.

**ఎ. లక్ష్మి, ఉల్లాసనగర్**

ప్రతి రోజూ మామూలుగా శరీరస్నానం కాకుండా, శిరస్నానం చేస్తే మంచిదేనా ? దానివల్ల అనారోగ్యమేమైనా చేస్తుందా ? జుట్టు రాలిపోతుందా ?

శిరస్నానం చేసేటప్పుడు, జుట్టు జిడ్డుగా వుండకుండా చూసుకోవాలి. తల బాగా తుడుచుకోవాలి. రోజూ శిరస్నానం చెయ్యడం మగవాళ్ళకయితే పర్వాలేదుగాని, స్త్రీలకు ఇబ్బందే. తలస్నానం అయిన వెంటనే తల బాగా తుడవాలి. తుడవకపోతే, జుట్టు ముద్ద కట్టుకుపోతుంది; పైగా జలుబూ చేస్తుంది. గట్టిగా తుడవడం వల్ల — వెంట్రుకలు విరిగిపోతాయి; ఊడిపోతాయి. అంచేతనే అప్పుడప్పుడు తలకు నూనె పెట్టుకుని, శీకాయితోనో, కుంకుడు పులుసుతోనో రుద్దుకుని, మెత్తగా తుడిచేసుకుంటే, జుట్టు ఆరిపోతుంది; ఆరోగ్యంగానూ వుంటుంది.

**ఆళ్ళచెర్వు అన్నపూర్ణ, గుంతకల్లు**

శరీరం మీద 'పచ్చ' పొడిపించుకోడం మంచిదంటారు. ఎందువల్ల ? మన హైందవ సంప్రదాయాలతో దానికి సంబంధం ఏమైనా ఉందా ? చనిపోయినప్పుడు 'పచ్చ' తప్ప వెంట ఇంకేదీ రాదంటారు. నిజమేనా ?

'పచ్చ' పొడిపించుకోడం హిందువులే కాదు. అన్ని మతాలవారూ, జాతులవారూ చేస్తారు. మోకాళ్లు, మోచేతులూ వాతం చేస్తే అక్కడ పచ్చ వేయించుకుంటే, నయం అవుతుందని, నమ్మకం. అది నిజం కూడా కావచ్చు. అయినా, కొన్ని దేశాలవాళ్లు 'అందం' కోసం వేయించుకుంటున్నారు. చనిపోయినప్పుడు 'పచ్చ' తప్ప మరేదీ రాదనడం— నిజమేగదమ్మా—అది శరీరంతోనే వుంటుంది మరి !



# విశ్వసాహిత్యంలో ఉద్గ్రంథాలు

-'బ్రాహ్మీదేవి'

పదహారవ శతాబ్దపు ఫ్రెంచి సారస్వతంలో రబేలే (Rabelais) రచించిన 'గర్గాంటువా ఎట్ పంటాగ్రుయెల్' అనే గ్రంథం నవలగా పరిగణింపవలసినది. శైలీ, కథాసంవిధానాలలోనూ, సునిశితమైన హాస్యరస పోషణలోనూ దీనికి సాటిగా తగిన రచనలు అతి కొద్దిగా మాత్రమే ఉంటాయని చెప్పవచ్చును.

రబేలే క్రీశ 1483-1495 మధ్య ప్రాంతంలో జన్మించి ఉంటాడని భావింపబడుతున్నది. జన్మస్థలం ఫ్రాన్సు దేశంలో లాయిర్ వేలీ ప్రాంతంలో ఉన్న 'లా దెవినిరి' అనుకుంటున్నారు. చిన్నతనంలో మతప్రచారకుడుగా తర్ఫీదు పొంది మత సంబంధమైన కార్యక్రమాలలో రాణించలేక మాంట్‌పెల్లియర్ విశ్వవిద్యాలయంలో వైద్య విద్య చదివాడు. క్రీ.శ 1530 నాటికి విద్య పూర్తి చేసి 1531లో ఉపాధ్యాయుడుగా పనిచేసి 1532లో లాయిన్స్ నగరంలోని వైద్యశాలలో వైద్యుడుగా నియమింపబడ్డాడు.

ఆ కాలంలో లాయిన్స్ పుస్తక ప్రకాశనకు గణనలో ఉన్నది. రబేలే పరిసరాల ప్రభావంతో రచనా వ్యాసంగంలోకి దిగాడు. అప్పటికే క్రైస్తవ మతంలో సంస్కరణోద్యమాలు ప్రారంభమైనాయి. హాస్య రచయిత అయిన రబేలే ఏదో నూతనోద్యమాన్ని ప్రోత్సహిస్తున్నాడని సోర్‌బోన్ విశ్వవిద్యాలయాన్ని తమ అదుపులో ఉంచుకున్న సంప్రదాయవాదులు అతని మీద కక్ష వహించారు. కార్డనల్ జీన్ డుబెల్లే అనే మతాధికారికి వైద్యుడుగా చేరి రబేలే అతని రక్షణలో ఉన్నాడు. అతనికి విశ్వాస పాత్రుడుగా, మిత్రుడుగా అతనితో పాటు యూరపు ఖండమంతా పర్యటించాడు. 1546, 1547 సంవత్సరాలలో ఫ్రాన్సు దేశం బయటనే వసించి 1550 ప్రాంతంలో ప్యారిస్ నగరానికి కొద్దిమైళ్ళ దూరంలో ఉన్న మ్యూడల్ గ్రామంలో చిన్న చర్చి ఉద్యోగిగా చేరుకున్నాడు. పైవారి ఒత్తిడిని భరించలేక మూడు సంవత్సరాల తర్వాత ఉద్యోగానికి రాజీనామా చేశాడు. 1553 లో మరణించగా ప్యారిస్‌లో అతని శరీరం ఖననం చెయ్యబడింది.

అతని సాహిత్యకీర్తి గణన కెక్కిన తరువాత అతని సమాధి కోసం జనం వెతికారు. కాని దాన్ని గుర్తించలేకపోయారు.

రబేలే బహుముఖ ప్రజ్ఞాశాలి. తిండిపోతుగా నిరంతరం మద్యసేవ్యమానునిగా కొందరు అతన్ని ఊహిస్తున్నప్పటికీ సంఘాన్ని సంస్కరించడానికి అతను తన ఉపదేశాలను, సందేశాలను-సామాన్య ప్రజానీకానికి అందివ్వాలనే ఉద్దేశంతో హాస్య ధోరణిని, కొంత సిగ్గుమాలిన మోటు తరహాను అవలంబించాడు. ఏమైనా - రబేలే తన సమకాలిక సంఘానికి దర్పణం వంటి రచనలు చేశాడు. ఆనాటి ఫ్రెంచి సంఘ జీవితంలో ప్రతి అంశమూ ప్రతి భావమూ అతని రచనలో కన్పిస్తుంది. అతని విజ్ఞానతృష్ణ, జీవనోత్సాహం అద్వితీయమైనవి.

## కథ

గర్గాంటువా అనే అతను 'చినాన్' ప్రాంత నివాసి. మహాస్థూలకాయుడు. అతని తండ్రి గ్రాండ్‌గౌసియర్ యుటోపియా రాజుగా వర్ణింపబడ్డాడు. నిజానికి ఒకటి రెండు ఊళ్ళకు జమీందారులాంటివాడు. తిండిపోతు తనానికి, పరిమితిలేని మద్యసేవకు ప్రథమ గణ్యత గల గర్గాంటువా మిగిలిన విషయాలలో ఇతరులవంటివాడే. అతనికి స్వస్థలంలో చదువు బాగా అబ్బటం లేదని భావించి తండ్రి అతనిని ప్యారిస్ నగరానికి పంపించాడు. అక్కడ అతనికి పోనోక్రేట్స్ అనే ఉపాధ్యాయుని దగ్గర చదువు ఏర్పాటైంది. ఆనాటి విద్యలలో కొత్త వాటిని ఉపాధ్యాయుడు అతనికి నేర్పడానికి ప్రయత్నించాడు.

గర్గాంటువా ఎన్నో సాహసకృత్యాలు చేశాడు ప్యారిస్ నగరంలో. నాటర్‌డేం చర్చి గంటల్ని దొంగిలించి తన గుర్రపు తలకు అలంకారంగా కట్టడం ఆసాహసకృత్యాలలో ఒకటి. అతను ప్యారిస్‌లో ఉండగా అతని తండ్రికి పక్కదేశపు రాజైన పిక్రోఖోల్‌తో యుద్ధం వస్తుంది. అతడు నిజానికి ప్రక్కదేశపు రాజు కాడు. ఒక పెద్దభూస్వామి. అది యుద్ధమూ కాదు. న్యాయస్థానంలో దావా. యుద్ధానికి కారణమేమిటంటే పిక్రోఖోల్ మనుష్యులు గర్గాంటువా తండ్రి పొలాలలో కొంత ధాన్యం దొంగిలించడం.

గర్గాంటువా ఇంటికి తిరిగి వచ్చి తండ్రి ఆజ్ఞతో శత్రువుల్ని ఓడించాడు. అతనికి శత్రు విజయంలో తోడ్పడినవాడు జీన్‌దెస్ ఎంటోమ్మియర్స్ అనే ఒక తెగకు చెందిన మతాధికారి. కృతజ్ఞతతో గర్గాంటువా ఒక ఆశ్రమం కట్టించి ఇచ్చాడతనికి. మధ్యయుగం నాటి సన్యాస ఆశ్రమ భావాలకు అన్నివిధాలా విరుద్ధంగా ఉంటాయి యీ ఆశ్రమ పద్ధతులు. అందులో మగవాళ్ళు, ఆడవాళ్ళు అంతా కలిసి ఉంటారు. వివాహం చేసుకోవచ్చు. లేకపోయినా కలిసి ఉండవచ్చు. ఆ ఆశ్రమం యొక్క ప్రాథమిక సిద్ధాంతం 'యథేచ్ఛావిహారం.'

ఆ గ్రంథానికి రెండవ భాగంలో పంటాగ్రుయెల్ నాయకుడు. ఇతను గర్గాంటువా కుమారుడు. తండ్రి లాగానే తిండిపోతు, త్రాగుబోతు. ఇతను కూడా చదువుకోసం ప్యారిస్ నగరానికి వెళ్ళాడు. పనుర్గే అనేవాడు అక్కడ మిత్రుడైనాడు. అక్కడ అతను ఉండగా తండ్రి రాజ్యాన్ని డిపోసోడ్స్ అనే (అతిదాహం గలవాళ్ళు) ముఠా దండెత్తి వచ్చి ముట్టడించినదని వార్త వస్తుంది. పంటాగ్రుయెల్ వాళ్ళని ఎదుర్కొంటాడు.

మూడవ భాగంలో పనుర్గే సేనలో చేరడాన్ని తప్పించుకోవడానికి పెండ్లి చేసుకోవాలనుకుంటాడు. పెండ్లి చేసుకుంటే సంవత్సరకాలం సేనలో పని చెయ్యనక్కరలేదట. అతని వివాహ సమస్యను మిత్రులు చర్చిస్తారు-స్త్రీల యొక్క శీలాన్ని గురించి స్థానాన్ని గురించి, సంఘంలో మేధావి వర్గానికి చెందినవారని భావింపబడుతున్న ఒక మత శాస్త్రమెరిగినవానినీ, ఒక న్యాయవాదినీ - ఒక జ్యోతిష్కునీ-ఒక వైద్యుణ్ణీ - ఒక తాత్త్వికుణ్ణీ, ఒక విదూషకుణ్ణీ సంప్రతిస్తారు. వారందరి అభిప్రాయాలూ ఆశాభంగాన్నే కలిగిస్తాయి.

పన్గగ్గే నిరుత్సాహపడలేదు. మరొక అభిప్రాయాన్ని కూడా తెలుసుకుందామనుకుంటాడు.

గ్రంథంలో నాలుగైదు భాగాలు ఆరకిల్ (సోదె చెప్పుస్థానాన్ని)ను వెదకుతూ చేసిన ప్రయాణాలున్నాయి. ఎన్నో చిత్రమైన దేశాల గుండా ప్రయాణాలు సాగినై. రబెలే అపహాస్యంతో ఎగతాళి చేయదలచిన వ్యవస్థలన్నీ-(క్రైస్తవ మతాచార్యులు-న్యాయస్థానాలు, ప్రభుత్వకోశము - తాత్త్విక సంప్రదాయాలు - మొదలైనవన్నీ) తటస్థపడతాయి. కొన్ని ఉపకథలు మరీ చిత్రంగా ఉంటాయి. ఒక చలిదేశం ఉన్నదట. అక్కడ మాటలు - ధ్వని-శీతకాలంలో గడ్డకట్టుతుందట. వసంతకాలంలో కరగుతుందట. ఈ కథను ఎందరో సాహిత్యకారులు అనువదించారు తరువాత కాలంలో.

ఐదవభాగం ముగింపు రూపకాలంకారమయంగా ఉన్నది. హోలీబాటిల్ (పవిత్రమైన సీసా) ద్రాక్షపానీయం మాత్రమే కాదు. సత్యానికి సంకేతం. దానికోసం అందరికీ దాహం. దాన్ని చేరేముందు ప్రయాణం 'దీపభూమి'గుండా జరుగుంది. అక్కడి జనం ఉత్తములు, ఋజువర్తనులు, విద్వాంసులు. తమకు త్రోవలో వెల్తురుకోసం-కథలోని ప్రయాణీకులు "పియరీ అమీ" అనే వాని దీపాన్ని ఎరువు తీసుకుంటారు. ఈ పేరు రబేలేకు పూర్వం గ్రీకు భాష నేర్పిన ఉపాధ్యాయుడిదట. ఆయనయందు కృతజ్ఞతా గౌరవాలు కన్పిస్తాయి కథలో.

చివరకు సోదె చెప్పేచోటు (ఆరకిల్ ఆఫ్ ది హోలీబాటిల్)ను చేరుతాడు. దానికి ఒక స్త్రీ పౌరోహిత్యం వహిస్తున్నది. ఆమె పేరు బేక్‌బక్. ఆమె తలా ఒక పాత్రతో పరిశుద్ధమైన నీళ్ళు త్రాగటానికిస్తుంది. ఆ నీళ్ళు ఎవరికి, ఏది ప్రీతిపాత్రమైన పానమో-ఆ రకంగా రుచిని ఇస్తాయి. 'సత్యం' నిజానికి ఎవరికి తగినట్లు వాళ్ళకు అర్థమౌతుంది.

ఈ పతాక సన్నివేశంతో కథ ముగిస్తుంది. గ్రంథం పరిసమాప్తి పొందింది.

రబేలే రచనలో అపహాస్యం చెయ్యబడింది ఎక్కువగా తింటిపోతుతనమూ త్రాగుబోతుతనమూ. కొంచెంగా పోకిరితనం కూడా.

ఏమైనా రబేలే మాత్రం - నిర్దుష్టమైన మానవతావాదిగా - ఉత్సాహిగా - మేధావిగా-వినయశీలిగా-మర్యాదస్తుడుగా - ఋజువర్తనుడుగా - రచనలో మనకు కన్పిస్తూ ఉంటాడు. □

## డైమండ్ ముగ్గు

మొదట ఒకదానికొకటి సమాన దూరంలో వుండేలా 18 చుక్కలు 6 వరుసల్లో పెట్టాలి. ఆ 6 వరుసలకూ యిటు, అటూ రెండువైపులా రెండేసి చుక్కల చొప్పున తగ్గిస్తూ 6 చుక్కలు వచ్చేదాకా చుక్కలు వుంచాలి. ఈ చుక్కలు ఎలా వుంచాలో మొదటి చిత్రం చూస్తే స్పష్టంగా తెలుస్తుంది. రెండవ చిత్రంలో చూపిన విధంగా ముగ్గును పూర్తి చేయాలి. —కె. జి. హేమలత







# పరిష్కారం లేని సమస్య

'ఏమే, ముందు వచ్చిన చెవులు కంటె వెనకొచ్చిన కొమ్ములు వాడిట—అందరిళ్ళు చేసుకుని ఎనిమిది గంటలకా వస్తావు? ఏమిటే నీ ఉద్దేశం, పని చెయ్యాలని వుందా లేదా అసలు? పిల్లలు ఎనిమిది గంటలకల్లా స్కూలుకి వెళ్ళాలి, వంట చెయ్యాలి అని తెలుసుండీ యిప్పుడటే వస్తావు? ఒక్కొక్క గిన్నె కడుక్కోడం, వండుకోడం, నే తోముకునే మాటయితే నీవెందుకు, పని తిన్నగా చేస్తావో లేదో చెప్పేయి, ఇంక వూరుకోను.' ఎనిమిది గంటలకి సావకాశంగా గుమ్మంలోకి వచ్చిన సీతాలుని గుమ్మంలోనే నిలబెట్టి దులిపేసింది పద్మావతి. తనిల్లు ముందు వప్పుకుని మరో రెండిళ్ల చేసుకుని వస్తున్న సీతాలుని చూసి ఉక్రోషంగా కడిగేసింది.

'నానేటి సేస్తానమ్మగోరూ. ఆ లతమ్మగోరు ఆల్లాయనతో దెబ్బలాడి పెట్టెబేడ సర్దుకుని పుట్టింటికెల్లిపోనాది. బెడ్డింగుకట్టి, అదట్రా, యిదట్రా అంటూ ఊదరగొట్టింది. టాక్సీతెమ్మని పంపిందామ్మ. ఆయమ్మ ఎల్లేవరకు వదిలిందిగాదు——యీ పని ఆ పని సేయించుకుంటూ. ఈపూట ఆలీశం అయిపోనాది' అంది సీతాలు. పద్మావతి కోపం చప్పున దిగజారిపోయింది. కుతూహలంగా, ఆశ్చర్యంగా సీతాలు వేపు చూస్తూ 'ఏమిటీ లతమ్మ పుట్టింటికెళ్ళిపోయిందా. అదెప్పుడే. ఏమయిందీ. ఆయనతో ...కు దెబ్బలాడింది. ఏం జరిగిందీ....' చాలా

డి. కామేశ్వరి

కుతూహలంగా వంట పని కూడా మరిచిపోయి అడిగింది. అమ్మగారి కోపం తగ్గిపోయిందని గుర్తించిన సీతాలు సావకాశంగా అంట్లు తీసికెళ్ళి కొళాయిదగ్గిర పడేసుకుంటూ 'ఏంటో నమ్మగోరు, గొప్పింటోళ్ళు. ఆల్లగొడవలు మాకేటి తెలుస్తాయి? ఆయమ్మ ఎప్పుడూ అయ్య మీద సిర్రుబుర్రు లాడతానే వుంటుంది. అయ్య మంచోడే. అమ్మే కయ్యానికి కాలుదువ్వుతుంటుంది ఎప్పుడూ. రోజుకోసారన్నా దేనికోదానికి దెబ్బలాటలేందే ఆ అమ్మకి తోచదుగామోలు. అయ్య వూరుకున్నా రెచ్చగొడ్తుంది. యీ ఏల ఏటయిందో గాని, పెద్ద నోరెట్టుకుని పడగ్గదిలో ఏటో అరుసుకున్నారు యిద్దరూ. అయ్య బైటికివచ్చి 'ఇదిగో లతా వూరుకుంటున్నానని మరీ రెచ్చిపోతున్నావు దేనికన్నా హద్దుంది. నీ బెదిరింపులు చాలించు. పోతాను పోతాను అన్నవాళ్ళని ఎన్నాళ్ళుపట్టి ఆపగలను. మహారాజులా వెళ్ళు. డబ్బుందనిగదూ నీ మిడిసిపాటు, మొగుడక్కరలేదనుకుంటే మహారాజులా వెళ్ళు. అంతేగాని బెదిరించకు. యిదే ఆఖరుసారి చెప్పడం.' అని కేకలెట్టారు. ఆ యమ్మ విసవిస పైకి వచ్చి 'బెదిరింపు కాదు చేసి చూపిస్తాను. మీరేమన్నా గతిలేక పడుంటానని అనుకోకండి. మీ మగతనం, గొప్ప నా దగ్గిరకాదు. అందరిలా ఏమన్నా పడుంటానని అనుకోకండి. మీకు పెళ్ళాం అక్కరలేదనుకుంటే పట్టుకు వేళ్ళాడేంత దద్దమ్మని కాను. అంత ఖర్మాపట్టలేదు.' అంటూ ఏటేటో అంటు దబదబ పెట్టెలు లాగి సర్దేసుకుందమ్మగోరూ. ఆ బాబు వల్లకున్నాడు. ఆఖరున ఆ బాబే పాపం తగ్గిపోనాడు. 'ఏమిటి లతా బాగా ఆలోచింఛావా....నీకింత మూర్ఖత్వం పనికిరాదు' అంటూ నచ్చచెప్పబోనాడు, ఆ అమ్మ ఇనుకోకుండా చెయ్యి యిసిరికొట్టి చరచర టాక్సిలో కూకుని ఎల్లిపోనాది....ఆ అమ్మ ఎంతకన్నా తగునమ్మగోరు....అమ్మో....ఓ మొగుడు భక్తి, గౌరవం నేకుండా ఎప్పుడూ కసిరికొడ్తుంది....' సీతాలు సినిమా కథలా వర్ణించి చెప్తుంటే పద్మావతి చాలా కుతూహలంగా వింది. పద్మావతి అనాగరికురాలు, చదువు సంస్కారాలు లేనిదేంగాదు. పరాయియింటి విషయాలు మనకెందుకు అనుకునేపాటి సభ్యతా సంస్కారాలు తెల్సినదే. కాని, పద్మావతి ఆడది. ఏం చదివినా, ఏం చేసినా పొరుగింట్లో ఏదో గొడవ జరుగుతూంటే అందులో భార్యాభర్తల గొడవలనగానే కుతూహలం చూపకుండా వుండలేకపోయింది. అది స్త్రీ నైజం. అంతేకాక ఆ కుటుంబంతో కాస్తో కూస్తో పరిచయం వుంది కనక, లత స్వభావం కొద్దిగా తెలుసు కనక-భార్యాభర్తల మధ్య ఏం జరిగిందో అన్న కుతూహలం నిలవనీయక సీతాలుని ప్రశ్నల మీద ప్రశ్నలు అడిగింది.

'అమ్మా - స్కూలికి టైమవుతూంది అన్నం పెట్టమ్మా' అన్న కొడుకు కేకతో ప్రశ్నలు చాలించి వంట ఇంట్లోకి వెళ్ళింది పద్మావతి - పిల్లలు భోంచేసి వెళ్ళాక ఆ కబురు భర్తతో చెప్పేవరకు తోచలేదు ఆమెకి - 'అరే - అదెప్పుడు - వెళ్ళిపోయిందా నిజంగా' అన్నాడు ఆశ్చర్యంగా

రామారావు. 'నిజంగానేనా ఏమిటి, సీతాలు చెప్తుంటేనే.... మొత్తానికి బలే ఆవిడ - ఏం ధైర్యం అలా యిల్లు వదిలిపోవడానికి - ఎవరన్నా ఏమన్నా అనుకుంటారన్న భయమైనా లేకుండా....' ఆమె ధైర్యానికి మెచ్చుకుంటుందో - నిరసిస్తుందో పద్మావతికే తెలియకుండా అంది.

"హు....యీ ఆడవాళ్ళకి కాస్త చేతిలో డబ్బు ఆడిందంటే యింక ఎవర్నీ లెక్కచెయ్యనక్కర లేదన్నట్టు ప్రవర్తిస్తారు. డబ్బుంది యీ మొగుడి లెక్క ఏమిటన్నట్టు ఎదిరిస్తారు' .... రామారావు ఏదో అనబోయాడు. 'ఆ....ఆ....డబ్బులేకపోతే బానిసలా, కాలికింద చెప్పులా, వంటలక్కలానూ చూస్తారు - అదీ ఒప్పుకోండి మీరు - మీమగాళ్ళు మాత్రం ఏం తక్కువ వాళ్ళా? పాపం ఆ సుగుణని చూస్తే ఎంత జాలేస్తుంది." రామారావు మాటల్లో అబద్ధం లేకపోయినా అంత త్వరగా ఆ మాటల్లో నిజం ఒప్పుకోడం ఇష్టం లేక ఆడవాళ్ళని వెనవేసుకు వస్తూ అంది పద్మావతి.

"అవునవును నాకూ సుధాకరరావుని చూస్తే జాలేస్తుంది" వెక్కిరించాడు.

"వెక్కిరించక్కరలేదు. సుధాకర్ కేం లత వెళ్ళిపోతే మరో గీతని తెచ్చుకుంటాడు. పాపం సుగుణ గతిలేక ఆ మొగుడేం చేసినా అలా పడుండాల్సిందే కదూ?" రెట్టించింది పద్మావతి.

"ఏం పెళ్ళాం మొగుడ్ని వదిలి వెళ్ళిపోయిందంటే ఆ అవమానం తక్కువదనుకుంటున్నావా? పాపం ఆ మానవుడు రేపటినుంచి ఎలా మొహం ఎత్తుకుంటాడనుకుంటున్నావు. ఏం ఆడదానికేనా అవస్థలు - మగాడికేం సమస్యలు లేవనుకుంటున్నావా? ఆ లతకి డబ్బుందనే గాదూ అలా చిన్న విషయానికి ఇల్లువదిలిపోయింది. లేకపోతే సర్దుకునే విషయానికి అంత ధైర్యంగా తెగించి వెళ్ళిపోతుందా, అందుకే ఆడదాని చేతిలో డబ్బు మగాడి చేతిలో బిడ్డ - అన్నారు' ఎత్తి పొడిచాడు రామారావు వ్యంగ్యంగా.

"చాల్లెండి అసలు సంగతి తెలియకుండా లతదే తప్పని ఎందుకనుకోడం? ఏం జరగందే ఆవిడ మాత్రం అంతలా తెంచుకపోతుందా' లత స్వభావం తెలిసినా ఆ విషయం ఒప్పేసుకుని భర్త ముందు తేలిపోవడం యిష్టం లేదు పద్మావతికి. పద్మావతికి ఓ డిగ్రీ వుంది. ఆధునిక భావాలున్నాయి. స్త్రీ స్వాతంత్రం, మగాడి దురహంకారం, వగైరా వగైరా కబుర్లంటే చాలా యిష్టం. చేతికందిన పుస్తకం అల్లా చదువుకుంది. ఉత్తి చదవడమేకాదు కథలు రాస్తూంటుంది. పెద్ద రచయిత్రి కాకపోయినా కాస్త పేరు తెచ్చుకున్న రచయిత్రి కోవలోకి వస్తుంది. ఆమె కథల్లో ఏదో స్త్రీ సమస్య ఎత్తుకుని రాస్తూంటుంది ఎప్పుడూ. ఆడదానిలో లోపాలు తెల్సినా అవి ఒప్పుకోకుండా పురుషాహంకారం, జులుము, స్త్రీని ఎంత బానిసలుగా చూస్తున్నదీ, ఆర్థిక స్వాతంత్రం లేకపోవడం వల్ల స్త్రీల యిబ్బందులు, శారీరకంగానే కాకుండా మానసికంగా కూడా స్త్రీ బలహీనురాలవడం ఆమెలో క్షమాగుణం, ఓర్మి, సహనం ఇవన్నీ పురుషుడు ఎలా ఎక్స్ప్లాయిట్ చేసి ఎడ్వాన్టేజ్ తీసుకుంటున్నదీ ఆమె కథలో ఎత్తి చూపేది.

పక్కింట్లో వున్న సుగుణని చూస్తే ఆమెకి ఎంతో జాలిగా వుండేది. ఆమె కథ ఓ నవల రాసి ఆ మొగుడికి బుద్ధి తెప్పించాలన్న ఆవేశం వచ్చేది ఆమెకి. ఏం చేసి ఆమె బతుకు చక్కదిద్దాలన్న ఆరాటంతో ఆలోచించేది. సుగుణ - పక్కింటి భాస్కరరావు భార్య. భాస్కరరావు సెక్రటేరియట్‌లో గుమస్తా. సుగుణ చదువు సంధ్య లేని అజ్ఞానురాలు కాదు. ఇంటర్‌వరకు చదువుకుంది. అందగత్తె కాకపోయినా చలాకీగానే వుంటుంది. పరువు ప్రతిష్ఠ కల కుటుంబం నుంచే వచ్చింది. ఆమె తండ్రి వున్నంతలో కూతురి పెళ్ళిచేసి లాంఛనాలు గట్రా బాగానే ముట్టచెప్పాడు. భాస్కరరావు చూసి నచ్చి చేసుకున్నాడు. అలాంటివాడు పెళ్లాన్ని మాటలతో చేతలతో ఎందుకు హింసిస్తాడో, ఆమెలో ఏం లోపం వుందని ఆమెనంత చిన్నచూపు చూస్తాడో, ఆమె ఏం తప్పు చేసిందని అడుగడుగునా కాల్చుకతింటాడో పద్మావతికి అర్థం కాదు.

పెళ్ళికాకముందు నుంచి భాస్కరరావు ఆ యింట్లో వుండేవాడు. అప్పుడప్పుడు రామారావుతో మాట్లాడేవాడు. శలవు పూట ఎన్నడన్నా వచ్చి కూర్చుని యిదీ అదీ మాట్లాడి కాఫీ తాగి వెళ్ళేవాడు. కాస్త పరిచయం పెరిగాక ఒంటరివాడని రామారావు ఏదన్నా పండగవస్తే భోజనానికి పిలిచేవాడు. ఏ పిండివంటన్నా చేస్తే భాస్కరరావుకి పంపమనేవాడు పద్మావతిని. ఏణ్ణర్థం తర్వాత సుగుణని పెళ్ళి చేసుకుని కాపురానికి తెచ్చుకున్నాడు. పద్మావతి పక్కన తనతో కాలక్షేపం దొరికినందుకు సంతోషించింది. సుగుణ మంచిది, నెమ్మదైనది, కలివిడిగా వుందని, మంచి తోడు దొరికిందని సంబరపడింది. తమ పనిమనిషిని, పాలవాడిని, చాకలిని, అన్నీ కుదిర్చింది. ఓ రెండు మూడు నెలలు భాస్కరరావు సుగుణ సరదాగానే వున్నారు. సినిమాలకి, షికార్లకి వెళ్ళేవారు. శలవుల్లో వచ్చి పద్మావతి యింట్లో టిఫిన్లు, పేకాట వగైరాలన్నీ జరిగేవి. తరువాత రానురాను భాస్కరరావులో ఏదో మార్పు కనిపించింది పద్మావతికి. ఈలోగా సుగుణ నెల తప్పింది. పనిమనిషి ఒకత్తే అవడం వల్ల పద్మావతి మామూలుగా 'సుగుణమ్మగారేం చేస్తున్నారే.' అంటూ అడిగేది అప్పుడప్పుడు. 'ఆయమ్మ ఏటో మొహం ఏల ఏసుకు కూకుందమ్మా-ఎందుకో ఏడ్సినట్టుందమ్మా. ఏటో ఆ బాబు ఎప్పుడూ సిరుబురులాడతానే వుంటాడు ఆ యమ్మమీద' అంది ఒకసారి. పద్మావతికి ఆశ్చర్యం అన్పించింది. అప్పటి నుంచి సీతాలు సుగుణ భాస్కరరావుల సంగతి, వాళ్ళిద్దరి తగవులు, సుగుణ ఏడ్వడం ఏదో చెప్పేది. 'ఆ బాబు యియాళ కాఫిలో కూసంత పంచదార ఎక్కువైందని ఆయమ్మమీద ఎగిరి కాఫి తాగలేదమ్మగోరు. పాపం సుగుణమ్మ కన్నీళ్ళెట్టుకుంది. ఆ బాబు చొక్కాబొత్తాలు కుట్టడం యీ యమ్మ మరిసిపోనాదంట తిట్టిపోశాడమ్మా.'

'ఏటో ఆ బాబు దేనికీ సర్దుకోడు. ఏన్నీళ్ళు ఏడెక్కువైతే కోపం, సల్లగుంటే కోపం కాఫిగ్లాసు చురికితే కోపం, అన్నం కసింత ముద్దయితే సిరాకు. ఏటమ్మగోరు ప్రతిదానికి అలా తైతై అని ఎగిరి పడ్తాడు ఆ బాబు. ఏటి మీరు కాపురం సెయ్యడం లేదా, మొగుడు పెల్లాలన్నాక మాటమాట వస్తది గాని యిలా పతిదానికి తప్పులెంచి తిట్టడం ఏటమ్మగోరూ.' ఇలా రకరకాలుగా వాళ్ళింట్లో జరిగే భాగోతం చెప్పుకొచ్చేది సీతాలు. పద్మావతికి ఆశ్చర్యం వేసేది మొదట్లో. వాళ్ళింటి సంగతులు పనిమనిషి ద్వారా కూపీలాగడం ఏమిటి ఛీ- అనుకునేది. కాని ఆమెకి తెలియకుండానే ఆ కబుర్లు మొదలుపెట్టగానే కుతూహలం ఆపుకోలేక అన్నీవినేది. ఒక్కోసారి అడిగి మరీ వినేది. వాళ్ళిద్దరితో వున్న పరిచయం వల్ల అయితేనేం, స్త్రీ సహజమైన కుతూహలం వల్లనైతేనేం ఆ కబుర్లు విని సుగుణ మీద జాలిపడేది. సీతాలు చెప్పే మాటల సారాంశం బట్టి భాస్కరరావు స్వభావం అంచనా కట్టడానికి ప్రయత్నించింది. సుగుణ తప్పు లేదన్నది అర్థం చేసుకుంది. ఓ రోజు సుగుణ ఇంటికి వెళ్ళేసరికి సుగుణ ఏడుస్తూ పడుకుంది. పద్మావతి రాగానే ఆమెకి మొహం చూపలేకపోయింది. ఆమె చెంప మీద ఐదువేళ్ళ

గుర్తులు స్పష్టంగా కనిపించాయి పద్మావతికి. ఇన్నాళ్ళు తిట్టడం తప్ప కొట్టడం కూడా భాస్కరరావు చేస్తాడని విని పద్మావతి ఆశ్చర్యపోయింది. ఆశ్చర్యంతోపాటు భాస్కరరావు మీద కోపం ముంచుకు వచ్చింది. సుగుణని చూస్తే జాలి ముంచెత్తింది. ఎంతో అడగ్గా అడగ్గా ఏడుపు మధ్య సుగుణ దాపరికం లేకుండా అంతా చెప్పుకొచ్చింది. అతని కుటుంబస్థాయి కంటె సుగుణ అంతస్తుస్థాయి కాస్త పైమెట్టు నుండడంతో అతనిలో అదోరకమైన ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్. సుగుణ బావలు, అన్నలు కంటె భాస్కరరావు చిన్న ఉద్యోగంలో వుండడంతో చిన్నతనం ఫీలయి ఎవరితోనూ కలవకుండా సరదాగా వుండకుండా అత్తవారింట్లో మూతి ముడుచుకు కూర్చోడం, తనని ఎవరు చిన్న చూపు చూస్తారో అన్నట్టు-ఆధిక్యత చూపుకోడానికన్నట్టు అవసరం వున్నా లేకపోయినా అందరి ఎదుట సుగుణ మీద లేనిపోని అథార్టీ చూపి ఆమెని చిన్నపుచ్చడం, పండగకి మామగారిచ్చిన బట్టలు విసిరి కొట్టడం, పెళ్ళిలోనూ అతను, వాళ్ళవాళ్ళు ఇది చాలదు అది చాలదు అంటూ చేసిన అల్లరి పెట్టిన అవస్థలు–అన్నీ కథలాగ చెప్పుకొచ్చింది సుగుణ. కాపురానికి వచ్చిన తర్వాత కొత్తలో కూడా సుగుణ ఏ చిన్న తప్పు చేసినా క్షమించేవాడు కాదు. ప్రతి చిన్న విషయానికి కసరడం, చిరాకు పడడం తప్ప సౌమ్యంగా మాట్లాడడని, ఏం చేసినా అతని మాట లక్ష్యం లేకుండా ప్రవర్తిస్తున్నట్టు కోపగించేవాడని, చీటికి మాటికి మాటలు మానేసి, భోజనం మాని సుగుణని సాధించేవాడని అన్నీ చెప్పింది సుగుణ. పద్మావతి ఆశ్చర్యంగా వింది. 'ఇంతకీ ఏమిటంటావు కారణం అతనిలా ప్రవర్తించడానికి?' "హుం....నా ఖర్మ అనుకోవాలి అంతే. సగం ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ మిగతాది స్వభావం అనుకోవాలి. ప్రతి చిన్న విషయానికి రాద్ధాంతం చేస్తారు. ఏదన్నా తప్పు దొరకుతుందా సాధిద్దామా అని ఎదురు చూస్తారు. పనివాళ్ళముందు, చాకలాడి ముందు, కూరలవాడి ముందు, పాలవాడి ముందు వీళ్ళువాళ్ళు ఎవరున్నా సరే-ఎంత మాటపడితే అంతా అనేస్తారు చిన్నబుచ్చుతారు. నాకెలా వుంటుంది చెప్పండి. నేనూ కొత్తగా పెళ్ళయి వచ్చినదాన్ని. నా భర్త నన్ను ప్రేమగా, గౌరవంగా చూడాలని వుండదా. చీటికి మాటికి తిడ్తుంటే నా మనసెలా వుంటుందో చెప్పండి." కన్నీళ్ళు పెట్టుకుంటూ అంది సుగుణ. "అన్నింటికి మరీ ఎందుకూరుకుంటావు? కాస్త గట్టిగా ఒకసారి చెప్పకపోయావా? అయినదానికి కానిదానికి తిట్టడం అనవసరం. నెమ్మదిగా చెప్పొచ్చు. తిడితే కొడితే పడి వుండనని తెలియ చెప్పక పోయావా....'' పద్మావతి అంది.

''అన్నీ అయ్యాయి అక్కయ్యగారూ. మొదట్లో ఆయన తిడితే అలిగి తిండి మానేసి పడుకున్నా ఆయన చీమ కుట్టినట్లయినా పట్టించుకోలేదు. తిన్నావా అని కూడా అడగలేదు. మరోసారి ఆయన దేనికో అనవసరంగా తిడితే పౌరుషం వచ్చి నెమ్మదిగా చెప్పకూడదూ అలా అరుస్తారెందుకు అన్నానంతే–'నోర్మూయ్ పొగరుగా ఎదిరిస్తావా' అని పట్టుకుతిట్టారు. ఇంకోసారి నాకు కోపం వచ్చి అరిచాను. చెంపఛెళ్ళుమనిపించారు. అభిమానంతో ఏడుస్తూ పడుకున్నా పట్టించుకోలేదు. ఆ మనిషికి సౌమ్యంగా మాట్లాడడం అన్నది తెలియదు-ఆయనెంత కసిరినా తిట్టినా పెళ్ళాం కనక నోరుమూసుకు సహించాలని ఆయన ఉద్దేశం - జవాబిస్తే పొగరు. ఎదిరిస్తే చెప్పుదెబ్బలు, ఏడిస్తే తిట్లు-ఆయనకి నిల్చుంటే తప్పు కూర్చుంటే తప్పు. ఊ అంటే ఒకతప్పు, జవాబివ్వకపోతే ఇంకో తప్పు. ఛీ....ఛీ....అక్కయ్యగారు ఆర్నెల్లకే నా మనసు క్రుంగిపోయిందండీ. ఐశ్వర్యాలు భోగభాగ్యాలు కోరలేదు. భర్తనించి ఆప్యాయత, అనురాగం కూడా కొరవడ్డాక యింక ఆ కాపురంలో సామరస్యం ఏం వుంటుంది చెప్పండి. అందరి స్త్రీల మాదిరి భర్త ప్రేమ, అన్యోన్యత అన్న కనీసపు కోరికలు కూడా గగనకుసుమాలయితే ఆ భర్తని ఏ ఆడది ప్రేమిస్తుంది. ప్రేమతో విషమన్నా తగ్గించవచ్చన్న సూత్రం ఆయనకి తెలీదు. పెడసరం తప్ప సౌమ్యం లేదు. తిట్టి కొట్టి పనులు చేయించుకుంటే ఆ మొగుడ్ని ఏ ఆడది గౌరవించదన్న చిన్న నిజం కూడా ఆయనెరగరు. కాపురానికొచ్చిన నెల రోజులకే ఆయన తత్వం అర్థమైపోయింది. ప్రేమ, అనురాగం అన్న పదాలకి ఆయనకర్థం తెలియదు. మనిషికి నిలువెల్లా అహంకారం-మగవాడిని, మొగుడ్ని అన్న దురహంకారం తప్ప భార్యా మనిషేనన్న నిజం గుర్తించరు. ఇలాంటి వాళ్ళని ఎలా మార్చగలం అక్కయ్యగారూ.... ఆర్నెల్లకే పెళ్ళిమీద, మొగుడిమీద విముఖత ఏర్పడిపోయిందండీ....'' దుఃఖంతో, విరక్తితో అంది సుగుణ.

'' ఛా....ఛా....కొట్టడం వరకు వచ్చారంటే....

## పుట్టపర్తి కనకమ్మ



వ్యక్తి వికాసానికి వంశ పారంపర్యం, పరిసరాలు తోడ్పడతాయని అంటూ వుంటారు. శ్రీమతి పుట్టపర్తి కనకమ్మగారి విషయంలో ఈ మాట అక్షరాలా నిజమైంది. ఆమె తాతగారైన శ్రీ ధన్నాద రాఘవాచార్యులు కాశీలో గజారోహణ సత్కారం అందుకున్న మహా విద్వాంసులు. వారివద్ద సంస్కృతాంధ్ర భాషలు క్షుణ్ణంగా అభ్యసించారు కనకమ్మ.

ఆమె భర్త శ్రీ నారాయణాచార్యులు కూడా మహా విద్వాంసులు. తన భర్త సాంగత్యంలో ఆమె తన పాండితికి మెరుగులు దిద్దుకున్నారు. స్వయంగా గొప్ప కవయిత్రి అయి వుండి కూడా ఏ మాత్రం ప్రచారం అభిలషించక పోవడం ఆమె నిరాడంబరతను చాటుతుంది. తన కవితలు వెలువరించడంలోకన్న భర్త రచనల్లో సాయపడడంలోనే ఆమె ఎక్కువ ఆనందం పొందుతారు.

కనకమ్మగారు రాసిన ఖండికలు - యశోధర పశ్చాత్తాపం, జీర్ణ విజయనగరం, రాతి రథం, కస్తూరిబా – మొదలైనవి 'అగ్నివీణ' పేరిట సంకలనంగా వెలువడి పలువురి మన్ననలు పొందాయి.

బాధాకరమైన విషయాన్ని కూడా సున్నితంగా తెలియజేస్తూ వాటిని మధురమైన గీతికలుగా తీర్చి దిద్దగల నేర్పు కనకమ్మగారి రచనలలో ద్యోతకమవుతుందని, విమర్శకులు అభిప్రాయ పడతారు.

శ్రీరాముడు ఆమె ఆరాధ్య దైవం. రామాయణం పలుమార్లు పారాయణం చేయడమే కాకుండా 'శ్రీరామ సుప్రభాతం' రచించారు ఆమె.

1975లో అంతర్జాతీయ మహిళా సంవత్సర సందర్భంగా ''ఉత్తమ కవయిత్రి''గా ఆమెను మన రాష్ట్ర ప్రభుత్వం సన్మానించి గౌరవించింది.

—రావినూతల రాజ్యలక్ష్మి

# హెయిర్ స్టయిలు పద్దెనాసరే హెయిర్ స్ప్రే మాత్రం ఒక్కటే!








ఎంత అందమైన హెయిర్ స్టయిలుతో జుట్టు అలంకరించుకుంటే ఏం లాభమని, అది అలాగే నిలిచి వుండకపోతే. జుట్టు పొట్టిదైనా, పొడుగుదైనా, హెయిర్ స్టయిలు ఏదైనా, పాయిజ్ హెయిర్ స్ప్రే, జుట్టును అదే తీరులో అట్టే వుంచుతుంది. పాయిజ్, జుట్టును సున్నితంగా, అయినా గట్టిగా పట్టుకుని వుంచి జుట్టులోని సహజ సౌందర్యాన్ని ఆ మెరుపునూ పెంపొందిస్తుంది. సరి సమానంగా స్ప్రే చేస్తుంది. దీనిని బ్రష్‌తో శుభ్రం చేయవచ్చును. జుట్టుకిక జిగట ఉండదు, చుండ్రు పట్టదు.

మీ జుట్టుకిక మరింత సింగారం

**శాంతెల్**
హెయిర్ స్ప్రే

మీ జుట్టుకిక మరింత సింగారం

మార్కెట్ చేసేవారు: రాలీస్ ఇండియా లిమిటెడ్

U-PHS-13 TEL

# "లోధ్ర" టానిక్ వనితలకు మాత్రం!




ప్రకృతి సిద్ధమైన పద్ధతి ద్వారా ఆరోగ్యంగా ఉండడానికి నెలలో ప్రతిరోజూ బాధలేని రోజుగా గడపడానికి "లోధ్ర" టానిక్ తీసుకోండి! ఏ బాధా లేకుండా ఆరోగ్యమయమైన జీవితాన్ని గడపండి.

78 సంవత్సరాల నుంచీ స్త్రీల విశ్వాసానికి పాత్రమైన టానిక్.
"లోధ్ర" మందుల షాపులలో దొరుకుతుంది.

Sistas

ఉచితమైన వైద్య సలహాలకు క్రింది చిరునామాకు ఈ కూపనును పూర్తిచేసి, మీ ఉత్తరంతోబాటు జతచేసి పంపండి.

పేరు : ____________________

చిరునామా : ____________________

____________________

____________ PIN ____________

కేసరి కుటీరం (ప్రై) లిమిటెడ్
27, వెస్ట్‌కాట్ రోడ్, రాయపేట, మద్రాసు-600 014

ఏజంట్లు : శీతారామ జనరల్ స్టోర్స్ ఏజన్సీస్, విజయవాడ, సికింద్రాబాదు.

భాస్కరరావుని నేనెంత మాత్రం క్షమించను. నీవెలా వూరుకుంటున్నావో, నేనయితేనా....'' పద్మావతి ఆవేశంగా అంది. సుగుణ అదోలా నవ్వింది. .... ''మొదట్లో మీకంటె ఆవేశపడ్డాను. పౌరుషపడ్డాను. కాని వూరుకోక ఏం చెయ్యలేనని త్వరలోనే తెల్సుకున్నాను. నేనే కాదు, ఆయనకీ అర్థమైపోయింది నేనేం చెయ్యలేనని.'' నిర్లిప్తంగా అంది - 'ఇదిగో అలా అమ్మమ్మలా మాట్లాడకు - ఏం చెయ్యలేకపోవడం ఏమిటి. చెయ్యి చేసుకుంటే మాట దక్కదని ఖచ్చితంగా చెప్పు. ఎంత భార్య అయినా మర్యాద యిచ్చి పుచ్చుకోవాలని చెప్పు - అసలింతదాకా రానీయడం నీదితప్పు. మొదటిసారి చెయ్యి చేసుకున్నప్పుడే హద్దులో పెట్టాల్సింది - అసలెందుకు కొట్టారు - అంత తప్పు ఏం చేశావు?' పద్మావతి ఆశ్చర్యంగా అడిగింది.

కారణం ఏమిటి - నేను కాస్త స్వతంత్ర భావాలు కలదాన్నని ఆయన కనిపెట్టారు. కాస్తో కూస్తో చదువుకున్నదాన్ని ముందునించి అదుపులో పెట్టక పోతే లొంగనని భయపడ్డారు. ఒకటి రెండు సార్లు జవాబులు చెప్పేసరికి ఆయన మగతనానికి తీరని అవమానం జరిగిపోయినట్లు ఫీలయి తను మొగుడినని నేను భార్యనని ఆయనకి నన్ను తిట్ట డానికి కొట్టడానికి అన్నింటికి హక్కు వుందని నిరూపించాలనుకున్నారు. అందుకే ఆయన ఏమన్నా నోరెత్తకుండా పడివుండకుండా కాస్త జవాబు చెప్పినా సహించేవారు కాదు. మొదటిసారి ఆ రోజు కూరలో ఉప్పు ఎక్కువైందని తిట్టారు. నేను రుచి చూసి ఆశ్చర్యంగా 'లేదే సరిగా వుందన్నాను.' అంతే అమాత్రందానికి ఫైరయి పోతూ 'నేనబద్ధం చెప్పాననా నీ ఉద్దేశం, నాకు రుచి తెలియదనా నీ ఉద్దేశం, కూర మొహం ఎరగననుకుంటున్నావా నీ బాబు యింట్లోనే తిండి తింటున్నారనుకుంటున్నావా - మాటకి మాట జవాబిస్తావా? మొగుడు ఏదన్నా వ్యతిరేకంగా చెప్పడమే గాబోలు మీ ఆడవాళ్ళ ఉద్దేశం, నీ ఆటలు నా దగ్గర కావు. నీవేం చేసినా వూరుకునేటంత చవటని కాను.' ఆ ధోరణి ఏమిటో - అలా సాగిపోతూంటే అంత చిన్న విషయానికి అంత దూరం ఆయన ఎందుకు సాగదీస్తున్నారో అర్థం కాక ఆశ్చర్యంగా కోపంగా 'ఎందుకలా నోరు పారేసుకుంటారు యీ కాస్త విషయానికి' అన్నాను - అంతే జరగరాని అవమానం జరిగినట్లు అంటు చేత్తోనే చెంప ఛెళ్ళుమనిపించారు. నేను పౌరుషంగా 'కొడ్తారా' అని అరిచాను. ఇంకా కొడ్తాను నోర్ముయ్ అని మరోటి వేశారు. అదీ ఆరంభం. ఆయన ధోరణికి అసహ్యం పుట్టి నేను ముభావంగా వుంటే గర్వమని మరింత తిట్టడం, జవాబిస్తే పొగరనడం – ఆఖరికి నాకెంత విముఖత పుట్టిందో తెలుసా ఆయన మొహం చూస్తేనే అసహ్యంగా వుంది – ఆయన దగ్గరకొస్తేనే చీదరింపుగా వుంది.'' సుగుణ మాటల్లో భాస్కరరావుపట్ల పెంచుకున్న ఏహ్యత స్పష్టంగా కన్పించింది. పద్మావతి నిట్టూర్చింది. ఏం చెప్పాలో అర్థం కాలేదు.

'పోనీ కాస్త బెదిరించి చూడకపోయావు పుట్టింటికి వెళ్లిపోతానని. ఈసారి చెయ్యి చేసుకుంటే పెట్టె పట్టుకుని మీ వాళ్ళ యింటికెళ్ళు.'

'అదీ ఆలోచించానక్కయ్యా - పుట్టింటికెడితే ఎన్నాళ్ళుంటాను, ఏడుగురు పిల్లల తండ్రి నన్నెన్నాళ్లు పోషిస్తారు. పోషించడం అటుంచి వాళ్లే కాపురం వదులుకు వస్తావా అని చివాట్లు పెట్టి పంపిస్తారు. ఒకసారి కాదని వెళ్ళిపోయి మళ్ళీ వచ్చానంటే యింకా యీయనకి లోకువైపోతాను. అవతల మానాన్న మామూలు మధ్యతరగతి సంసారి ఆయనకి భారమవుతాను. అంతేకాక కూతురు మొగుడ్ని వదిలి వచ్చిందంటే పరువు ప్రతిష్ఠలకి భంగం అనుకునే మధ్యతరగతి మానవులం మనం. సంఘంలో బతుకుతూ సంఘం కట్టుబాట్లు దాటితే సహించకుండా కాకుల్లా పొడుస్తారు. కష్టమో సుఖమో, స్వర్గమో నరకమో మొగుడి దగ్గిరా పడుండాలనే మనస్తత్వం మన వాళ్ళది. మొగుడ్ని వదిలిన ఆడదాన్ని గౌరవంగా చూసే స్థాయికి ఎదగని యీ సమాజంలో మొగుడ్ని ధిక్కరించి వెళ్ళి అటు తల్లిదండ్రులకి భారమై అవమానాలని, అవహేళనలని ఎదుర్కొంటూ బతికే బతుకు కంటె యిదే నయమేమో'

సుగుణ మాటల్లో అతిశయోక్తి, అబద్ధం కన పడలేదు పద్మావతికి. 'పోనీ కాస్త నీ కాళ్ళ మీద నీవు నిలబడేట్టు ఏదన్నా ఉద్యోగం కోసం ప్రయత్నిస్తే కాస్త భయం వుంటుంది. మనకి ఆర్థిక స్వాతంత్రం లేకపోవడంతో మగవాళ్ళకి మరీ అలుసయిపోతున్నాం.'

'ఉద్యోగం ఎవరిస్తారక్కయ్యా నాకు. ఇంటోటి యింటర్ చదువుకి నా మొహం చూసి ఉద్యోగం యిచ్చే వాళ్ళెవరు. మహా మహా పోస్టు గ్రాడ్యుయేట్సే ఉద్యోగాలు లేకుండా వున్నారు గదా. పోనీ ఏదన్నా ఉద్యోగం దొరికిందనుకో. యీయన గారు ముందు ఒప్పుకోవాలి గదా. ఆయన చచ్చినా ఒప్పుకోరు.''

'మరేలాగ...ఇలా చివాట్లు చెప్పుదెబ్బలూ తింటూ ఆత్మాభిమానం చంపుకుంటూ ఎన్నాళ్ళు బతుకుతావు. పెళ్ళయిన ఆర్నెల్లలోనే యిలా వుంటే ముందు ముందు ఇంకెలా వుంటుంది. ఏదో చెయ్యాలి సుగుణా.' అంది పద్మావతి బాధగా.

'చేసేది ఏముంది అక్కయ్యా. యీ దేశంలో ఆడదానిగా పుట్టాక ఒకసారి పెళ్ళంటూ జరిగాక అది తెంపుకోడం అంత సులువు కాదని ఎన్ని కథలు చదవడం లేదు, ఎంతమందిని చూడడం లేదు? మనం వద్దనుకున్నా మన చుట్టూ వున్న వాళ్ళూరుకోరు. నయానో, భయానో ఆడదాని స్థానం భర్త దగ్గిరే అని గుర్తుచేసి తీసుకొచ్చి వదులుతారు.' విరక్తిగా అంది సుగుణ. 'కాస్త ధైర్యంచేసి ఏదన్నా చేద్దామన్నా, నా ఖర్మకొద్దీ త్వరలోనే తల్లినవబోతున్నాను. ఆ పిల్ల కోసమన్నా అన్నీ సహించి వుండాలి. తండ్రి కాని బిడ్డకి ఈ సంఘంలో గుర్తింపు వుంటుందా అక్కయ్యా' అంది దీనంగా సుగుణ. సుగుణ కూడా తనకంటె అన్ని కోణాలనించి ముందే ఆలోచించి నిస్సహాయంగా వూరుకుందని అర్థం అయింది పద్మావతికి. పద్మావతి నిస్సహాయురాలే అయింది.

ఆరోజునించి గత ఏడాదిగా సుగుణ పరిస్థితి రోజు రోజుకి మరీ హీనమవడం చూస్తూ కూడా నిస్సహాయంగా వూరుకోవడం మినహా ఏం చెయ్యలేక పోతున్నందుకు బాధపడేది పద్మావతి. భాస్కరరావు అయినదానికి కానిదానికి ప్రతీదానికి చెయ్యి చేసుకోవడం ఎక్కువైంది. ఆఖరికి పురిటికి పంపడానికి కూడా నానా గొడవచేసి సుగుణ తండ్రి వచ్చి కాళ్ళావేళ్ళా పడ్డాక తొమ్మిదో నెలలో పంపి, మళ్లీ నెలరోజుల లోపల తీసుకొచ్చి దిగబెట్టాలన్న ఆర్డరు వేసాడు. భార్య - తాళి చూలు, ఆడదాని కష్టసుఖాలు అర్థం చేసుకోకుండా మగ అహం చూపే అతన్ని ఏమాత్రం క్షమించలేకపోయింది పద్మావతి. భాస్కరరావుపట్ల విముఖత రోజు రోజుకి పెరిగి అతనితో మాటలు మానేసింది. ఒకసారి ఏదో స్కూలులో టీచరు పోస్టు ఖాళీ వుందని తెల్సి బలవంతంగా సుగుణచేత అప్లై చేయించింది. ఆ సంగతి తెల్సి భాస్కరరావు సుగుణ మీద ఎగిరిపడి – నన్ను కాదని ఉద్యోగం చేసే మాటయితే యింట్లోంచి వెంటనే నడు అని మెడపట్టి గెంటినంత పనిచేశాడు. అప్పటితో

సుగుణ అదృష్టం ఇంతేనని ఆ కాపురంలో అన్యోన్యత మరి లాభం లేదని గ్రహించింది పద్మావతి.

సుగుణకి ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోబట్టేకదా అతనంత హీనంగా చూస్తున్నాడు. అదే ఆమెకో ఉద్యోగమో, ఆస్తో వుంటే చీటికి మాటికి పో పో అని కుక్కని తరిమినట్లు తరిమేవాడు కాడుగదా అని రామారావుతో వాదించేది పద్మావతి.

కాని అటు సుధాకర్ సంసారం చూస్తే ఆడదానికి ఆర్థిక స్వాతంత్ర్యం వున్నాముప్పే గాబోలు అనిపించేది ఒకోసారి ఆలోచిస్తుంటే.

సుధాకర్ రామారావు కొలీగ్. సుధాకర్ తండ్రి ప్లీడరు, పెద్ద ఆస్తిపరులు కాదు. మధ్యతరగతి సంసారి. సుధాకర్ యింజనీరు, సుధాకర్ మధ్య తరగతి సంసారి అయినా అతని భార్య మాత్రం గొప్పింటి నుంచి వచ్చింది. ఒకే కూతురు. లక్ష ఆస్తి, పెద్ద మేడ, పొలాలతో వచ్చిన భార్య. ఆ తండ్రి అసలు ఇల్లరికం అల్లుడిని తెచ్చుకుందా మనుకున్నాడు గాని అలా అన్నీ వున్నవాడెవడు ఇల్లరికానికి అంగీకరించకపోవడంతో ఆఖరికి సుధాకర్ సంబంధం చేసుకున్నారు. సుధాకర్ అందగాడు, ఉద్యోగం మంచిది ఆస్తి తమకే బోలెడుందని సంతోషించి కూతురు పెళ్ళి చేశాడు. మొదట్లే సుధాకర్, అతనివైపు వాళ్ళు అతనికి అందగత్తె, అంత గొప్పింటి పిల్ల వచ్చినందుకు సంతోషించారు. ఆ సంతోషం రోజులు గడిచిన కొద్ది అందరికి అణగారిపోసాగింది. లత అడుగడుగున తన అంతస్తు హోదాతో అత్తవారు సరితూగరని చిన్నచూపు చూసేది. ప్రతిదానికి పుట్టింటి గొప్పలు చెప్పి వారితో పోల్చి చులకనగా, హేళనగా మాట్లాడేది. వారి అభిమానాన్ని ఆప్యాయతని అపార్థం చేసుకుని తన డబ్బుకోసం ఎగబడి మంచి చేసుకుంటున్నారనేది సుధాకర్‌ని కూడా ఏదో దయదల్చి చేసుకున్నట్టు అడుగడుగునా ఎత్తి పొడిచేది. తమ అంతస్తుకి తగదన్నట్టు హీనంగా మాట్లాడేది. ప్రతి చిన్న విషయానికి నా డబ్బు నా ఆస్తి – మీదెవడికి కావాలి – నా చీరలు నేను కొనుక్కోగలను, మీ ముష్టిచీరలు ఎవడికి కావాలి? ఛీ. ఛీ యీ చీర మీ యింట్లో పనివాళ్ళు కట్టుకుంటారు. యిదేం తిండి, యిదేం యిల్లు, యిదేం ఫర్నిచర్, యిలా కాపురానికొచ్చిన దగ్గర నుంచి మొగుడ్ని సాధించేది. చిన్నచూపు చూస్తూ అడుగడుగున తన ఆధిక్యత చూపుతూ అవమాన పరిచేది. పాపం సుధాకర్ భార్య అందగత్తె, ఐశ్వర్యవంతురాలు తన అదృష్టం కొద్ది దొరికిందన్న భావన రెండు నెలలకే అణగారిపోయి – ఈ పెళ్ళి చేసుకుని పొరపా(టు) చేశాను. అందుకే అంతస్తులు చూసుకోవాలంటారు అని బాధపడ్డం ఆరంభించాడు. ఎంత సర్దుకున్నా అహంభావి అయిన భార్యతో కాపురం అడుగడుగునా ముళ్ళబాట మీద నడకలా యాతనగా వుండేది అతనికి.

సుధాకర్‌తో ఆఫీసు పరిచయమే కాక యింటి ఎదురుగానే కనక రామారావు సుధాకర్ క్లోజ్‌గా వుండేవారు, పెళ్ళికాక ముందు వదినగారూ అంటూ పద్మావతితో అలా వంటింట్లోకి వచ్చి కావల్సినవి అడిగి చేయించుకుని తినేటంత చనువుగా వుండేవాడు. పెళ్ళయ్యాక లత మాత్రం పద్మావతి తమ అంతస్తుకి తగదన్నట్టు దూరదూరంగా అంటీ ముట్టనట్లుండేది. సుధాకర్ ఎంత ప్రయత్నించినా పద్మావతిని దూరంగానే వుంచింది. పద్మావతి ఎన్నిసార్లు వచ్చినా లత ఆమె యింటికి వెళ్ళకపోవడంతో పద్మావతి లత స్వభావం, ఆమె అహంకారం అర్థం అయి, రాకపోకలు తగ్గించేసింది. సుధాకర్ మాత్రం అప్పుడప్పుడు వచ్చేవాడు. పెళ్ళయిన తరువాత సుధాకర్‌ని ఒక నెల రోజులు మాత్రమే సంతోషంగా చూసింది పద్మావతి. తరువాత తరువాత ఏదో పోగొట్టుకున్న వాడిలా దిగులుగా, ఓడిపోయినవాడిలా కనిపించేవాడు. మొదట్లో కారణం తెలియకపోయినా లత దురుసుస్వభావం, అహంకారం గుర్తించాక భార్యాభర్తల మధ్య కలతలకి కారణం అర్థం అయి సుధాకర్‌పట్ల సానుభూతి ఏర్పడింది పద్మావతికి. అంతేకాక పనిమనిషి భార్యాభర్తల మధ్య తగవులు చెప్పేది అప్పుడప్పుడు. రానురాను లత ప్రవర్తన మరీ మితిమీరిపోతూందని పైనించి చూసిన పద్మావతికే అర్థం అవసాగింది. ఆవిడ ఫ్రెండ్సుతో పార్టీలు, పిక్నిక్కులు, సినిమాలు, షికార్లు – యింటి పట్టున వుండేది కాదు. క్లబ్బులకి వెళ్ళి అర్థరాత్రి అపరాత్రి వచ్చేది. సుధాకర్‌కి చెప్పకుండా కూడా వెళ్ళిపోయేది. ఆఫీసు నుంచి సుధాకర్ వచ్చే వేళకి ఒక్క రోజు యింటి పట్టునున్నట్టు పద్మావతి చూడలేదు. వంటమనిషి కాఫీ యివ్వడం, నౌకరు అవసరాలు చూడడం తప్ప ఇల్లు, భర్త, సంసారం ఏమీ పట్టించుకునేది కాదు ఆమె. అతని పరువు మర్యాద ఏమవుతాయన్నది కూడా గుర్తించకుండా ప్రవర్తించడం ఆరంభించాక – సుధాకర్ సహనం హద్దులు దాటాక భార్య ప్రవర్తనని క్షమించలేక అదుపులో పెట్టడానికి ప్రయత్నించాడు. అతని హద్దులు ఆజ్ఞలు తన దగ్గిర పనికిరావని నిర్లక్ష్యంగా తెగేసి చెప్పింది. దాంతో భార్యభర్తల మధ్య తగవులు ఆరంభించాయి. భార్యని కట్టడి చెయ్యలేక, ఆమె విహారాలని, నిర్లక్ష్యాన్ని ఆమోదించలేక లోలోపల కృశించిపోయే సుధాకర్‌ని చూసి రామారావు దంపతులు బాధపడేవారు. లోకం కోసం, పరువుకోసం ఆమె ఏం చేసినా చూసి చూడనట్లూరుకునేవాడు సుధాకర్. కొన్నాళ్ళు అతను తగ్గిపోవడం చూసి అది ఆమె విజయంగా భావించి మరింత పేట్రేగిపోయింది లత.

సహనానికన్నా హద్దు వుంటుంది. ఆ రోజుతో సుధాకర్ సహనం హద్దులు దాటింది. క్రితం రోజు రాత్రి క్లబ్బు నుంచి పన్నెండు గంటలకి యిల్లు చేరింది లత. వూర్లో పెద్ద బిజినెస్ మాగ్నట్ అయిన మిస్టర్ అగర్వాల్ కారులో యింటికి వచ్చి నవ్వులతో, హాస్యాలతో టాటాలు బైబైలు చెప్పి యింట్లోకి వచ్చిన లతని చూసి సహించలేక పోయాడు. క్లబ్బులో మగవాళ్ళతో ఆమె నవ్వులు పరాచికాలు ఎన్నిసార్లు చూసి ఆమె ప్రవర్తనని ఆమోదించలేక, ఆమెకి నచ్చ చెప్పలేక ఆఖరికి క్లబ్బుకే వెళ్ళడం మానేశాడు. అతను మానినా ఆమె వెళ్ళడం మానలేదు. క్లబ్బులో సుధాకర్‌ని చూసి అంతా అదోలా జాలిగా సానుభూతిగా చూసేవారు. అదంతా భరించడం అతనివశంలో లేక పోయింది. మిస్టర్ అగర్వాల్ సుధాకర్ పక్కన వున్న అతన్ని చూడనట్టే లతతో చనువుగా నవ్వుతూ హాస్యాలాడేవాడు. నీవే ఏమిటన్నట్టు అంతా తనని ఆమె భర్తగా గుర్తించకుండా ఓ అనామకుడిలా నిర్లక్ష్యం చేస్తుంటే సహించలేక లతతో అనేకసార్లు తగవు పెట్టుకున్నాడు. 'నలుగురితో కలివిడిగా వుంటే ఎవరన్నా సరదాగా మాట్లాడుతారు. మూతి ముడుచుకు కూర్చుంటే ఎవరికి అవసరం నీతో మాట్లాడడం – నేను సరదాగా వుంటానని అంతా నాతో సరదాగా వుంటారు. అది నీకు కుళ్ళు.' అంది లత హేళనగా.

'అంటే' రెట్టించాడు?

'నీ యిష్టం వచ్చింది నీవు చెయ్యచ్చు. అనవసరంగా బెదిరింపులు మాను. నీలా యింట్లో దద్దమ్మలా కూర్చోలేను. మగాళ్ళతో మాట్లాడినంత మాత్రాన నా పాతివ్రత్యానికేం భంగంలేదులే.''

'స్వేచ్ఛ అంటే యిదా, రోజుకో మగాడితో తైతక్కలాడడమా?'

'తైతక్కలాడలేదు. మోడర్న్ సొసైటీ

గురించి నీలాంటి మొహాలకేం తెలుస్తుంది. క్లబ్బులు పార్టీలు ఎరిగిన మొహాలైతే యిలా మాట్లాడరు.'

'లతా నిజమే, నిన్ను పెళ్ళాడే స్టేటస్ లేని వాడినని పదేపదే గుర్తు చెయ్యక్కరలేదు. యీ సంగతి పెళ్ళాడే ముందే చూసుకోవల్సింది. యిష్టపడి చేసుకున్నావు కనక యిప్పుడు నీ యిష్టం వచ్చినట్టు ఆటలాడితే నా యింట్లో సాగనీయను యింక.'

'సరే అయితే. నా యింట్లో సాగనీయను అంటే అర్థం-యిది నా యిల్లు కాదని గుర్తు చేస్తున్నావన్న మాట. నీవా మాట అన్నాక యింక గతిలేక వుంటాననుకోకు రేపే వెళ్ళిపోతాను.' లత తీవ్రంగా అంది. ఆ క్షణాన యింకేమన్నా ఆమె మరింత రెచ్చిపోతుందని సుధాకర్ వూరుకున్నాడు. ఉదయం లేస్తూనే పెట్టె సర్దుతున్న లతని చూసి కోపం ఆపుకోలేకపోయాడు. 'పెళ్ళి వివాహ బంధం అంటే నీ దృష్టిలో వున్న విలువ యింతేనన్నమాట. నీకు డబ్బుందని ఆస్తి వుందని మొగుడు లెక్క-ఏమిటనుకుంటున్నావు. సరే వెళ్ళు. ప్రతి నిముషానికీ 'పోతాను. నీ లెక్క-ఏమిట'న్న వాళ్ళని ఎంత కాలం పట్టి వుంచగలం. అభిమానం అనురాగం లోపించాక నీ కోసం ఆత్మాభిమానాన్ని చంపుకుని ఎన్నాళ్ళు దేబిరిస్తాను. లోకంకోసం, పరువుకోసం ఇన్నాళ్ళూ నీవేం చేసినా భరించాను. నాలో యింక ఓర్మి చచ్చిపోయింది. యిదే ఆఖరుసారి నీకు చెప్పడం, వెళితే వెళ్ళు కాని మళ్ళీ యీ గుమ్మంలో కాలు పెట్టవని గుర్తించి వెళ్ళు'' సుధాకర్ చెప్పేశాడు. దానికీ భయపడక నిర్లక్ష్యంగా యిల్లువదిలి వెళ్ళిపోయింది లత.

''లతకి ఆస్తి వుంది. భర్త మీద ఆధార పడక్కరలేదనే గాదూ అంత సులువుగా యిల్లు వదిలి వెళ్ళిపోయింది. అదే మామూలు స్త్రీఅయితే ఆ తెగువ ఎలా వచ్చేది. అతని తప్పు లేకపోయినా తప్పు తనదే అయినా అంత నిర్లక్ష్యంగా కాపురం వదులుకుని వెళ్ళిపోవడానికి కారణం ఆమెకి డబ్బు వుండడంగాదూ. లేకపోతే యింత చిన్న విషయానికి ఆడది యిల్లువదిలి పోతుందా .... నీవు చెప్పు. ఆడదానికి ఆస్తి అనర్థాలకి హేతువే. మన వాళ్ళు వెర్రివాళ్ళయి ఆడదానికి ఆర్థిక స్వాతంత్ర్యం లేకుండా చెయ్యలేదు....కాపురాలు, సంసారాలు సాగాలంటే ఎవరో ఒకరు తగ్గాలి....' రామారావు అన్నాడు.

'అంటే మొగుడు కనక ఏం చేసినా ఆడదే పడుండాలి అన్నమాట. ఎవరో ఒకరు తగ్గాలన్నప్పుడు మొగుడూ తగ్గచ్చుగా....'రామారావు మాటల్లో నిజం వుందనిపించినా తగ్గిపోవడానికి అహం అడ్డువచ్చి రెట్టించింది పద్మావతి.

'చూడు, పెళ్ళికాక ముందు తండ్రో, అన్నో ఏ మాటా అనరా, తప్పుచేస్తే వాళ్ళు మందలించరా అలాగే పెళ్ళయ్యాక భర్త వయసులో ఆమెకంటె పెద్దవాడు భార్యని ఏ విషయంలోనన్నా మందలిస్తే తప్పా, తండ్రి ఓ మాట అంటే బాధపడనివారు భర్త చిన్నమాట అంటే తప్పుపట్టడం ఎందుకు?'

''భర్త, యజమాని యివన్నీ మీ మగాళ్ళు పెట్టినవేగదా, సంసారంలో భార్యా భర్త లిద్దరూ రెండు బండిచక్రాలంటూనే మళ్ళీ యీ హెచ్చు తగ్గులెందుకు భర్తకి కోపం వచ్చినట్టే భార్యా మనిషే కనక కోపం వస్తే ఆ కోపాన్ని భర్త ఎందుకు భరించడు? మగ అహం మాత్రం మిమ్మల్ని వదలదే....'' ఏం చెప్తావన్నట్టు గర్వంగా చూసింది పద్మావతి.

'చూడు యిలా వాదనకు దిగితే తుది మొదలు అంతు పొంతు వుండదు. ఇందాక చెప్పానే భార్యకంటె వయసులో పెద్దవాడవడం, శారీరకంగా బలవంతుడవడం, ఆర్జనపరుడవడం భర్తని యింటి యజమాన్ని చేసాయి. ఇది ఈనాటిది కాదు.... ఇది యిప్పట్లో మారుతుందనీ అనుకోను. భార్య మాట భర్త వినకూడదని కాదు. వినకుండానూ వుండరు. ఎక్కడో భాస్కర్‌లాంటి వాళ్ళను చూపించి అంతా అలాంటి వాళ్ళేనని మగాళ్ళని నిందించడం మీ ఆడవాళ్ళకి ఫాషన్ అయిపోయింది యీ రోజుల్లో. భాస్కర్‌లాంటి మొగాళ్ళున్నట్టే-లత లాంటి ఆడవాళ్ళుంటారు. ఎటొచ్చీ తేడా ఏమిటంటే భర్త భార్యని హింసిస్తే మీ ఆడవాళ్ళు లోకం అంతా చాటుకుంటారు. అదే భార్య భర్తని హింసించి చిన్నపుచ్చి అవమానాలు పాలుచేస్తే ఆ భర్త తనలోతాను కుమిలుతాడు తప్ప పైకి చెప్పుకోడు. భర్త హింసించిన ఆడదానికి లోకం సానుభూతుంటుంది. అదే మొగాడయితే పెళ్ళాంని అదుపులో పెట్టుకోలేని చాతకాని వాడంటుంది లోకం. అందుకే మగాడు ఎప్పుడూ ఆడదాన్ని తన చెప్పుచేతల్లో వుంచుకుని గౌరవం కాపాడుకోవాలనుకుంటాడు. ఆమెని అదుపులో పెట్టడానికి అందుకే ఎప్పుడూ ప్రయత్నిస్తాడు. కుటుంబం నిలవడం కోసం, పిల్లల కోసం భార్యాభర్తలిద్దరూ కలిసి వుండడం కావాలి. భర్త ఎన్ని వేలు సంపాదించినా భార్యాబిడ్డల కోసం ఖర్చు పెడతాడు. కాని భార్యకి కాస్త డబ్బుండేసరికి తన డబ్బు, తన సంపాదన అన్నట్టు వేరు లెక్కలుపెట్టి గర్వం చూపిస్తుంది. అదే మీ ఆడవాళ్ళకి, మాకు తేడా.'' రామారావు ఉపన్యాసం యిచ్చాడు గర్వంగా.

రామారావు మాటల్లో ఎక్కడో నిజం వుందన్నది పద్మావతికి తట్టింది. అది అంగీకరించి తగ్గిపోవడం యిష్టం లేక ''అవును పావలా పూలకి, అర్ధ రూపాయి గాజులకి, రూపాయి సినిమాకి, ఏభై రూపాయల చీరలకి అన్నిటికి మొగుణ్ని దేబిరిస్తూ, బతిమాలుతూ, ఆయనగారి కసుర్లు తింటూ మీచేతి కింద పడుంటే మీకు సంతోషం గర్వం. అందుకే మాకు సంపాదన, డబ్బు వుంటే సహించలేరు. ఎప్పుడూ ఆడది తమ చెప్పుచేతల్లో వుండాలంటే-ఆడదానికి ఆర్థిక స్వాతంత్ర్యం వుండకూడదు అంటారు అవునా?' పద్మావతి సవాల్ చేసినట్లు అంది. రామారావు జవాబుకి కాస్త ఆలోచించాడు.

'లత విషయం చూడు. ఆవిడకి లక్షలు ఆస్తి వుంది. మొగుడు లేకపోయినా మహారాజులా దర్జాగా బతుకుతుంది. అంత డబ్బున్న ఆవిడ ప్రవర్తనని లోకం పట్టించుకోదు. అదే ఏ రెండు వందలో తెచ్చుకునే స్త్రీ భర్తని వదిలిపోవడానికి పదిసార్లు ఆలోచిస్తుంది. లతలా అంత నిర్లక్ష్యంగా ఎప్పటికీ వెళ్ళదు-అలా అని ప్రతి చిన్నదానికి భర్తని దేబిరించక్కరలేదన్న తృప్తి వుంటుంది.' విడమర్చి చెప్పబోయాడు రామారావు.

''భేష్. ఈ రోజునించి ఆడది రెండువందలు మించి సంపాదించరాదు అని రూలుపెడితే సరి గవర్నమెంటు' హాస్యంగా అంది పద్మావతి. సంభాషణ హాస్యంలోకి దిగింది. రామారావు నవ్వాడు.

''అంతే మరి. యీ సమస్యకి పరిష్కారం యింతే. కర్ర విరగకూడదు పాము చావాలంటే యిదే మార్గం. అక్కడితో మీ ఆటలుకట్టి నోరు మూసుకు కూర్చుంటారు. నీ సంగతే చూడు ఏవో కథలు రాసి పదో పాతికో సంపాదించుకుని నా డబ్బు అని గర్వపడతావుగాని నన్ను కాదని పైకి వెళ్ళే సాహసం నీకుందా. ఎంత గర్వంగా జవాబులు చెప్పినా యిల్లు విడిచి ఆ లతలా ధిక్కరించి వెళ్ళే స్తోమత నీకు లేక పోబట్టే యిలా వున్నావు. అమ్మో లేకపోతే యీ పాటికి నీవూ వెళ్ళేదానివే.' హాస్యంగా అన్నాడు రామారావు.

అతను హాస్యంగా అన్న మాట-నిజం అని తెల్సిన పద్మావతి 'ఆ....ఆ మీతో వాదన వేసుకుంటే వంట ఎవరు చేస్తారు. పనంతా అలాగే వుంది.' అని యింక వాదన పెంచే శక్తిలేక వంటింట్లోకి వెళ్ళిపోయింది. □

# ఆ అందంచిందే వాలుకళ్ళు




మిలమిలలాడే, సొగసులు చిందే ముగ్ధమనోహరమైన ఆ కళ్ళు. మీ కళ్ళనూ అంత అందంగా తీర్చిదిద్దుకోవచ్చు. ఎలాగంటే

**శింగార్ డీలక్స్ కాటుక (కాజల్) అందించే సహజమైన రూపంతో**

ఈ కాటుకను కళ్ళలోపల, పైరెప్పకూ, కింది రెప్పకూ, కనుకొలకులలో రాసుకుని చూడండి. దీనితో మీ కళ్ళలో తొణికిసలాడతాయి లక్షలాది భావాలు, భాషలు.

మరొక మాట! శింగార్ డీలక్స్ కాటుక శుద్ధమైన మూల పదార్థాలతో తయారుచేయబడింది. ఆరోగ్యమైన తీరులో ప్యాక్ చేయబడుతుంది.

**శింగార్**
డీలక్స్ కాటుక
(కాజల్)

## మీ కళ్ళకు మేలైనది, అందంగా తీర్చిదిద్దుకునేందుకు సాటిలేనిది.

everest/78/SH/326 t

# చైనాలో స్త్రీల ప్రగతి

సూసన్. ఎస్. రామ్

ఈ వ్యాస రచయిత్రి శ్రీమతి సూసన్. ఎస్. రామ్ లండన్‌లో పుట్టి అక్కడే ఎం. ఏ. వరకు చదివారు. 'దక్షిణ భారత దేశ గ్రామీణ ప్రజల వ్యవసాయ జీవనం' గురించి, పరిశోధనా వ్యాసం సమర్పించి 'లీడ్స్ యూనివర్సిటీ' నుంచి ఆమె పి. హెచ్‌డి పట్టం సంపాదించారు. మద్రాసు స్టెల్లామేరీస్ కళాశాలలో చరిత్ర ఉపన్యాసకురాలిగా రెండేళ్లు ఉద్యోగం చేశారు. శ్రీమతి సూసన్ భర్త శ్రీ ఎన్. రామ్ ఆంగ్ల దిన పత్రిక 'ది హిందు'కు సహాయ సంపాదకులుగా వుంటున్నారు. 'పీపుల్స్ చైనా రిపబ్లిక్' ఆహ్వానం మీద తన భర్తతోపాటు సూసన్ ఇటీవల చైనా పర్యటించి వచ్చారు. ముప్పైఏళ్ళ నాటి చైనా స్త్రీల స్థితినీ, ఇవాళ వారు సాధించిన ప్రగతినీ ఆమె ఈ వ్యాసంలో వివరిస్తున్నారు: [—వ. సం

అందంగా కత్తిరించుకున్న నల్లటి జుట్టు, నీలం గీతల తెల్లటి చొక్కా, బ్రౌన్ జాకెట్, నల్లటి లంగాతో నల్ల చెప్పులు తొడుక్కుని చాలా హుషారుగా కనిపించిన యాంగ్‌మాన్ చింగ్‌కు నలభై యేళ్లుంటాయి. తను పని చేసే టెక్స్‌టైల్ మిల్లుకు సమీపంలో వున్న తమ ఇంట్లో విశ్రాంతి తీసుకుంటూ వుంది. ఒక పరిశ్రమలో పని చేసే ఉద్యోగినిగా తన అనుభవాలు వివరించడానికి ఆమె ఎంతో ఉత్సాహం కనబరచింది.

"తొలిసారిగా నేను బైటపని చేయడానికి ప్రారంభించింది 1956 వ సంవత్సరం. ప్రస్తుతం నేత పరిశ్రమ (weaving work shop) లో పని చేస్తున్నాను. నా నెలసరి సంపాదన 68 యు ఆన్ (అంటే 340 రూ). మాకు ఇద్దరు సంతానం. పెద్దమ్మాయికి పదిహేడు సంవత్సరాలు నిండాయి. సీనియర్ మిడిల్ స్కూల్ పూర్తిచేసింది. పై చదువులు చదవమని ప్రోత్సహిస్తున్నాము. రెండో అబ్బాయికి పదిహేనేళ్లు. స్కూల్లో చదువుకుంటున్నాడు. ఇకపోతే మా యింటివరకు నేనే గృహ మానిని" అని ఒక చిరునవ్వునవ్వి ఆమె భర్తవైపు చూస్తూ "అంటే ఆలుమగలు ఇద్దరమూ యజమానులం అన్న మాట" అని గలగలా నవ్వింది. ఆమె చిరునవ్వుతో తన నవ్వును జతచేస్తూ మెరిసే కళ్ళతో – టీని కప్పుల్లో నింపుతున్నాడు మాకు ఇవ్వడానికి.

*

ఎగురుతూన్న కోడిపిల్లని పట్టుకోడానికి ఇంటి ముందున్న వరండాలో తిరుగుతోంది రైతు కుటుంబానికి చెందిన ఆ స్త్రీ. పొద్దుతిరిగిన ప్రాయంలో వున్న ఆమె మమ్మల్ని చూడగానే ఆప్యాయంగా లోపలికి ఆహ్వానించింది. తెల్లటి గోడల మధ్య-అందంగా అమర్చిన ఫర్నిచర్; రంగు రంగుల కర్టెన్లు; రకరకాల ఛాయా చిత్రాలతో ఆ గది చాలా అందంగా కనబడింది. వాటి మధ్య మమ్మల్ని కూర్చోబెట్టి తన గురించి చెప్పడం ప్రారంభించింది ఆమె.

"నా పేరు ఫూ యూచై (Fu-yu-chie) నా వయసు యాభై నాలుగేళ్ళు. అయినా నేను ఇంకా ఉత్సాహంగానే వున్నాను. మా యింట్లో నలుగురం వున్నాము. నేను, మా ఆయన, కొడుకు కోడలు - అందరం పని చేస్తున్నాము. పీపుల్స్ కమ్యూన్‌లో సభ్యురాలిగా నేను పొలాలలో పని చేస్తాను."

ఫూ యూచై పుట్టి పెరిగింది - 1949 సం॥ విప్లవానికి పూర్వం పాత చైనాలో. అంచేత నాటి జ్ఞాపకాలు నెమరువేసుకుంటూ - "పేరుకు మాది రైతు కుటుంబమే. కాని మాకంటూ కొద్దిపాటి భూమి కూడా వుండేది కాదు. అందువల్ల మా నాన్న, అన్నయ్య భూస్వాముల దగ్గర పని చేసే వాళ్లు. ఒక్కపూట కూడా కడుపునిండా తిండి దొరికేదికాదు. ఆ రోజుల్లో పల్లెప్రాంతాల స్త్రీల



పరిస్థితి పరమ దారుణంగా వుండేది. ఉదాహరణకు మా అమ్మనే తీసుకుందాం. ప్రసవవేదనకు తట్టుకోలేకుండా ప్రాణాలు పోగొట్టుకుంది. పుట్టిన మరుక్షణమే మా తమ్ముడు కన్ను మూశాడు. దీనికి కారణం ఆ రోజుల్లో వైద్య సౌకర్యాలు అందుబాటులో లేవు. అయితే ఇవాళ, రైతులైన మేము ఎలా వుంటున్నదీ - నేను చెప్పవలసిన అవసరం లేదు. మీరే కళ్ళారా చూసి తెలుసుకోవచ్చు. మాకు మూడు పూటలా తిండికి లోటు లేదు. మూడు గదులతో ఈ డాబా ఇల్లు మాదే. మా ఆయనకి, కొడుక్కి, కోడలికి సైకిళ్ళు వున్నాయి. పీపుల్స్ కమ్యూన్లు ఉచిత వైద్య సౌకర్యాలు కల్పించాయి. అంచేత జబ్బు చేస్తే బెంగ పడిపోవలసిన అవసరం మాకు లేదు. ఇక స్త్రీల పరిస్థితిలో నాటికి నేటికి చెప్పలేనంత భేదం కనిపిస్తోంది. ప్రతి ఒక్కరం - పరిశ్రమలోనో, పొలాలలోనో పనిచేసుకో వచ్చును. మేము చేసే పనులకు పురుషులతో సరిసమానంగా వేతనాలు పొందగల్గుతున్నాము.''

*

ఆకుపచ్చని యూనిఫాంలో అక్కడక్కడ నెరసిన జుట్టు మీద ఆర్మీ కాప్ పెట్టుకున్న తయువాన్ లాన్ చిరునవ్వుతో పలకరిస్తూ స్వాగతం చెప్పింది. ఏభై యేళ్లు దాటిన ఆమె - 'నార్మన్ బెత్యూన్ ఇంటర్‌నేషనల్ పీస్ హాస్పిటల్'లో డెప్యూటీ డైరెక్టర్‌గా వుంటోంది. ఇది పీపుల్స్ లిబరేషన్ ఆర్మీ నడిపే సుప్రసిద్ధమైన వైద్యశాల; పరిశోధనా విద్యాకేంద్రం. దాని పుట్టు పూర్వోత్తరాల గురించి వివరిస్తూ - వైద్యశాల చుట్టూ తిప్పి చూపారు. ఆమె వ్యక్తిగత జీవిత విశేషాలను వినడానికి కుతూహలం చూపాము. ఒక చిన్న నవ్వు నవ్వి, వివరించడానికి ప్రారంభించి దామె.

"1945 సం॥ పీపుల్స్ లిబరేషన్ ఆర్మీలో ఒక గొరిల్లా ఫైటర్‌గా నేను చేరాను. ఆ సమయంలోనే చీనా ప్రజలు - తిరోగమన శక్తులను తుదముట్టించడానికి కమ్యూనిష్టు పార్టీ నాయకత్వంలో చారిత్రాత్మక పోరాటం సాగిస్తున్నారు. 1948వ సం॥ లో వైద్య విద్యాలయం నుంచి పట్టా సంపాయించాను. ఆ తరువాత ఉత్తర చైనాలో పోరాడుతున్న గొరిల్లా శక్తులకు, సైన్యానికి వైద్య సేవ చెయ్యడం ప్రారంభించాను. 1949వ సం॥ చైనా స్వాతంత్ర్యం సాధించిన తర్వాత ఈ వైద్య నిలయంలో చేరాను. అప్పట్నించి ఇక్కడే వుంటున్నాను. 1970 సం॥ లో ఈ వైద్య నిలయానికి డైరెక్టర్ అయ్యాను.''

ఆమె కుటుంబం గురించి అడిగాము. "మా ఆయన కూడా పీపుల్స్ లిబరేషన్ ఆర్మీలోనే వుంటున్నారు. మాకు ముగ్గురమ్మాయిలు. వారిలో



ఇద్దరు డాక్టర్లుగా వుంటున్నారు. ఒకామె పికింగ్‌లో వుంటుంది.'' "మిమ్మల్ని చూసే బహుశా మీ అమ్మాయిలు ఉత్తేజితులై వుంటారు'' అని మేము అన్నప్పుడు - సిగ్గుతో, సగర్వంగా ఆమె నవ్విన నవ్వే సమాధానం అయింది.

*

ఇటీవలి ఇరవై దినాల చైనా పర్యటనలో నేను కలుసుకున్న అనేకమంది స్త్రీలలో పై ముగ్గురూ మూడు రంగాలకు చెందిన వారు. ఈనాటి తొంభై కోట్ల చైనా జనాభాలో సగానికి పైన స్త్రీలే. అందుకేనేమో కీర్తిశేషులైన చైనా ప్రజానేత మావోసేతుంగ్ - "స్త్రీలే సగం భారం మోస్తున్నారు'' అన్నారు. ఈ మాటలలో నవ చైనా సామ్యవాద సమాజ నిర్మాణంలో స్త్రీల పాత్ర, ప్రాముఖ్యత ద్యోతకమవుతాయి. నాగరికత గల న్యాయమైన సమ సమాజంలో స్త్రీ పురుషులు సమానం— అన్న అంశం విడదీయలేనిది—అని కూడా ఆసూక్తి సూచిస్తుంది.

మూడు దశాబ్దాలలో అంటే విప్లవానంతర కాలంలో స్త్రీ పురుషుల సమానత ప్రతి రంగంలో, అడుగడుగునా కనబడుతుంది. మెషీన్ ఆపరేటర్లుగాను, ఇంజనీర్లుగాను, మోటార్ డ్రైవర్లుగాను, పరిశోధనా వేత్తలుగానూ, స్త్రీలు మాకు కనబడ్డారు. గ్రామ సీమల స్త్రీ జనావళి - పొలాలలో పని చేయడంతో ఊరుకోడం లేదు. ట్రాక్టర్లు నడపడం, వ్యవసాయ సాంకేతిక సామగ్రిని బాగుచేయడం మొదలైన వృత్తులలో పాల్గొంటున్నారు. అంచేత గ్రామ కార్మిక శక్తిలో వారొక విశిష్టమైన స్థానం సంపాదించ గల్గారు. ఇక్కడి స్త్రీలు - కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమాల ద్వారా, విప్లవ సంఘాల కార్యకలాపాల మూలంగా - ప్రభుత్వ రంగంలో ప్రతి స్థాయిలోనూ అద్వితీయమైన పాత్ర నిర్వహిస్తున్నారు.

ప్రశంసనీయమైన ఈ పరిస్థితి ఈనాటి నవ చైనాలోనే. కాని పాత చైనాలో స్త్రీల స్థితి దీనికి విరుద్ధంగా నీచాతి నీచంగా వుండేది. మితిమించిన దోపిడీ, పేదరికం, వెనుకబడినతనం, మందగొడి బుద్ధి మొదలైన వాటిచే దారుణంగా పీడింపబడ్డారు. దీనికి కారణం? - నాటి స్త్రీకి ఎలాంటి హక్కులూ వుండేవి కావు. యజమానికి సేవలు చేయడమే వారి బాధ్యత. భూస్వామి, పురోహితుడు, వంశ నాయకుడు, భర్త వారి యజమానులు. భూ కామందులచేత, దుర్మార్గులైన అధికారులచేత శీలం కోల్పోయిన మగువలకు కొదువే లేదు. సంప్రదాయ భావాలకు కట్టుబడి, మూఢ నమ్మకాల ఊబిలో దిగబడిపోయి కట్టుకున్న వానిచేత, వాని తండ్రిచేత తన్నులు తిని తిని తనువులు చాలించిన

తరుణులకు తక్కువే లేదు ఆ కాలంలో. సామాజిక దురన్యాయపు పిడికిలిలో తగుల్కొని విలవిల లాడిన వారి బ్రతుకులకు భద్రత లేదు; భయం వుండేది.

మరి ఇలాంటి దయనీయమైన దుస్థితి ఇంత స్వల్ప కాలంలో ఎలా మటుమాయమయింది? దీనికి ముఖ్య కారణం—చైనా విప్లవనాయకులు వనితా జనోద్ధరణకు ఇచ్చిన ప్రాధాన్యత!

ప్రజాబలమే చైనా అమూల్యమైన సంపదగా కమ్యూనిస్టు పార్టీ విశ్వసిస్తుంది. భావికాల భాగ్యోదయానికి—దేశ ప్రజావళికి నాగరికమైన నివాసం కావాలి. అందుకోసం శతాబ్దాల తరబడీ అణచి వుంచబడిన స్త్రీజాతికి విమోచనం కల్గించాలి. అప్పుడే వారు – నిర్మాణాత్మక కార్యక్రమాలలో పాలు పంచుకొని నవసమాజ ఆవిర్భవానికి పాటు పడగలరు. మరి ఇదంతా ఆచరణ సాధ్యం అయ్యే దెలా? నాటి నాయకులు చూపిన మార్గం ఇది:

దోపిడీ ఏ రూపంలో వున్నా రూపు మాపాలి. ప్రజలు మోయలేక మోస్తూన్న భూస్వామి విధానం అంతం కావాలి. చైనా ఆంతరంగిక కార్యకలాపాలలో విదేశీయ జోక్యం ఎంతమాత్రం వుండ కూడదు. సామాన్య ప్రజా సంక్షేమానికి వ్యతిరేకంగా ఏ కొద్దిమంది లాభాలకోసమో నడుపబడే పరిశ్రమలను లేకుండా చేయాలి. కండలు పిండి కష్టం చేసే కార్మిక, కర్షక ప్రజావళి మార్గం వాళ్ళే నిర్దేశించుకోవాలి.

1940 సంవత్సరం ప్రాంతంలో వేలాదిమంది స్త్రీలు పై సిద్ధాంతాలచేత ప్రభావితులై కార్యరంగం లోకి ఆకర్షింపపడ్డారు. వయసు మళ్ళిననాటి సామాజిక దురన్యాయ వ్యవస్థను కూకటి వేళ్ళతో పెకలించే మహత్తర శక్తిగా రూపొందారు. కొందరు ప్రత్యక్షంగా పోరాటంలో పాల్గొన్నారు. మరి కొందరు వైద్యరంగంలోను, వ్యవసాయ రంగంలోను ప్రవేశించి విప్లవ శక్తులకు అండ దండలుగా నిలిచారు. ఇంకా కొంతమంది నవ సమాజ నిర్మాణ మహాయజ్ఞానికి తమ ప్రాణాలనే సమిధలుగా ఆహుతిచ్చారు.

విప్లవానంతరం ప్రవేశపెట్టబడిన భూసంస్కరణ పథకం స్త్రీ పురుషుల మధ్య ఆర్థిక సమానతను యేర్పరచడానికి చేసిన శంకుస్థాపన అయింది. భూస్వాములనుంచి స్వాధీనం చేసుకున్న లక్షలాది ఎకరాల భూములను స్త్రీ పురుష భేదాలు, చిన్నా, పెద్దా వ్యత్యాసాలు పాటించకుండా లేనివారందరికీ పంచిపెట్టబడింది. దేశ చరిత్రలోనే తొలిసారిగా – భూమి పట్టాలు స్త్రీల పేర్ల మీద ఇవ్వబడ్డాయి.

1950వ సంవత్సరంలో ప్రవేశపెట్టబడిన ప్రజా రిపబ్లిక్ చైనా వివాహ చట్టం వనితాభ్యుదయ పథంలో మరో మంచి మార్పును తీసుకొచ్చింది. పాతబడిన ఫ్యూడల్ వివాహ విధానానికి స్వస్తి చెప్పింది నూతన చట్టం! తన ఇష్టప్రకారం జీవిత భాగస్వామిని ఎంచుకునే అవకాశం; ఒకరికి ఒకతే అన్న నియమం; స్త్రీ పురుషు లిరువురికీ సరిసమానమైన హక్కులు; స్త్రీ న్యాయమైన కోర్కెల పరిరక్షణ – ఈ నూతన వివాహ చట్టం కల్పించింది.

గ్రామ సీమల మీద ఎక్కువ శ్రద్ధతో నెలకొల్పబడిన సమగ్ర వైద్యసేవా కార్యక్రమాలతో – ప్రజల ఆరోగ్య విషయంలో అపూర్వమైన మార్పు వచ్చింది. అందరికీ చదువు – అన్న పథకం – బూజు భావాలను దులిపివేసి, క్రియాశీల జీవిత సత్యాలను, నూతన విలువలను బోధించడంతో – పసిప్రాయం నుంచే స్త్రీలలో లోకువభావం పొడసూపకుండా – నూతనోత్తేజం వికసించింది. దాంతో లక్షలాది వనితలు క్రమక్రమంగా—వివిధ పరిశ్రమలలో, కర్మాగారాలలో, పీపుల్స్ కమ్యూన్ కేంద్రాలలో ప్రవేశించి బయటి ప్రపంచాన్ని చూడగల్గారు!

ఉద్యోగం చేయడానికి తగిన వయసులో వున్న ప్రతి స్త్రీ కూడా ఏదో ఒక ఉద్యోగం చేస్తూంది. పురుషులకు సరిసమానంగా స్త్రీలూ వేతనాలు పొందుతున్నారు. అంతేకాదు. స్త్రీలకంటూ కొన్ని ప్రత్యేకమైన సదుపాయాలూ సంరక్షణలూ వున్నాయి. ఉదాహరణకు ఒకటి: ప్రసవకాలంలో ఏభై ఆరు రోజులు సెలవు తీసుకోవచ్చు. గర్భకాలాంతంలోనూ, ప్రసవానికి తరువాత – పని బరువును బాగా తగ్గిస్తారు. అయితే అప్పుడు జీతాలు తగ్గించడం అన్నది మాత్రం లేదు. పరిశ్రమలలో పనిచేసే స్త్రీల ఉద్యోగ విరమణవయసు ఏభైయేళ్ళు. శారీరక బలం అంతగా అవసరం లేని ఉద్యోగాలయితే ఏభై అయిదేళ్ళవరకు పని చేయవచ్చు. ఉద్యోగ విరమణ తర్వాత పురుషులతో సరిసమానంగా – మౌలిక వేతనం (బేసిక్ పే)లో డెభ్భై నుంచి ఎనభై శాతం వరకు విరామకాల వేతనం (పెన్షన్)గా పొందుతున్నారు.

చైనాకు వెళ్ళే ప్రతి ఒక్కరి దృష్టిని మొట్ట మొదట ఆకర్షించేది – అక్కడ ఉద్యోగం చేసే గృహిణులకు వుండే వసతుల యేర్పాట్లు. పారిశ్రామిక ప్రాంతాలలోనూ, ఇళ్ళ ప్రాంతాలలోను భోజనవసతి గృహాల యేర్పాట్లు వున్నాయి. న్యాయమైన ధరకు మంచి భోజనం లభిస్తుంది. ఉద్యోగం చేసే భార్యాభర్తలిద్దరూ కనీసం రోజుకో పూట అయినా ఇక్కడ భోజనం చేస్తారు.

ఫ్యాక్టరీలు, పీపుల్స్ కమ్యూన్లు మున్నగునవి – నర్సరీలు – కిండర్ గార్డన్లు నడుపుతున్నాయి. పిల్లల పెంపకం విషయంలోనూ, చదువుల విషయంలోనూ ఇక్కడ ఇంటికన్నా ఎక్కువ శ్రద్ధాసక్తులు చూపుతారు. అంచేత పసిపాపల్ని చూసుకోడానికి తల్లి ఇంటిపట్టునే వుండాలనే నిర్బంధం తప్పుతుంది.

ముప్పైయేళ్ళ లోపలే అన్ని రంగాలలోనూ వనితలు ఇంతటి ముందంజ వేశారంటే అందరికీ ఆశ్చర్యం, ఆనందం కల్గిస్తుంది. ఈ విజయకారణం – ప్రజా క్షేమమే ప్రథమ లక్ష్యంగా భావించి, సామాజిక న్యాయం సాధించి, నవసమాజ నిర్మాణానికి కేవలం మాటలతో కాకుండా చేతలతో కృషి చేయడం! □



69

సశేష నవల

# కృష్ణవేణి

విమలారామం

"మా అమ్మ కూడ ఓ అమ్మ అయింది!" అంది కృష్ణవేణి చెల్లెల్ని కౌగలించుకుంటూ.

పట్టరాని ఆనందంతో మాటలు రాక అక్కగారి పరిష్వంగంలో పసిపాపలా ఒదిగిపోయింది మాధవి.

"అప్పుడే పెద్దమ్మ వచ్చిందని తెల్సినట్టుంది-నవ్వుతున్నాడందోయ్ మేనల్లుడు!" అంది సుజాత సుభద్రమ్మకి మనవడిని చూపిస్తూ.

"అక్కయ్య పెద్దమ్మవుతుంది....నేను కాదు వదినా!" అని జానకి వైపు చూసి నవ్వింది కృష్ణవేణి.

"ఆవిడ పెద్దమ్మకాదు .... పెద్దపెద్దమ్మ!" అంది సుజాత.

అప్పుడే అక్కడికి వచ్చిన రామచంద్రం "అమ్మల సంగతి, పెద్దమ్మల సంగతి పుట్టిననాడే తేల్చుకుంటాడు కాని....ముందు నిన్ను బుల్లెమ్మ గారో అని వంటవాడు పిలుస్తున్నాడు వెళ్ళు!" అన్నాడు పరిహాసంగా.

అందరి నవ్వులతో ఆ యిల్లు ప్రతిధ్వనించింది.

బిడియంగా ఎడంగా నిలబడిన పార్వతిని దగ్గరికి పిలిచి కుశల ప్రశ్న వేసింది. ఆనందభాష్పాలు కారుస్తూ మాటలురాక కూర్చొండిపోయిన అత్తగారి ఆరోగ్యం గురించి వివరాలడిగింది. 'బావున్నారా బాబయ్యగారూ!' అని నోరారా రాఘవరావుని అడిగింది. చిరునవ్వుతో బావగార్ని పలకరించింది. ఇట్టే యిల్లంతా తానే అయితిరిగింది కృష్ణవేణి!

"కాసేపు కూర్చోకూడదా వదినా!" అంటూ ఆమె వెంటే తిరుగుతోంది నిర్మల.

ఇల్లంతా కావల్సినంత సందడిగా ఉంది. పని వాళ్ళకేరింతలు పెద్దవాళ్ళ పరిహాస వచనాలు కలగాపులగమైపోయాయి. కమ్మని కబుర్లూ-నవ్వులు నిండిన కన్నీళ్ళు కలిసి కట్టుగా దొర్లివస్తున్నాయి.

విశ్వనాధం పేకాట మానివేసిన విషయం భార్యకీ – వియ్యంకుడికీ కూడా చెప్పాడు సత్య నారాయణగారు. కృష్ణవేణి సంతోషానికి అదే ముఖ్య కారణమని అంతా భావించారు!

మేనల్లుడి బాలసారె పండగ అట్టహాసంగా చేశాడు రామచంద్రం. మూడు రోజులు మూడు నిమిషాల్లా గడిచిపోయాయి.

తన కిక శలవయిపోయిందని వెళ్ళిపోతానన్నాడు విశ్వనాధం. శలవయిపోవట మేమిటి శలవు పొడిగించండని అంతా తలో వైపుగా వత్తిడి చేశారు. ఆ మధ్య కృష్ణవేణికి అనారోగ్యంగా ఉన్నప్పుడు అతను పదిహేను రోజులు శలవు పెట్టాడు. ఆ ప్రస్తావన రావటం కృష్ణవేణికి ఇష్టం లేదు. అందుకనే, "మళ్ళీ కొన్నాళ్ళు పోయాక వస్తాం లెండి." అంది ఆమె.

"అంటే, నువ్వూ వెళ్ళిపోదామనుకుంటున్నావా అక్కా!" అంది మాధవి తెల్లబోతూ.

"వచ్చిందేది-ఉన్నదేది? అప్పుడే వెళ్ళిపోతానంటారేమిటి వదినా!" అని నిష్ఠురమాడుతున్న సుజాత—

"మా ఇంట్లో కూడా నాలుగు రోజులు వుండి వెళ్ళరా?" అని ప్రాధేయపడుతున్న జానకి.

"వచ్చేవారం నిర్మలని చూసుకుందుకు పెళ్ళివారు వస్తున్నారు. మీరు కూడా ఉంటే బావుంటుంది." అని కోరుతున్న కృష్ణారావు.

"మీరిప్పుడు వెళ్ళటం ఎవరికీ యిష్టం లేదు. నా కసలే యిష్టం లేదు." అని చిరుకోపం తెచ్చుకొంటున్న సుభద్రమ్మ.



అంతా తలా ఒక వైపున అనురాగపు సంకెళ్ళు వేసి లాగుతుంటే ఎటూ కదలలేని బంధితురాలై పోయింది కృష్ణవేణి.

"మీరంతా వూరికే కంగారు పడుతున్నారు కాని వదిన జోక్ చేసిందమ్మా!" అంది నిర్మల నవ్వుతూ.

"అంతగా శలవు లేకపోతే నువ్వు వెళ్ళరా నాయనా! కోడల్ని మాత్రం పది రోజులుంచుకుంటే కాని పంపను." అంది సుభద్రమ్మ.

"అలాగేనమ్మా! నాకేం అభ్యంతరం లేదు." అన్నాడు విశ్వనాధం.

అతని ముఖం తేటగానే వుంది. అతనిలో మార్పు వచ్చిన లక్షణాలు దీటుగానే కనిపిస్తున్నాయి. కాని, మళ్ళీ ఒక్కడూ ఉంటే మనసు చలిస్తుందేమో!.... ఆ భయంతోనే "పిల్లల స్కూళ్ళకి కూడా శలవు





ఇవ్వలేదు. మళ్ళీ త్వరలోనే వస్తాం లెండత్తయ్యా!" అంది కృష్ణవేణి.

"ఇంక జోక్స్ వేయకు వదినా! నారిగాడు బియ్యే సుబ్బిగాడు ఎమ్మే చదివేస్తున్నారా? వీళ్ళ చదువులకి పెద్ద శలవులు కూడా కావాలేమిటి?" అంది నిర్మల నవ్వుతూ.

"పోనీ, నువ్వుండు కృష్ణా! .... నాకేం ఫర్వా లేదు. నాలుగు రోజులు ఏ హోటల్లోనో తిని గడి పేస్తాను!" అన్నాడు విశ్వనాథం.

ఆమె పని యిరకాటంలో పడింది. అవునన లేదు కాదనలేదు. కాదు కూడదని బలవంతంగా వెళ్ళిపోతే ఇక్కడంతా నొచ్చుకుంటారు. వెళ్ళక పోతే తన భవిష్యత్తు ఏమవుతుందో! భర్తలో వచ్చిన మార్పు శాశ్వతమేనని సంతృప్తిపడి ధైర్యంగా ఉండిపోవచ్చునా?

చివరకి మాధవి కన్నీళ్ళకి కరిగిపోయి, నిర్మల మాటలకి కట్టుబడి పోయి—రేపటి రోజుని రేపటి విధికే వదలిపెట్టి ఉండిపోటానికే నిశ్చయించుకుంది కృష్ణవేణి. అప్పుడు అంతమందిని సంతోషపెట్టిన ఆమె నిర్ణయం తనకు తానే విధించుకున్న శిక్ష అవుతుందని అప్పుడామె ఊహించుకోలేక పోయింది!

## 70

ఆనాడు విశ్వనాథం కొట్టబోతే తన మీద కిరస నాయిలు పోసుకుని అంటించుకున్నంత పని చేసింది కృష్ణవేణి. అదొక షాక్ ట్రీట్‌మెంట్‌లా పని చేసింది. ఆ వారంలోనే ఆమెకు ప్రమాదకరమైన వ్యాధి అంకురించిందని డాక్టరు చెప్పటం మరొక స్ట్రాంగ్ డోసులా పని చేసింది.

'పేకాట జబ్బు' ముదిరిపోయిన విశ్వనాథానికి ఈ రెండు మందులూ వెంటనే గుణమిచ్చి అతన్ని కొంతవరకు ఆరోగ్యవంతుడ్ని చేశాయి.

అయితే, బుర్రకు పట్టిన జబ్బుకి మందు ఆ బుర్రలోనే ఉంటుంది! తన వ్యసనం వల్ల కుటుం బానికి భార్యకి చివరికి తనకి ఎంత అపకారం జరి గిందో అతను బాగా ఆలోచించుకుని వుంటే నిజ మైన పశ్చాత్తాపంతో మనసుని మెత్తన చేసుకుని అతను ఆ వ్యాధి నుంచి పూర్తిగా బయటపడి ఉండేవాడు.

దురదృష్టవశాత్తూ అతనిలో మానవ సహజమైన బలహీనతలు కొన్ని మిగిలిపోయాయి. భార్య ఔదార్యాన్ని భరించలేకపోతున్నాడు. స్నేహితుని

ఓదార్పుకి తట్టుకోలేకపోతున్నాడు. ఎవరు మంచిగా మాట్లాడినా అది తన మంచి కోరినవాళ్ళ మంచి బుద్ధి అనుకోవటం పోయి-తను అల్పుడని వాళ్ళు గొప్పవాళ్ళని చెప్పకనే చెప్పుతున్నారనుకుంటున్నాడు. దీనికితోడు — కృష్ణవేణి మీద సానుభూతితో పురుషోత్తం చెప్పిన మాటలు, అతని మీద కృతజ్ఞతతో ఆమె అన్న మాటలు వికృత అర్థాన్ని తోపించాయి.

హైదరాబాదు వెళ్ళేముందు అంతరాంతరాలలో రగిలిన ఈ అనారోగ్యపు ఆలోచనలు భార్య అనారోగ్యం వల్ల అలాగే అణగిమణగి ఉన్నాయి. కాని, అతను ఒంటరిగా తిరిగి వచ్చాక ఏ వ్యాపకమూ లేకపోయాక ఒక్కసారిగా విషపు నాలుకలు చాచుకుని తాండవ నృత్యం ప్రారంభించాయి.

హోటల్లో భోజనం చేస్తున్న విశ్వనాథాన్ని చూసి కృష్ణవేణి వచ్చేదాకా తమ ఇంట్లో భోజనం చేయమన్నాడు పురుషోత్తం. చూద్దాము చూద్దామని రెండు మూడు రోజులు తప్పించుకు తిరిగాడు అతను. స్నేహితుడు మొహమాట పడుతున్నాడని ఒక రోజున బలవంతం చేసి ఆఫీసు నుంచి తిన్నగా ఇంటికి తీసుకు వెళ్ళాడు పురుషోత్తం.

కృష్ణవేణి ఎంత దొడ్డ యిల్లాలో మాటవరసకి చెప్పుకుంటూ వచ్చింది పురుషోత్తం భార్య. తన భార్యని వాళ్ళు పొగడటం - తన అదృష్టాన్ని కొనియాడటంగా భావించటం పోయి, అటువంటి భార్యని ఇంతకాలం బాధ పెట్టిన నువ్వు ఎంత దుర్మార్గుడివో తెలుసా - అని వాళ్ళెత్తి చూపుతున్నట్టుగా భావించాడు. వాళ్ళు తమ కుటుంబాల మధ్య చాలా కాలంగా వున్న స్నేహాన్ని అమాయకంగా ప్రస్తావించటం అతన్ని రెచ్చకొట్టటానికే పనికి వచ్చింది!

అగ్నికి ఆజ్యం తోడయినట్టు ఆ మర్నాడు—మరో సంఘటన జరిగింది. పేకాట స్నేహితులు రెడ్డి, అప్పారావు ప్రభృతులు కాకతాళీయంగా బజారు సెంటర్లో కలిశారు. 'ఏం గురూ మా మీద సీత కన్నేసావేమిట'ని ఒకడంటే 'మేమంతా చెడ్డ వాళ్ళం నువ్వు అమాంతంగా మంచివాడివేనా?' అని మరొకడు. 'దేనికయినా దమ్ములుండాలోయ్!' అని ఒకడంటే — 'పురుషోత్తంగాడు గురుడుకి బ్రెయిన్‌వాష్ చేసినట్టున్నాడు' అని ఇంకొకడు.

మళ్ళీ వాళ్ళు పురుషోత్తం పేరెత్తేసరికి విశ్వనాథం అహం దెబ్బతింది. తనకో వ్యక్తిత్వం లేనట్టు వాళ్ళు మాట్లాడడంతో పౌరుషం పొడుచుకు వచ్చింది. "నోర్ముయ్యండోయ్! ఎవడి మాటలో వినేంత చవటను కాను!" అన్నాడు....సరిగ్గా అదే సమయంలో వాళ్ళ మాటలు విని లొంగిపోతున్నా నన్న విషయం గుర్తించక!

"అయితే, ఇవేళ నీ ప్రతాపం చూపించు మరి!" అని ఎత్తి పొడిచాడు అప్పారావు. ఒకప్పుడు తనని పేకాటలో దింపి భ్రష్టుడు చేసిన వాడితడేనని కాని, మరోసారి రోడ్డు మీద తనని పట్టుకు కొట్టిన వాడితడేనని కాని .... విశ్వనాథానికి అప్పుడు గుర్తు రాలేదు. అప్రయత్నంగా జేబులు తడుముకున్నాడు. అతని చేతులకి నోట్లు తగిలాయి. అతని కాళ్ళు 'ప్రతాపం' చూపించటానికి పరుగులెత్తాయి!

ఆ క్షణంలో పేకాట ఆడనని భార్య కిచ్చిన మాట కాని, ఆమె అనారోగ్యం విషయం కాని.... 'ఇన్ని నగలు తగలపెట్టేసానా? .... నన్నింతకాలం చంపెయ్యాలని నీకెలా అనిపించలేదు కృష్ణా!' అని ఆవేళ ఏడ్చిన తన ఏడ్పు కాని, 'ఒక పూట పస్తుండేనాసరే నీ నగలు విడిపిస్తాను....' అని ఆ మర్నాడు అన్న మాటలు కాని....అతనికి గుర్తు రాకుండా పోయాయి.

కృష్ణవేణి హైదరాబాదు నుంచి మానసికంగా శారీరకంగా విశ్రాంతి తీసుకుని తిరిగి వచ్చేసరికి.... ఆమెకు మళ్ళీ అశాంతిని అందిస్తూ అతని 'వ్యాధి' అతిఘోరంగా తిరగబెట్టింది!

## 71

హైదరాబాదు నుంచి తిరిగి వచ్చిన వెంటనే "వచ్చావా కృష్ణా! ఇన్నాళ్ళూ నువ్వు లేకపోతే నాకు ఎలాగో వుంది" అంటూ నవ్వుతూ పలకరించిన భర్తను చూసేసరికి కృష్ణవేణి గుండెల మీద నుంచి పెద్ద బరువు తీసివేసినట్టయింది. పిల్లల్ని దగ్గరకి తీసుకుని ప్రయాణం బాగా జరిగిందా అని అతను వివరాలు అడుగుతుంటే పరమానందపడిపోయింది. భర్త మీద అనవసరమైన అపోహలతో వచ్చానే అని తన్నుతాను నిందించుకుంది.

కాని, భార్య నెలాగయినా ప్రసన్నురాల్ని చేసుకుని తను పేకాట కొనసాగించాలన్నది అతని ప్రయత్నం!....గత వారంలో అతనికి కలిసి వస్తున్న 'ఆటలు' తన దశ మారిందని చెప్పతున్నాయి. ఎంతో కాలంగా తాను ఎదురు చూసింది అటువంటి దానికోసమే! ఏమయినా ఈ అవకాశం జార విడుచుకోకూడదు. ఇంతకాలంగా పోయిన డబ్బంతా రాబట్టాలి!....ఇదీ అతని ఆలోచనల వరస.

ఆవేళ భార్యని సంతోష పెట్టటానికి ఎన్నో విధాల తాపత్రయపడ్డాడు. ఆమెతో కలిసి ఇల్లంతా శుభ్రం చేశాడు. ఇంట్లోకి కావలసిన సామాన్లన్నీ లిస్టు రాయించుకు వెళ్ళి తెచ్చాడు. ఆమెను మళ్ళీ డాక్టరు దగ్గరకి తీసుకు వెళ్ళి చూపించాడు. ఆయన రాసి ఇచ్చిన మందులు తెచ్చాడు.

మల్లెపూలు తెచ్చి ఆమె తలలో స్వయంగా తురిమాడు. గతమంతా ఒక పీడకలనిపించేలా ఆమెకు సరికొత్త అనుభూతుల్ని అందజేశాడు. 'నిజంగా నా అంత అదృష్టవంతురాలు ఎవ్వరూ వుండరు!....' అని ఆమె పారవశ్యంతో పొంగి పొరలి మధురగీత మాలపించేలా చేశాడు.

కొన్ని సంవత్సరాల తర్వాత ఆమె పరిపూర్ణమైన సుఖమనుభవించింది-ఆ ఒక్క రోజునే!.... ఆ నెలలో అతను పేకాటకి వెళ్ళని రోజు అదొక్కటేనని ఆమెకు తెలియదు!

మరునాడు సాయంత్రం ఇంటికి వచ్చి టిఫిను తిన్నాక 'ఒక్కసారి అటు వెళ్ళొస్తాను కృష్ణా!" అని అతను అనేసరికి కృష్ణవేణి తెల్లబోయింది.

"ఆట్టేసేపుండను. త్వరగా వచ్చేస్తా!" అన్నాడు బతిమాలుతూ.

అయితే, తను పూళ్ళో లేనప్పుడు అతను ఆటకి వెళ్ళలేదని నమ్మేదెట్లా?....ఆమె తెప్పరిల్లే సరికే అతను బయటకు వెళ్ళిపోయాడు.

ఆవేళ కూడా అతనికి నష్టం రాలేదు. పదో పరకో చేతికి వచ్చింది. భార్య సంతోషిస్తుందన్న భ్రమలో ఆ సంగతి గొప్పగా చెప్పాడు.

ఆమె మాట్లాడక విని పూరుకుంది.

మర్నాడు ఆఫీసు నుంచి సరాసరి ఆటకి వెళ్ళిపోయాడు. అయితే, త్వరగా లేచి వచ్చేశాడు.... ఎవరితోనో మాట్లాడుతుంటే ఆలస్యమయిందని ఆమె అడక్కుండానే చెప్పాడు.

అప్పుడూ ఆమె విని పూరుకుంది.

ఆ మర్నాడు ఎవరో బలవంతం చేస్తే సినిమాకి వెళ్ళానని అబద్ధం చెప్పాడు.

"నన్నూ పిలిస్తే నేనూ వచ్చేదాన్ని!...." అని ఆమె బలవంతంగా నవ్వు తెచ్చుకుంది.

"రేపో ఎల్లుండో వెడదాము. మనం కలిసి సినిమాకి వెళ్ళి చాలా రోజులయింది!" అన్నాడు రోజులు కాదు, సంవత్సరాలయిందన్న విషయం మర్చిపోయి!

ఆ తర్వాత నాలుగు రోజులయినా అతనా

ప్రస్తావన ఎత్తలేదు. ఓ రోజు వేళకి వస్తున్నాడు. మరో రోజు ఆలస్యం చేస్తున్నాడు. ఆమె భయాలన్నీ మళ్ళీ నిజం చేస్తున్నాడు!

మళ్ళీ అతను పేకాటకి పూర్తిగా లొంగిపోయాడని గ్రహించటానికి ఆమెకి ఆట్టే రోజులు పట్టలేదు.

అయ్యో - ఇట్టే మారినట్టే మారి అట్టే అటు తిరిగిపోయాడే! ఇక అతను తనకు దక్కడా? ఇంతకాలం ఎవరో ఒకరు తనకు అండగా వున్నారు. ఇప్పుడు ఒంటరిగా తానీ భారం మోయటం ఎలా? ఇతను మారిపోయాడని అక్కడ అయిన వాళ్ళంతా నమ్మి సంతోషపడుతున్నారు. మళ్ళీ ఈ సంగతి వింటే వాళ్ళేమనుకుంటారు?

ఆమె ప్రశ్నలకు ఇంకా జవాబులు దొరకుండా ఓ రోజు రాత్రి మరో పెద్ద ప్రశ్నార్థకం వేస్తూ వచ్చాడు విశ్వనాధం!

"కృష్ణా! ఇవేళ పట్టిందంతా బంగారమేనే, ఇక నుంచి నీ ఒళ్ళంతా బంగారంతో నింపేస్తాను. చూడు! ఇదిగో చీర కట్టుకో!...." అంటూ తెచ్చిన కొత్త చీర విప్పి ఆమె చుట్టూ కప్పుతూ పకపకా నవ్వాడు.

అతని తప్ప తప్ప మాటలు మొదట అర్థం కాక తెల్లబోయి చూసింది ఆమె. తనని గమ్మత్తు చేద్దామని నటిస్తున్నాడేమోనని పరీక్షగా చూసింది. కాని దగ్గరకి వచ్చి తన్ను కౌగలించుకుని ముఖం మీద ముద్దు పెట్టుకుంటున్నప్పుడు గుప్మని వాసన వచ్చింది!

ఆ అఘాతానికి తట్టుకోలేక తెల్లబోయి చూస్తున్న భార్య ఒంటి మీద తను చుట్టిన కొత్త చీరతోపాటు కట్టుకున్న చీర కూడా విప్పేయటం మొదలు పెట్టాడు అతను. "నేనే కడతాను కృష్ణా! నీకివేళ చీర నేనే కడతాను...." అంటూ చేతులు పట్టు దొరక్క ఆమె ఒళ్ళంతా తడిమేస్తున్నాడు.

నిద్దట్లోంచి ఉలిక్కిపడినట్టు స్పృహలోకి వచ్చింది కృష్ణవేణి. అతని చేతుల్ని విడిపించుకుని తెరచి వున్న వీధి తలుపులు గబుక్కున వేసి వచ్చింది. నిద్రపోతున్న పిల్లలు లేచి ఎక్కడ చూస్తారో అని కంగారు పడుతూ అతన్ని లోపలి గదిలోకి లాక్కుపోయింది.

ఆమె గుండె చెరువు చేసుకుంటూ ఎన్ని ప్రశ్నలు వేసినా ఆమెనలా కౌగలించుకొని అర్థంపర్థం లేనిదేదో గొణుగుతూ పడి వున్నాడే కాని ఆమె బాధ నర్థంచేసుకొనే స్థితిలో లేడతను.

ఆ రాత్రంతా ఆమెకు కంటిమీద కునుకులేదు! ఆలోచిస్తోంది.... ఇంతకాలం ఒక వ్యసనంతోనే తన ప్రాణాలు కడబట్టిపోయాయి. ఇక ఇది కూడా అలవాటయితే తను భరిస్తూ బ్రతకటం అసంభవం! పిల్లలు ఎటూ కాకుండా పోతారు. వాళ్ళకి రెక్కలు వచ్చేదాకానయినా తను బ్రతకాలి!.... అతనీ వ్యసనాలకి బానిసయి వుండగా తన బాధ అర్థంచేసుకోడు. ఇంక యిక్కడుంటే పిల్లలు బాగుపడరు. అతని పతనం వాళ్ళ జీవితాల మీద పెద్ద దెబ్బ తీస్తుంది. తండ్రిగా అతను బాధ్యత మర్చిపోయినా తల్లిగా తను విస్మరించకూడదు. ఎక్కడికయినా వెళ్ళిపోతానని బెదిరిస్తే అతను లొంగి మనస్సు మార్చుకున్నాడా సరి ... లేకపోతే, తను వెళ్ళిపోవాలి. ఎక్కడికయినా సరే వెళ్ళిపోవాలి!

ఒక కఠిన నిర్ణయానికి వచ్చాక ఆమెకు కొంత ఉపశాంతి కలిగింది. ఎప్పుడో మాగన్నుగా తెల్లవారు ఝామున నిద్రపట్టింది.

విశ్వనాధానికి మెలుకువ వచ్చింది. రాత్రి తను చేసిన పని గుర్తుకు వచ్చింది. భార్య ఎంతో బాధపడి వుంటుందని కూడా అనుకున్నాడు. అందుకనే ఆమె ఏమన్నా సరే కోపగించకుండా ఉందామని నిశ్చయించుకున్నాడు. ఆమెను ప్రసన్నురాలిని చేసుకోవాలని నిద్రపోతున్న ఆమె ఒంటిమీద చేయివేసి ప్రేమగా నిమరసాగాడు.

ఆమెకి మెలకువ వచ్చింది. నవ్వుతూ తనవైపు చూస్తున్న భర్తని క్షణంపాటు కన్నార్పకుండా చూసింది. అతను వేయబోయే గాలానికి చిక్కకో కూడదని చటుక్కున పైకి లేచిపోయింది!

పిల్లల్ని లేపింది. గబగబా స్నానాలు చేయమంది. బట్టలు తొడుక్కోమంది. వాళ్ళకి చద్దన్నాలు పెట్టింది. గబగబా వంటచేసి తనూ స్నానం చేసి వచ్చి బట్టలు మార్చుకుంది. ఇంట్లో అక్కడక్కడ పడి వున్న బట్టలన్నీ తీసుకురమ్మని పిల్లలకి పురమాయించింది.

"పెట్టె సర్దుతున్నావెందుకమ్మా!" అని కొడుకు అడిగితే, "మనమిక్కడ్నించి వెళ్ళిపోతున్నామురా!" అని భర్తకి వినిపించేలా గట్టిగా చెప్పింది.



రెబెకా టుల్లి

**అఖిల భారత స్థాయిలో చూస్తే మన రాష్ట్రం క్రీడారంగంలో అంతగా ముందంజ వేయడం లేదనే చెప్పాలి. అయితే ఈ పరిస్థితి మారి త్వరలోనే ఆంధ్ర రాష్ట్రం కూడా క్రీడారంగంలో అగ్రశ్రేణిని ఆక్రమిస్తుందని నిస్సందేహంగా చెప్పవచ్చును. అందుకు కారణం - ఇటీవలి కాలంలో కొందరు యువతీ యువకులు క్రీడారంగంలో సాధిస్తున్న ఘన విజయాలు! అటువంటి వారిలో చెప్పుకోదగ్గ వనిత—కుమారి రెబెకా టుల్లి.**

రెబెకా 1976లోనే - క్రీడాకారిణిగా పలువురి దృష్టిని ఆకర్షించింది. ఆ సంవత్సరం ఆమె నెల్లూరుజిల్లా ఆటల పోటీలలో పాల్గొని జావెలిన్, షాట్‌పుట్‌లలో ప్రథమ స్థానాన్ని, డిస్కస్ త్రోలో ద్వితీయ స్థానాన్నీ పొందింది. అప్పటికి రెబెకా వయసు పదకొండు సంవత్సరాలు మాత్రమే! ఆమె ప్రప్రథమంగా పోటీలలో పాల్గొనడం కూడా అదే!

విజయలక్ష్మి వరించిన రెబెకా అప్పటినుంచి క్రీడారంగంలో వెనుదిరిగి చూడలేదు. 1976 నుంచి గత సంవత్సరం దాకా ఆమె పాల్గొన్న ప్రతి పోటీలోనూ - బహుమతులు గెలుచుకుంటూనే వుంది. 1977లో కృష్ణాజిల్లా పోటీలలో జావెలిన్, షాట్‌పుట్, డిస్కస్ త్రోలలో ప్రథమ స్థానం సంపాయించడంతో తృప్తి చెందక హై జంప్‌లో పాల్గొని ద్వితీయ స్థానం పొందింది. ఆ సంవత్సరమే జాతీయ స్థాయిలో జరిగిన ఆటల పోటీలకు ఆంధ్రప్రదేశ్ ప్రతినిధిగా ఎన్నికై ఢిల్లీలో జరిగిన ఆ పోటీలలో పాల్గొన్నది. జాతీయ స్థాయిలో షాట్‌పుట్‌లో తృతీయ స్థానం,. జావెలిన్‌లో నాల్గవ స్థానం పొందింది. 1978లో హైద్రాబాద్‌లో జరిగిన రాష్ట్ర పోటీలలో జావెలిన్, షాట్‌పుట్‌లలో మొదటి స్థానాలు, డిస్కస్ త్రోలో ద్వితీయ స్థానం పొందింది.

గత సంవత్సరం క్విలాన్ (కేరళ)లో జరిగిన జాతీయ పోటీలకు కూడా రెబెకా ఎన్నికైంది. కాని స్కూలు పరీక్షలు (ఆమె పదవ తరగతి చదువుతున్నది) దగ్గర పడటంతో ఆ పోటీలలో పాల్గొనలేకపోయింది.

"జాతీయ స్థాయిలో కూడా ఈ పోటీలలో ప్రథమ స్థానం సంపాయించాలని నా అభిలాష" అంటుంది రెబెకా.

—ఉమ

"ఎక్కడికమ్మా!" అని సుభద్ర అడిగింది.

"ఏమోనమ్మా! నాకే తెలియదు...."

ఆమె మాటలకి పిల్లలే కాదు. అతనూ నిర్ఘాంత పోయాడు.

స్టౌ మీద వేడెక్కిన కాఫీ గ్లాసులో పోసి తెచ్చి భర్త ముందు పెట్టింది. అతను కళ్ళప్పగించి చూసాడు.

"బహుశ, నా జీవితంలో నా చేత్తో మీకు కాఫీ యివ్వటం ఇదే చివరిసారి అవుతుందేమో!" అంది గంభీరంగా.

నిశ్చలమైన దీపశిఖలా వెలుగుతున్న భార్య ముఖం చూసి గతుక్కుమన్నాడు విశ్వనాథం. "ఏమిటి కృష్ణా! నువ్వనేది - చేసేది నాకేం అర్థం కావటం లేదు!" అన్నాడు సాధ్యమయినంత మార్దవ స్వరంతో.

ఆ స్వరం తన గుండెల్ని కదలించి మళ్ళీ తన నిర్ణయాన్ని ఎక్కడ మార్చివేస్తుందోనన్న జంకుతో ఆమె సర్వశక్తుల్నీ కూడదీసుకుంది. పిల్లల్ని కాసేపు వీధిలోకి వెళ్ళమని పంపేసింది. "మీరు రాత్రి చేసిన పని ఎంతవరకు తీసుకు వెళుతుందో నాకు అర్థం కాకనే ఈ నిర్ణయానికి వచ్చాను."

"అంటే?"

"ఎక్కడికయినా తీసుకుపోయి నా పిల్లల్ని పెంచి పెద్దవాళ్ళని చేసుకుందామని!"

"నీ పిల్లలే కాని వాళ్లు నా పిల్లలు కారా?"

"ఆ సంగతి మీకు గుర్తుంటే రాత్రి తాగి వచ్చుండే వారు కాదు."

అతని ముఖం ఎర్రనయింది. "నేను త్రాగాలని త్రాగలేదు. వాళ్ళు....వాళ్ళు బలవంతం చేసారు. మీరు త్రాగితే త్రాగండి. కావాలంటే డబ్బిస్తాను కాని త్రాగనన్నాను. కాని, వాళ్లు నలుగురూ వేళా కోళం చేసేసరికి...."

"ఎవరా నల్గురు?"

"అదే, మా క్లబ్బులో ఫ్రెండ్సు! అసలేం జరిగిందంటే ఈ వారంలో వరసగా నాల్గు రోజుల్నించి నాకు లాభమే కాని నష్టం రాలేదు. దాంతో మా వాళ్ళంతా సెలబ్రేట్ చెయ్యమని గొడవ పెట్టారు. ఎంతోనా ఓ పదిహేను రూపాయిలయిందంతే! ఎంతొచ్చిందో తెలుసా రెండువందల పాతిక! అందులో డబ్బు పెట్టే చీర కొన్నాను. ఏదీ, ఎక్కడుందీ?" అంటూ లోపలి గదిలోకి వెళ్ళి తనే తెచ్చాడు. జేబులోని డబ్బు కూడా తీసి చూపించాడు. "నేననలేదూ! మనకెప్పుడో స్టార్ తిరుగుతుందని!" అన్నాడు నవ్వుతూ.

శిలాప్రతిమలా నిలబడి అతని మాటలు వింది కృష్ణవేణి.

"చీర బావుంది కదూ!" అన్నాడు.

ఆ చీరవైపు చూడకుండా అతన్ని సూటిగా అడిగింది. "మొన్న బజార్లో ఎవరో కలిసారన్నారు. అటు మొన్న శేషాద్రిగారింటికి వెళ్ళానన్నారు. ఇప్పుడు నాల్గు రోజుల్నుంచీ వరసగా లాభం వచ్చిందంటున్నారు. ఇందులో ఏది నిజమో నాకర్థం కావటం లేదు."

అతను తేలుకుట్టిన దొంగలాగయ్యాడు. "అదీ నిజమే! ఇదీ నిజమే! ఏదయితేనేం లాభం వచ్చింది కదా!" అన్నాడు బలవంతంగా నవ్వు తెచ్చి పెట్టుకుంటూ.

"ఆ లాభం మీచేత ఏ పని చేయించిందో కూడ కళ్ళారా చూసాను! దానికితోడు యిది కూడా అయితే యిక నేను బ్రతకలేను."

"ఇంకెప్పుడూ త్రాగను! నీ మీద ఒట్టు...." అన్నాడు ప్రాథేయపూర్వకంగా.

ఒక క్షణం సూటిగా చూసింది ఆమె.

"నన్ను నమ్ము కృష్ణా!"

"మీరు పేకాట కూడా మానివెయ్యాలి. అప్పుడే నమ్ముతాను."

"దానికీ దీనికీ సంబంధం ఏమిటి? త్రాగే వాళ్ళంతా పేకాడుతున్నారా? పేకాటాడే వాళ్ళంతా త్రాగుతున్నారా? ఏదో ఒక్కరోజు సరదాగా వాళ్లు సెలబ్రేట్ చేయమంటే...."

"సెలబ్రేట్ చేయటం దేనికండీ! మీకు ప్రమోషను వస్తే చేయచ్చు. మీ అబ్బాయికి ఉద్యోగం వస్తే చేయచ్చు. మీ అమ్మాయి పెళ్ళి జరిగితే చేయచ్చు. లోకంలో అందర్కీ సెలబ్రేట్ చేయటానికి చాలా చాలా మంచి కారణాలున్నాయి. మీరేం గొప్ప పని చేసారని సెలబ్రేట్ చేసారు?"

విశ్వనాథానికి పౌరుషం వచ్చింది. అయినా, భార్య ప్రశ్నకి ఏ జవాబు చెప్పాలో తెలియక చీర లోపలి గదిలోకి విసిరేసి విసురుగా కుర్చీలో కూలబడ్డాడు

"తాగి తందనాలాడటం సెలబ్రేషను అనిపించుకుంటుందా? లోకంలో యిలాంటి పండగలు కూడా ఉంటాయా? ఇదెక్కడి కర్మండీ!" ఆమె గొంతు ఉద్వేగంతో వణికింది.

"బయట అనేకమందితో తిరిగే మగవాడికి సవాలక్షరకాల సంబంధాలుంటాయి! ఒక్కోప్పుడు కంపెనీ కోసం ఏదైనా చేయాల్సి వస్తుంది. ఇంట్లో కూర్చునే ఆడదానికి నీకేం తెలుస్తాయివన్నీ!...."

ఆమె ముఖం జేవురించింది. "అవేం తెలియవనే మీ యిష్టం వచ్చినట్లుంటున్నారు మీరిన్నాళ్ళూ! కాని, మీకు ఎటువంటి వాళ్ళతో సంబంధముందో - ఎలాంటి సంబంధముందో తెలిశాక యింకా ఏమీ తెలియని దానిలా కూర్చోవటం నాకు చేతకాదు. ఇంతకాలం ఎలాగో సహించాను. ఇంక సహించటానికి నాకు శక్తిలేదు. ప్రయోజనమూలేదు."

"ఇంతకీ ఏమంటావ్?" అన్నాడతను విసుగ్గా.

"ఆవేళ ఇంకెప్పుడూ పేకాట ఆడనన్నారు.... ఆ తర్వాత మనసు అటు లాగుతోందంటే ఒక్కసారిగా అలవాటు మార్చుకోవటం కష్టమని మధ్య మధ్య వెళుతున్నా సరిపెట్టుకున్నాను. కొన్నాళ్ళకదే మర్చిపోతారనుకున్నాను. మీరు మారిపోయారన్న ధైర్యంతోనే అక్కడన్నాళ్ళున్నాను. మీర్ను మంచి దారిని పడ్డారనే వాళ్ళంతా మురిసిపోతున్నారు. కాని మీరిక్కడ మళ్ళీ మొదలు పెట్టారు. మళ్ళీ మొదటికి వచ్చారు."

"ఇప్పటికీ అప్పటికీ చాలా తేడా వుంది. ఇది వరకంతా పోయేది .... ఇప్పుడు పోవటం లేదు. ప్రతి రోజూ ఎంతో కొంత వస్తోంది!...."

"మీకక్కడేదో వస్తుందంటున్నారు. ఇక్కడ మీరెంత పోగొట్టుకుంటున్నారో గుర్తించటం లేదు. మీరు ఇంటికి సాయంత్రం పెందరాళే వచ్చి ఎన్నాళ్ళయింది? నన్నెక్కడికో షికార్లు, సినిమాలకి తీసుకు వెళ్ళటం లేదని అనటం లేదు. కట్టుకుందుకి బట్టలు తెస్తున్నారా లేదా అని అడగటం లేదు. నా గురించి మీరేం పట్టించుకోకపోయినా భరిస్తున్నాను. కాని, కన్నపిల్లలకి మీరేం చేస్తున్నారు? వాళ్ళని దగ్గరకి తీసుకుని ఎన్నాళ్ళయింది? వాళ్ళకి తండ్రి ప్రేమ పంచి పెట్టాలని మీకెప్పుడూ అనిపించదా అసలు? వాళ్ళు చదువుకుని పైకి రావాలని అందుకు మీరు కొంత పట్టించుకోవాలని మీరు అనుకోరా? .... చెప్పండి! వీటన్నిటినీ మీ పేకాటలో సంపాదించే డబ్బు కొనిపెడుతుందా? లోకంలో ప్రతిదీ మీరు డబ్బుతో కొని తేగలరా? ఆలోచించండి!...."

అతని తలకెక్కేదంతా ఎక్కలేదు. "ఎంత సేపూ నీ ధోరణి నీదే! ఇన్నాళ్ళకి స్టార్సు తిరిగితే...."

ఆమెకి ప్రాణం ఉసూరుమంది. "మీ స్టార్సు మిమ్మల్నెటు త్రిప్పుతున్నాయో నాకు తెలియదు కాని నా స్టార్సు నన్ను నరకం వైపు తీసుకు వెడుతున్నాయి. అందుకనే, ఇవేళ అటోయిటో తేల్చుకోవాలని నిశ్చయించుకున్నాను!"

అతను నొసలు చిట్లించాడు. "అంటే? ఏం చేస్తావ్?" అని తీక్షణ స్వరంతో అడిగాడు.

"మీరు పేకాట మానకపోతే ఇంట్లోంచి వెళ్ళిపోతాను." అందామె దృఢ స్వరంతో.

అతను గతుక్కుమన్నాడు.

"మీకు నేనూ పిల్లలూ కావాలా — పేకాట కావాలో వెంటనే తేల్చి చెప్పండి!"

పురుషాహంకారం అతనిలో తల యెత్తింది. "బెదిరిస్తున్నావా?"

"లేదు. మీకు ఎవరి మీద ఎక్కువ అభిమానముందో మీరే నిర్ణయించి చెప్పుతారని!"

తొణకని ఆమె స్వరం విని నివ్వెరపోయాడు అతను.

"ఎంతసేపు యిలా నిలబడమన్నా మీ జవాబు కోసం ఎదురు చూస్తూ నిలబడతాను. ఆలోచించుకుంటారా?....ఆలోచించుకోండి!"

"ఎక్కడికో పోతానంటున్నావు. అంత బాగా ఆలోచించుకున్నావన్నమాట!"

ఆమె పేలవంగా నవ్వింది. "హు! నే నీ నిర్ణయం నాలుగేళ్ళక్రితమే తీసుకుని వుంటే....నా సంసారం ఎప్పుడో బాగుపడి వుండేది!"

"ఇప్పుడు నీ సంసారం నువ్వు విడిగా పెట్టుకునేంత ధైర్యం వచ్చిందన్నమాట!"

"ధైర్యమున్నా లేకపోయినా పిల్లల్ని ఆరోగ్యమైన వాతావరణంలో పెంచవలసిన బాధ్యత వుంది."

"ఏమిటంత ధీమా? నీ కాస్తి పాస్తులున్నాయా?" అన్నాడు వెటకారంగా.

"మీరు అనుకునే ఆస్తిపాస్తులు లేవు కాని నా, బిడ్డల్ని వృద్ధిలోకి తెచ్చే ఆస్తి నా గుండెల్లో ఉంది. ఈ రెక్కల శక్తి ఒక్కపూట తిండి పెట్టినా— తల్లిప్రేమ మరో పూట కడుపు నింపుతుందన్న ధైర్యం నాకుంది! వాళ్ళకి రెక్కలు వచ్చేవరకు ఈ ప్రాణాలెలాగో నిలుపు కోటానికి ప్రయత్నిస్తాను...."

"నువ్వెక్కడికి వెళ్ళాలనుకుంటున్నావో నాకు తెలుసు...."

"నాకే తెలియదు. మీకెలా తెలుస్తుంది?"



1. ఈ సంవత్సరం ఒక ప్రఖ్యాత శాస్త్రవేత్త శతజయంతి ఉత్సవాలు జరుగనున్నాయి. ఆయన ఎవరు?
2. ప్రపంచంలో కల్లా అత్యంత విస్తీర్ణమైన పార్కు ఏది? ఎక్కడుంది?
3. పశ్చిమ జర్మనీ, హాంగ్‌కాంగ్, ఇరాన్, శ్రీలంక, బర్మా దేశాల రాజధానీ నగరాలు ఏవో చెప్పగలరా?
4. ఈ మధ్య మన దేశానికి ఒక అగ్రరాజ్యపు ప్రధాని మన ప్రధానితో చర్చలు జరపడానికి వచ్చారు. ఆయన పేరేమిటి?
5. ఐక్యరాజ్యసమితిలో ఒక విభాగమైన బాలల అభివృద్ధి సంస్థ పేరేమిటి? అది ఎప్పుడు స్థాపించబడింది? దాని ముఖ్య స్థావరం ఏ నగరంలో వుంది?
6. పశ్చిమ బెంగాల్, ఒరిస్సా, పంజాబ్, కేరళ, కర్ణాటక రాష్ట్రాల ముఖ్యమంత్రులు ఎవరో చెప్పగలరా?
7. ఫిబ్రవరి 17-22 తేదీల మధ్య హైద్రాబాద్‌లో జాతీయ క్రీడల పోటీలు జరిగాయి. అందులో ఒక వనిత ఐదు స్వర్ణపతకాలను గెలుపొందింది. ఆమె ఎవరు? ఏ రాష్ట్రానికి చెందినది?
8. నవీన పద్ధతులతో భారత దేశంలో వెలువడిన తొలి వార్తాపత్రిక ఏది? ఎక్కడ నుంచి వెలువడింది?
9. మన రాజ్యాంగచట్టం జనవరి 26, 1950న అమలులోకి వచ్చింది. ఆ రాజ్యాంగ చట్టానికి మొట్టమొదటి సవరణ 1951లో చేయబడింది. అయితే యింతవరకు ఎన్ని సవరణలు చేయబడ్డాయో చెప్పగలరా?
10. భారత దేశంలో నిర్మింపబడిన మొట్టమొదటి టాకీ చిత్రం ఏది? ఎప్పుడు నిర్మించబడింది?

[సమాధానాలు ఈ సంచికలోనే వున్నాయి. వెతికి మీ సమాధానాలతో సరిపోతాయేమో పోల్చి చూసుకోండి]

"తెలియక పోవటమేం? హైద్రాబాదులో నిన్ను నెత్తి మీద పెట్టుకునే వాళ్ళంతమందున్నారు. అదే నీ ధీమా!....నా మొగుడో పనికిమాలిన వెధవ అని చెప్పుకుంటావు. దాంతో...."

"మిమ్మల్ని అగౌరవ పరుస్తూ నేనెవ్వరితోనూ ఎప్పుడూ ఏదీ మాట్లాడలేదు. ఇక ముందు మాట్లాడను కూడా!...."

"వేరే మాట్లాడాలేమిటి? వెళ్ళి వాళ్ళిళ్ళల్లో కూర్చుంటే చాలదూ?"

"ఇక నేనెప్పటికయినా హైద్రాబాదు వెళ్ళటం అంటూ వస్తే .... మీరు తీసుకు వెళ్ళినప్పుడే! ఎవరి సంసారాలు వాళ్ళవి. ఎవరి బాధలు వాళ్ళవి. నా బాధ్యతలు ఎవ్వరి మీదా పెట్టను....ఇంతకాలం వాళ్ళు నా కష్టాల్లో పాలు పంచుకున్నారు. ఇక వాళ్ళని బాధ పెట్టటం నాకు న్యాయం కాదు. నా కిష్టమూలేదు...."

విశ్వనాథం అవాక్కయి పోయాడు.

"మీరు మనసు మార్చుకున్నారా మీదగ్గరే వుంటాను. ఉన్నంతలోనే. గడుపుకుంటాను. నాకే కోరికలూ లేవు. నాక్కావలసింది మీరు నా దగ్గరుండటం, పిల్లల్ని ఆదరించటం....వాళ్ళ బాధ్యతలు పంచుకోవటం అంతే!"

"అయితే, నన్నిప్పుడేం చేయమంటావ్?"

"ఈవేళ నుంచి మీరు పేకాటకి వెళ్ళద్దని చెపుతున్నాను."

"అంటే, ఇంతకాలం శవరం అయిపోయిందంతా అలాగే వదులుకోమంటావ్! అదృష్టం కలిసివస్తుంటే కాల దన్నుకోమంటావ్!...."

"మళ్ళీ నాకవన్నీ చెప్పకండి. అలాంటి భాగ్యాలు అదృష్టాలు నాకు వద్దు. పోయిందేదో పోయింది. ఇక వున్నదానితోనే గడుపుకుందాం..."

"....పోనీ, పది పదిహేను రోజులు చూడనీ! అంతగా రాకపోతే అప్పుడే మానేస్తాను..."

కృష్ణవేణి నిస్సత్తువగా పెట్టెమీద చతికిలబడింది. "వద్దు. ఒక్క రోజు కూడా మీరు వెళ్ళద్దు. మీరటు వెడితే నేనిక్కడ ఒక్క క్షణం

కూడా వుండను.''

అతనికి కోపం వచ్చింది. "....ఎక్కడికి వెడతావ్? హైద్రబాదు వెళ్ళనంటున్నావు! మరెక్కడికి వెడతావ్? పుట్టింటికి పోతావేమో! అంతేగా?....అక్కడెన్నాళ్ళుంటావో అదీ చూస్తాను.''

అతనివైపు కొన్ని క్షణాలపాటు సూటిగా చూసింది. తన కఠిన నిర్ణయం విని మనస్సు మార్చుకుంటాడని మొదట భ్రమపడింది. ఇన్ని మాటలు మాట్లాడినా మనిషి లొంగలేదు సరికదా—ఆడదానివి, ఎక్కడికి పోతావులే—అన్నట్టు తేలిగ్గా మాట్లాడుతున్నాడు. దాంతో ఆమె పట్టుదల మరింత పెరిగింది. "...పది రోజులు పోతే మళ్ళీ తనే వస్తుంది. ఎక్కడికి పోతుందని అనుకుంటున్నారా?....లేదు. మీరిలాగే వుంటే ఎప్పటికీ రాను. ఇన్నాళ్ళూ మీరేం చేస్తే అది భరిస్తూ నోరెత్తకుండా పడివుందా కృష్ణ....ఆ కృష్ణ వేరు. ఈ కృష్ణ వేరు. ఆ సంగతి బాగా గుర్తుంచుకోండి!''

"అంటే, నేను వచ్చి నీ కాళ్ళమీద పడి క్షమాపణ చెప్పుకుంటే అప్పుడు వస్తావన్నమాట!"

"లేదు. నాకు క్షమాపణలూ అక్కర్లేదు—మీరు రానూ అక్కర్లేదు. పేకాట మానేసానని ఒక ఉత్తరం వ్రాయండి చాలు. నా అంతట నేనే వస్తాను. నేను మిమ్మల్ని ఎదిరించి వెళ్ళటం లేదు. ఇక్కడుండి చేసేది లేక వెడుతున్నాను. పిల్లల భవిష్యత్తు దృష్టిలో పెట్టుకుని వెడుతున్నాను. మీకెన్నో విధాల చెప్పాను. కాని, మీరు నా గోడు వినిపించుకోలేదు. ఎప్పుడూ మీ దృష్టి మీదే! పేకాటలో ఎంతో సంపాదించి నా ఒళ్ళంతా బంగారం మయం చేసేస్తానంటారు. నాకలాంటి పేరాశలేవీ లేవండీ అని తల మొత్తుకుని చెపుతున్నాను. కట్టుకోవటానికి ఒక్క చీర, ఒక్కపూట తిండి, ఒక్క మంచి మాట....ఇవి చాలని....వీటితోనే తృప్తిపడి బ్రతగ్గలనని చెపుతున్నాను. కాని, నా మాటలు మీరు పట్టించుకోవటం లేదు... పోనీ, నేను 'కళ్ళముందు నుంచి దూరంగా పోతే మీకు క్రొత్త ఆలోచనలు వస్తాయేమో!''

విశ్వనాథం ఆలోచిస్తున్నాడు. పేకాట మానేద్దామా—వద్దా అని కాదు. భార్యాభర్తలు విడిపోయారని తెలిస్తే అంతా ఏమనుకుంటారని కాదు! కృష్ణ లేకుండా తనుండగలడా లేడా అని కాదు!....కృష్ణకి ఇంత ధైర్యం ఎలా వచ్చిందా అని ఆశ్చర్యపోతూ ఆలోచిస్తున్నాడు!

చాలాసేపు ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు. తల్లిదండ్రుల మాటలు ఎంతసేపటికీ పూర్తికావటం లేదేమిటా అని లోపలికి వచ్చారు పిల్లలు. వాళ్ళ ముఖాలు మార్చిమార్చి చూసారు.

గాఢంగా నిట్టూర్చి "ఒక రిక్షా తీసుకురారా!'' అని కొడుక్కి పురమాయించింది కృష్ణవేణి.

"ఎక్కడికని చెప్పనమ్మా!'' అని అడిగాడు నారాయణ.

విశ్వనాథం చూపులతో కృష్ణవేణి చూపులు ఢీకొన్నాయి. 'స్టేషనుకని చెప్పు!''

నారాయణ రిక్షా తీసుకువచ్చేవరకు ఎవ్వరూ మాట్లాడలేదు. ఏవేవో సర్దుతూ ఉండిపోయింది కృష్ణవేణి.

బయలుదేరేముందు "నాన్నగారితో వెళ్ళొస్తామని చెప్పండి!'' అంది ఆమె.

విశ్వనాథం ముఖం జేవురించింది. విసురుగా తల త్రిప్పుకున్నాడు. పిల్లలు బిక్కమొహాలు వేసుకున్నారు.

"ఈపూటకి వంట చేసిపెట్టాను. ఇక నుంచి మీరెలా వుంటారో—ఎక్కడ తింటూ వుంటారో... మీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోండి!'' ఆమె ఉద్వేగాన్నణచుకుంటూ చెప్పింది.

భార్యవైపు పిచ్చివాడిలా చూసాడు విశ్వనాథం. "నువ్వు....నువ్వు వెళ్ళిపోవటానికే నిశ్చయించుకున్నావా?'' అన్నాడు తడబడుతూ.

ఒక్క క్షణం ఆగి "అవును. ఇదితప్ప మరో మార్గం లేదు నాకు.'' అంది.

"అయితే, వెళ్ళు.'' అన్నాడు కోపంగా గొంతు చించుకుంటూ.

ఆమె మెట్లు దిగి మళ్ళీ వెనక్కి చూసింది. అతను లేచి రాలేదు. రిక్షాలోంచి మళ్ళీ చూసింది. అతను గుమ్మంలో కనిపించలేదు.

కన్నీళ్ళతో ఆమె చూపులు మసకలుక్రమ్మాయి. పక్క యిళ్ళవాళ్ళు వీధి అరుగుల మీద నిలబడి తనవైపే చూస్తున్నారు. 'ఎక్కడికి వెడుతున్నావమ్మా కృష్ణవేణీ!' అని ఒకావిడ పిలుస్తూనే వుంది. రిక్షాని త్వరగా పోనివ్వమని కేక పెట్టింది కృష్ణవేణి!

## 72

ఈ పదిహేనేళ్ళ వైవాహిక జీవితంలో ఇదెందుకు చేసారు — అని ఆమె ప్రశ్నించి ఎరుగదు. ఇలా ఎందుకు చేయలేదు అని మాటవరసకయినా అడిగి ఎరుగదు. అతని వ్యసనం తెచ్చిన ఆర్థికబాధనే కాకుండ, అతని మూర్ఖపు వాదనల్ని కూడా ఎంతో ఓర్పుతో భరించింది. ఒకప్పటి అతని మంచితనాన్ని గుర్తుంచుకొని ఇప్పటి బాధంతా తాత్కాలికమేనని-ఈ చీకటి తొలగి ఏదో నాటికి వెలుగు తప్పకుండా వస్తుందని ఎంతో సహనంతో ఎదురు చూసింది.

పిల్లలు పెరిగి పెద్దవాళ్ళవుతున్నారు. తనలో శక్తి సన్నగిల్లిపోతోంది. కాని, అతను మారి మంచిదారికి మళ్ళే సూచనలెక్కడా కనిపించటం లేదు. అట్టే మారినట్టు మారి ఇట్టే అటు తిరిగిపోయాడు.

భార్య నగలన్నీ తన వ్యసనం కరిగించేసిందని ఇప్పుడు అతనికి తెలుసు. భార్య ఆరోగ్యాన్ని తన వ్యసనం హరించేస్తోందని ఇప్పుడతనికి తెలుసు.... అయినా, ఆ పిచ్చి వదిలించుకోలేక పోతున్నాడంటే ఇంక దగ్గరుండి మాటలతో సంస్కరించటం సాధ్యమా? అసలీ వాతావరణంలో నిత్యం తల్లిదండ్రులు వాదులాడుకుంటుంటే-ఎదిగే పిల్లల మనస్సులపై ఎలాంటి ముద్రలు వేసుకుంటాయి! ఇరుగూ పొరుగూ తండ్రి గురించి నీచంగా మాట్లాడుతుంటే పిల్లలకెంత బాధగా వుంటుంది!

కొన్నాళ్ళు ఎక్కడికయినా దూరంగా వెళ్ళిపోతే అతను మారతాడన్న ఆశకన్న....పిల్లల భవిష్యత్తు కోసం ఆ స్థితిలో అతనికి దూరంగా వెళ్ళటం తప్పని సరి అనిపించిందామెకు.

కాని, భార్య ఎందుకిలాచేసింది అన్న ఆలోచన అతనికి రాలేదు. ఇంత ధైర్యం ఆమెకెలా వచ్చింది అన్న ఆశ్చర్యంతోనే గడిపాడతను. సాధువుగా, వుండే 'కృష్ణ' ఒక్కసారిగా తన్నెదిరించి ఇలాంటి నిర్ణయం ఎలా తీసుకోగలిగింది?

కేవలం తనని బెదిరించి లొంగదీసుకోవాలనే అలా వెళ్ళి వుంటుందని....మరి కాసేపట్లో తనే తిరిగి వస్తుందని ముందు అనుకున్నాడతను. గంటలు గడిచిపోయాయే కాని ఆమె తిరిగిరాలేదు!

ఉగ్గపట్టుకోలేక స్టేషనుకు వెళ్ళాడు విశ్వనాథం. ఎక్కడా ఆమె కనిపించలేదు. ఎందుకయినా మంచిదని బస్టాండుకి వెళ్ళాడు. అక్కడా ఆమె కనిపించలేదు. అయితే నిజంగానే 'కృష్ణ' వెళ్ళిపోయిందన్న మాట!

అతని గుండెలు దడదడలాడాయి....ఎక్కడికి వెళ్ళివుంటుంది? ఆమె దగ్గర డబ్బుందో లేదో





**అనురాగానికి, ఆనందానికి సంకేతాలు పసిపాపలు! కాని మన దేశంలో చాలామంది శిశువులు ఇంకా సరియైన రక్షణ, భద్రత లేకుండా గాలికి ధూళికి పెరిగే దయనీయస్థితిలోనే వుంటున్నారు!**

**భారతీయ బాలల స్థితిగతులను ఉత్సాహాన్ని, విశ్వాసాలను ప్రతిబింబించే ఛాయాచిత్ర ప్రదర్శన ఇటీవల మద్రాసులో జరిగింది. కేంద్ర ప్రభుత్వ పౌర సంబంధ శాఖ – ఈ ప్రదర్శనను ఏర్పాటు చేసింది. అంతర్జాతీయ బాలల సంవత్సర సందర్భంగా జరిగిన ఈ ప్రదర్శనలో చోటు చేసుకున్న 'సుదూరపయనం' 'నా కుటుంబం' అన్న రెండు ఉత్తమ ఛాయాచిత్రాలను ఇక్కడ ప్రచురిస్తున్నాము.**

కూడ తను అడగలేదు. తనెంతో తప్పుచేసానని అతననుకున్నాడు....అదంతా కొన్ని క్షణాలపాటే! మళ్ళీ 'కృష్ణ' మీద కోపం వచ్చింది.

'మొగుడూ సంసారం అక్కర్లేదని పోయిన దానితో నాకేం పని! తనకే అంత పౌరుషం వుంటే నాకెంత వుండాలి?' అని పురుషాహంకారంతో ఆమెనే నిందించాడు.

'ఇన్నాళ్ళు డబ్బు పోయింది...పోయిందని బాధపడింది తనే! ఇప్పుడు 'స్టార్సు' కలిసి వస్తుంటే, వద్దువద్దని పోతానని పోయింది. అనుభవించే అదృష్టం ముఖానరాసి పెట్టిలేదు!' అని విసుక్కున్నాడతను.

ఏమయినా సరే 'పేకాటలో సంపాదించి' ఆమెకు చూపించాలి. వందలు తెచ్చి వాళ్ళోపోస్తే ఇంకేమంటుంది? పుచ్చుకోక వద్దు పొమ్మంటుందా? ఇలా సంపాదిస్తున్న వాళ్ళు తెచ్చియిస్తుంటే వాళ్ళ పెళ్ళాలు సంతోషించటం లేదూ!

అప్పటి కప్పుడే ఆ ప్రణాళిక అమలులో పెట్టాలన్న పట్టుదలతో యింటికి కూడా వెళ్ళకుండ - ఆ పూట ఆఫీసుకయినా పోకుండ తిన్నగా క్లబ్బుకి వెళ్ళిపోయాడు విశ్వనాథం!

అంతకు ముందు వారం పదిరోజులుగా కల్సి వచ్చిన 'స్టార్సు' మరి ఎక్కడికో షికారు వెళ్ళిపోయినట్లున్నాయి. కాసేపట్లోనే అతను పట్టుకు వెళ్ళిన డబ్బులకి రెక్కలొచ్చి ఎగిరిపోయాయి!

"ఛీ! తన యేడుపుకి తగ్గట్టే అంతా శవరం అయింది! అని భార్యని తిట్టుకుంటూ యింటికి వచ్చాడతను. పోయినప్పుడల్లా 'ఆమె కర్మ', వచ్చినప్పుడల్లా 'తన ప్రతాపం' అని ఎంతో కాలంగా అతననుకుంటూనే వున్నాడు! కాని, ఇవేళ తన కోపతాపాలు ప్రదర్శించుకోటానికి భార్య యింట్లోలేదు, అదొక్కటే తేడా!

ఎప్పుడూ సందడిగా ఉండే యింట్లో యిప్పుడు తనొక్కడు! 'ఒంటరితనం'లోని బాధ....భయం ఒక్కసారిగా అతన్ని చుట్టుముట్టాయి.

కృష్ణవేణి హైదరాబాదులో వున్నప్పుడు.... ఒక్కడూ వున్నా ఈ ఒంటరితనం బాధ తెలియలేదు. ఆమె నేడో రేపో వస్తుందని తెలుసు కనుక అలా ఎదురుచూడటంలో ఒక తృప్తి, సుఖం, ఆనందం వుండేవి. కాని తను పేకాట మానేస్తేకాని తిరిగి రానని ఇవేళ కరాఖండిగా చెప్పి ఆమె వెళ్ళిపోయింది. వెళ్ళిపోయి అప్పుడే ఏడెనిమిదిగంటలు గడిచిపోయాయి!

పిచ్చిపట్టినట్టు యిల్లంతా కలయ తిరిగాడు విశ్వనాథం. ఒక్కసారిగా గత స్మృతులన్నీ గుర్తుకు వచ్చాయి. కూని రాగం తీస్తూ దొడ్లో మొక్కలకి వయారంగా నీళ్ళుపోసే కృష్ణ, వంటింట్లో చకచక తిరుగుతూ వంటచేసే కృష్ణ, కమ్మని కబుర్లు కలబోసి కొసరికొసరి వడ్డిస్తూ అన్నం తినిపించే కృష్ణ, మధురగానంతో మైమరపించే కృష్ణ, వలపులు పండిస్తూ ప్రేమ పారవశ్యంతో తన్ను మురిపించే కృష్ణ. ఇల్లంతా తానే అయి అందర్నీ ఆదరించి అందరి మన్ననలు పొందిన కృష్ణ అతని మనస్సులో మెదిలింది.

అల్మారా తెరిచి చూసి ఉలిక్కిపడ్డాడు విశ్వనాథం. వారంనాడు తను కొనితెచ్చిన మందులన్నీ అక్కడే వున్నాయి! డాక్టరు మాటలు గుర్తుకు వచ్చి భయంతో అతని గుండె జల్లుమంది.

మందులయినా తీసుకు వెళ్ళకుండా ఎందుకు వెళ్ళింది? తన్ను సాధించిపోయాలనే కదా!.... అంతలోనే ఆమె అనారోగ్యం గురించి భయం పోయి ఆమె మీద కోపం ముంచుకువచ్చింది.

ఆ రాత్రి అన్నం తినకుండానే పడుకున్నాడు. ఆలోచనలతో చాలాసేపు నిద్రపట్టలేదు. పేకాట మానివేస్తేనే భార్య తిరిగి వస్తానంది. ఆమె కావాలో పేకాట కావాలో తననే నిర్ణయించుకోమంది.

భార్యాబిడ్డలు దగ్గర లేకుండా ఇక ముందు తనెలా వుండగలడు? వాళ్ళెక్కడికి వెళ్ళారని, ఎందుకు వెళ్ళారని ఎవరయినా అడిగితే ఏం చెప్పాలి? హైదరాబాదుకి ఈ కబురు తెలిస్తే వాళ్ళంతావచ్చి తనని చివాట్లు పెట్టకుండా వుంటారా? అసలీ పేకాట మానేస్తే నిజంగానే సంసారం చక్కబడుతుందేమో! ఇలాంటి ఆలోచనలు అతనికి రావటం లేదు!

ఇంతకాలం పోయిన డబ్బునలా వదిలి పెట్టేయటమేనా? తిరిగి వచ్చే 'రోజులు' వస్తున్నప్పుడు అవకాశం అంది పుచ్చుకోవద్దా? అదేం అర్థం చేసుకోకుండా 'మొండిగా వాదించి' వెళ్ళిపోయిందేం తను? ఏమిటంత ధీమా? ఏ ఆధారం చూసుకుని వెళ్ళింది? హైద్రాబాదు వెళ్ళనంది.... మరెక్కడికి వెళ్ళింది? ఇలా సాగాయి అతని ఆలోచనలు.

ఒకటి....రెండు....మూడు రోజులు గడిచి పోయాయి. అతని 'స్టార్సు' విషయంలో కాని, ఆలోచనల తీరులో కాని మార్పంటూ కనిపించ లేదు. అయితే 'కృష్ణ' ఎక్కడికి వెళ్ళిపోయిందో అన్న భయం మనస్సులో మారు మూల పీకుతూనే వుంది.

నాల్గవరోజు రాత్రి అతనింటికి వచ్చేసరికి కృష్ణవేణి నుంచి ఉత్తరం వచ్చి వుంది. ఆత్రుతగా విప్పి చదివాడు. మరోసారి చదివాడు. ఆమె మాటల్లో మార్పు లేదు. ఆమె నిర్ణయంలో మార్పు లేదు.

"నా జీవితం ముందు ముందు ఎలా వుంటుందో అగమ్యగోచరంగా వుంది. పిల్లల్ని మంచి వాతావరణంలో పెంచాలన్న బాధ్యతతో బయలుదేరాను. ఎక్కడ వుండాలో కూడ నిర్ణయించుకోకుండ యిల్లు వదిలాను. ఇక ముందు ఎక్కడికి వెళ్ళిపోతానో ఒక్కసారి మా అమ్మనీ నాన్నగార్నీ చూసి వెడదామని యిక్కడికి వచ్చాను. నేనిక్కడ పదిరోజులు మాత్రం వుంటాను. ఆలోగా మీరు మనస్సు మార్చుకొని ఉత్తరం వ్రాసారా సరే.... సంతోషంగా తిరిగి వస్తాను. లేకపోతే....ఏమో ఎక్కడికి వెడతానో చెప్పలేను. చాలాకాలంగా చూడాలని వుందని మా అమ్మ ఉత్తరాలు వ్రాస్తోంది కదాని వచ్చానని చెప్పాను. అంతేకాని, మన సంగతులేవీ ఎవ్వరికీ చెప్పలేదు. మళ్ళీ మీకు గుర్తు చేస్తున్నాను. మీగురించి అగౌరవపరుస్తూ నేనెప్పుడూ ఎవ్వరితోనూ ఏమీ చెప్పలేదు. ఇకముందు ఎప్పుడూ చెప్పను కూడా! మీకు దూరమైపోయాక నేనెవ్వరికి దగ్గర కాలేను. ఎవ్వరికి తెలియని చోటికి నిశ్శబ్దంగా వెళ్లిపోతాను! మన జీవితాలు చక్కబడటం మీ చేతుల్లోనే వుంది! బాగా ఆలోచించుకొని ఉత్తరం వ్రాయండి. ఒకప్పుడు సర్వస్వమూ నాదే అనుకున్న మీ మనస్సులో నాకు - నా మాటకు కాస్తంతయినా చోటుండకపోతుందా అన్న ఆశ యింకా కొంత మిగిలి వుంది! అందుకే ఈ నిరీక్షణ...."

తానన్నట్టుగానే పుట్టింటికి వెళ్ళింది. ఇంకెక్కడికి పోతుంది? ఈ ఆడవాళ్ళందర్కీ పుట్టిళ్ళకిపోయి సాధించటం మామూలేగా!....ఇలా తేలిగ్గా తీసి పారవేసాడే కాని ఉత్తరంలో అణువణువునా కనిపించే ఆమె బాధ, ప్రార్థన, ఆశ....అతను పట్టించుకోలేదు.

భార్యకి జవాబు వ్రాయలేదు కాని - ఆమె రాక కోసం ఎదురు చూస్తున్నట్టు మామగారికి మాత్రం ఉత్తరం వ్రాసాడు. అది చూసి నేడో రేపో ఆమే వస్తుందనుకుంటూ తన ధోరణిలో తనుండిపోయాడు కాని ఆమె రాలేదు.

పేకాటలో డబ్బు పోతూనేవుంది. మధ్య మధ్య ఏదో ఒకనాడు కలిసి వస్తే ఆ రోజు గుర్తుంటోందేమో కాని పోయిన డబ్బు, పోయిన రోజులు అతనికి జ్ఞాపకం రావటం లేదు. దానికితోడు అడపాతడపా రాత్రిళ్ళు 'తాగి' వచ్చి పడుకుంటున్నాడు. జారుడు మెట్ల మీద నుంచి దొర్లిపోయే వాడికి నీతి నియమాలతో పనిలేదు!

'ఇంకెప్పుడూ తాగను. నీ మీద ఒట్టు....' అని ఒకనాడు భార్యతో అన్న మాటలు కూడా అతనికిప్పుడు గుర్తులేవు.

ఆ రాత్రి తలుపు తీసుకొని లోపలికి వచ్చాడే కాని....గుమ్మంలో భార్య వ్రాసిన ఉత్తరం పడి వుందని గుర్తించలేదు. మర్నాడు ప్రొద్దున మత్తు వదిలాక అతని దృష్టిలోకది వచ్చింది.

ఈ మాటతను ఆత్రుతగా చదవలేదు. మళ్ళీ మరో 'వార్నింగు' యిచ్చి వుంటుంది అంతే కదా - అనుకుంటూ చదివాడు. ఆమె తమ్ముడు శ్రీకాంత్ వచ్చి తీసుకు వెళ్ళాడుట. అతని పెళ్ళయ్యాక - కాపరం పెట్టుకున్నాక, ఆమె ఒక్కసారి కూడా రాలేదని బ్రతిమాలి తీసుకువెళ్ళాడుట!

"....నిన్నక్కడ, ఇవేళ యిక్కడ. రేపు ఎక్కడ వుంటానో తెలియనప్పుడు అయిన వాళ్ళందరినీ ఒక్కసారి చూసి వెళ్ళటం మంచిదని సరేనని వచ్చాను. ఇదంతా చివరిసారి అప్పగింతలు చెప్పి వెళ్ళటమవుతుందేమో నాకు తెలియదు. మిమ్మల్ని విడిచివచ్చి దాదాపు నెలరోజులవుతున్నా మీ నుంచి నాకు జవాబు రాలేదు. మీ మౌనం నేనింక ఎటువంటి ఆశలూ పెట్టుకోనక్కర్లేదని చెపుతోంది. అయినా, ఎక్కడో అంతరాంతరాలలో చిన్నదీపం మినుకు మినుకు మంటూనే వుంది! 'అమ్మా - ఈ వూళ్ళు తిరగటం యింకా ఎన్నాళ్లు - నా చదువు పాడయిపోతోంది'- అంటున్నాడు నారి! వాడి బాధ్యత వాడే తెలుసుకుంటున్నాడు. మన పట్టింపుల మధ్య వాడి చదువెటూ కాకుండా పోవటం నాకు బాధగా వుంది. ఇక్కడ ఒక్కవారం కన్న ఎక్కువ వుండను. ఈలోగా మీనుంచి ఉత్తరం వస్తే నేనింటికి తిరిగి వస్తాను. లేకపోతే - ఏమో ఇక్కడ నుంచి ఎక్కడికి వెడతానో తెలియదు."

కొన్నాళ్ళుగా అతనికి సరియైన తిండి తిప్పలు లేవు. దానికితోడు తాగుడొకటి. నిద్రలేమి. నిస్సత్తువ .... మనిషిని నిస్తేజం చేస్తున్నాయి. పోయిన డబ్బు తిరిగి రావటం లేదు. వెళ్ళిపోయిన భార్య తిరిగి రానంటోంది. ఉక్రోషంతో, అసహనంతో అతని మనసు గజిబిజిగా తయారయింది.

కొడుకు వాడి బాధ్యత వాడే తెలుసుకుంటున్నాడుట! అంటే తన బాధ్యత తను తెలుసుకు ప్రవర్తించటం లేదనేకదా ఆమె చెప్పటం! అక్కడ వుండేది వారమేనట! ఆ తర్వాత ఎక్కడికి వెళుతుందో ఆమెకే తెలియదట! ఏమిటీ గడువులు? ఏమిటీ బెదిరింపులు?....

"వెళ్ళవే వెళ్ళు! ఎక్కడికి వెడతావో ఎలా వుంటావో నేనూ చూస్తాను!" అని తిట్టుకుంటూ ఆ ఉత్తరం గది మూలకి విసిరేసి నీళ్ల పోసుకోకుండా బట్టలయినా మార్చుకోకుండా వీధిని పడ్డాడు విశ్వనాథం!

ఆ తర్వాత ఒకటి కాదు. రెండు వారాలు గడిచిపోయాయి. అతని మనసులో కుటుంబ బాధ్యతల గురించి ఆలోచనలు రాలేదు సరికదా .... భార్య ఏమయిందో అన్న బాధ కూడా కలగలేదు.

మొక్కుబడి కన్నట్టు ఓనాడు బావమరిది శ్రీకాంత్‌కి ఉత్తరం రాసాడు. పిల్లల్ని చూడాలని వుందని — వాళ్ళ కోసం ఎదురు చూస్తున్నానని రాశాడు. అది చూసి భార్య వస్తుందనుకున్నాడు. కాని, ఆమె రాలేదు.

ఓ రాత్రి ఇంటికి తిరిగి వచ్చేసరికి ఒక కవరు కనిపించింది. భార్య ఏమని రాసి వుంటుందో అనే

దాని కన్నా ఎక్కడ నుంచి రాని వుంటుందో అన్న కుతూహలం కొద్దీ కవరు చించి చూశాడు. అది కృష్ణ రాసిన ఉత్తరం కాదు. ఆమెకు నిర్మల రాసింది!

నిర్మల ఉత్తరం అతనికి సంతృప్తి, సంభ్రమం ఒక్కసారే కలిగించాయి. కృష్ణ మాటవరస కన లేదు. నిజంగానే తన గౌరవం కాపాడింది. ఈ నెలన్నరగా తమ మధ్య జరుగుతున్న విషయాలేవీ హైద్రాబాదు వాళ్ళకి తెలియలేదు. ఏదో పుట్టింటి వాళ్ళని చూడ్డానికి వెళ్ళిందనే వాళ్ళు సంతృప్తి పడుతున్నారు.

చెల్లెలి ఉత్తరం మళ్ళీ రెండోసారి చదివినప్పుడు కాని .... కృష్ణవేణి శ్రీకాంత్ దగ్గరి నుంచి వెళ్ళి పోయిందని, యింటికి తిరిగి వచ్చిందనుకొనే యిక్కడికి నిర్మల రాసిందని అతనికి తట్టలేదు.

అయితే, కృష్ణ యిప్పుడు ఎక్కడ వున్నట్టు? అతనికి కొన్ని క్షణాలపాటు గుండెలు దడదడ లాడాయి!....

మళ్ళీ పుట్టింటికి వెళ్ళిందేమో!.... అని ఆ పూట సరిపెట్టుకున్నాడు కాని మర్నాడే ఆమె తండ్రి రాసిన ఉత్తరం అందింది. ఆమె అక్కడికి వెళ్ళలేదు.

ఓ మూల ఆమె ఎక్కడికి వెళ్ళిందోనని అంతు పట్టక అతనికి మతిపోయినట్టుగా వుంటే .... మరో వైపు ఆమె ఇక్కడే వుందనుకుని అంతా ఉత్తరాలు రాస్తున్నారు. ఇంతకాలం ఆమె వాళ్ళకి ఉత్తరాలు రాస్తూ వచ్చింది కనుక తనకు ఎటువంటి సమస్య లేకపోయింది. కాని, ఇవేళ ఉత్తరాలు వస్తున్నాయి. రేపు వాళ్ళే వస్తారు. అప్పుడు తానేమని జవాబు చెప్పాలి?

అతనీ ప్రశ్నలతో సతమతమవుతూ నాలుగయిదురోజులపాటు పేకాటకి వెళ్ళలేదు.

ఇలాగే మరికొన్నాళ్ళు కృష్ణవేణి నుంచి సమాచారం అందకపోయి వుంటే అతనిలో కలిగిన 'భయం' మరింత పెరిగి పేకాట మీద విరక్తి కలిగించేదేమో. కాని, దురదృష్టవశాత్తూ అలా జరగలేదు. ఇన్నాళ్ళయినా తనకు ఉత్తరం రాయమని భర్త మీద యింకా విరక్తి పెట్టుకోకుండా ఆమె మరో ఉత్తరం రాసింది.

పుట్టింటికి వెళ్ళినప్పుడు తన చిన్ననాటి స్నేహితురాలు కాత్యాయిని కలిసి ఒకసారి తమ వూరికి రమ్మని మరీ మరీ చెప్పిందిట. ఆమె దగ్గరికి వెళ్ళింది.

"నేను ఇక్కడికి వచ్చినట్టు ఎవ్వరికీ తెలియదు. ఎవ్వరికీ రాయవద్దని కాత్యాయినితో చెప్పాను.... నేనెందుకిలా అజ్ఞాతంగా వుందామనుకుంటున్నానో ఆమెకు చెప్పలేదు. చెప్పను కూడా! అయినవాళ్ళ ఇళ్ళకి వెళ్ళి మీ గౌరవానికి నేను భంగం తీసుకు రావటం లేదు. ఇక్కడే ఒక చిన్న గదిలో పిల్లల్ని పెట్టుకుని వుంటున్నాను. నాలో శక్తి మిగిలి వున్నంతవరకు ఎంత శ్రమపడి అయినా వాళ్ళని పోషిస్తాను. మేము లేకుండా మీరు వుండగలరని ఈ రెండు నెలల కాలం చెప్పింది. ఇంక మేము ఒంటరిగా వుండి బ్రతకడం నేర్చుకోవాలి! ఏం చేస్తాము నేర్చుకుంటాము.

చివర యేదో వ్రాసి కొట్టేసింది కృష్ణవేణి! ఒక్కొక్కప్పుడు వ్రాసినవాటికన్న వ్రాసి కొట్టేసిన మాటలెంతో ప్రభావం గలిగించేవిగా వుంటాయి. అవి చదివితే అతని మనస్సు చలించేదేమో! కాని చదవాలని అతను ప్రయత్నించలేదు!

'పిల్లల్ని పోషించగలదుట! ఒంటరిగా ఉండి బ్రతకగలదుట!' అని అతిశయంగా చెపుతోందని అనుకున్నాడేకాని.... ఎన్నాళ్ళకీ జాబు రానందుకు నిస్పృహతో ఆమె అలా వ్రాసిందని అతననుకోలేదు. కనీసం, రమ్మని వ్రాసిందికాదు-అనుకున్నాడే కాని తను మంచి దారినిపడి సంసారం చక్కబెట్టుకోటానికి ఎన్నో అవకాశాలు ఆమె యిస్తోందని గ్రహించలేదు. ఇప్పుడు ఎక్కడ వుందో తెల్సిందని సమాధానపడిపోయాడే కాని, ఆమె ఎలాంటి బరువు బాధ్యత నెదుర్కొంటోందో ఊహించటానికి ప్రయత్నం చేయలేదు. ఆమెదే తప్పని ఒప్పించాలని చూస్తోందనుకున్నాడే కాని - తనదే నిజంగా తప్పని అర్థం చేసుకోటానికి అతను ప్రయత్నించలేదు.

ఇంక ఆమె ఆత్మవిశ్వాసాన్ని ఎలా గౌరవించగలడు? ఆమె పట్టుదలని ఎలా భరించగలడు?

ఎంతకాలం యిలా నెగ్గుకు వస్తుంది - ఏదోనాడు తనే దిగివస్తుంది-అని అన్యాయంగా ఆమెనే తప్పు పట్టాడు. మంకుపట్టుతో ఆ విషయం అక్కడితోనే విడిచిపెట్టేసాడు!

[సశేషం]



స్త్రీల శీల రక్షణ కోసం రేపెల్ ఇండస్ట్రీస్ వారు ఒక కొత్త రకం ఆయుధాన్ని తయారు చేశారు. ఇంతకీ వీరు తయారు చేసిన సాధనం ఏమిటీ అంటే — ఒక చిన్న ప్లాస్టిక్ ఇంజక్షన్ సీసా వంటి పరికరం మాత్రమే! కాని యిది అత్యంత శక్తివంతమైనది. ఎంతటి దుష్టులనైనా దూరంగా వుంచుతుంది.

ఏ విధంగానంటారా.... ఆ ఏంప్యూల్ సీసా నొక్కితే చాలు. అందులోంచి ఎన్-బుటైల్ మెర్కాప్టన్ అనే ఓ విధమైన నూనె బయటికి విరజిమ్ముతుంది. అది భరించరాని దుర్గంధాన్ని వెదజల్లుతుంది. ఆ వాసన భరించలేక మానభంగం చేద్దామని వచ్చిన దుర్మార్గుడు కాస్తా పారిపోతాడన్న మాట.

ఆ కంపెనీ వారు ఎన్నో ప్రయోగాలు చేసి ఈ పరికరం బాగా పన్జేస్తుందన్న నిర్ధారణకు వచ్చారట. మరి అతివలు ఆ వాసనని ఎలా భరిస్తారన్న సందేహం మీకు కలుగుతోంది కదూ.... ఆ కాస్సేపూ భరించాల్సిందేనట. కాని ఆ తరువాత 'రేపెల్' వారు తయారు చేసిన మరో 'పరిమళం' వుపయోగిస్తే ఆ దుర్గంధం నుంచి తప్పించుకో వచ్చును. దాన్ని ఆ దుర్మార్గుడి మొహం మీదో, బట్టమీదో చల్లుతారు కాబట్టి అతని మీద ఆ వాసన చాలాసేపు వుంటుంది. అతన్ని గుర్తు పట్టడానికి, బంధించడానికీ యిది వుపయోగపడుంది.

ఇంతకీ ఈ సీసా ఒక అంగుళం వుంటుంది. అంతే. అరిజానాలోని-స్కాట్స్ డేల్ నగరంలో వుంది సంస్థ. దీని వెల 70 రూపాయలవుతుందిట—మొత్తానికి మంచి మందే!

కాలసాగరంలో ఎడతెరిపిలేకుండా సంస్కృతీ తరంగాలు లేస్తూనే వుంటాయి. ఎన్నో సంస్కృతులు తక్కిన వాటి ధాటికి ఆగలేక కాలగర్భంలో కలిసి పోయాయి. కాని ఎన్ని తరంగాలు తాకినా చెక్కు చెదరకుండా శాశ్వతంగా నిలచింది మన సనాతన సంస్కృతి. అలాంటి సనాతనమైన భారతీయ సంస్కృతీ భావన బావుటాలే మన దేవాలయాలు!

అయితే ప్రాచీనం కావడమే ఆలయాల పవిత్రతకు కారణం కాదు. అర్వాచీనం అయినంత మాత్రాన పవిత్రత రాకపోదు. ఎంచేతంటే సత్యానికి



# అన్నవరం



## మన దేవాలయాలు:

సంకేతంగా వుంటూ సత్యానికి దారిచూపే వెలుగు కంబాలు మన గుళ్ళు! దీనికొక ఉదాహరణ— చెప్పుకోదగ్గ స్థలపురాణమో, మహాత్మ్యమో లేకుండా ఇటీవలే పల్లవించి తిరుపతికి తర్వాత చెప్పుకోదగ్గ యాత్రాకేంద్రంగా వెలుగొందుతున్న అన్నవరం సత్యనారాయణ స్వామి ఆలయం!

'అన్నపూర్ణ'గా ఖ్యాతి గాంచిన ఆంధ్రావని తూర్పు గోదావరి జిల్లాలో వుంది అన్నవరం!

'నీలమేఘశ్యామ'ని శరీరఛాయకు సంకేతంగా



వున్న నీలి ఆకాశంతో పోటీపడి భూమాత తనువంతా ముదురుపచ్చ ఛాయతో పులకిస్తోందా అన్నట్టు కళ్ళు చూడగలంత దూరాన పచ్చటి పొలాలు.

పావనగంగ ప్రభవించిన భగవంతుని పవిత్ర పాదాల చేరువకు చేరినందుకు పరవశించి పరుగులు తీస్తోందా అన్నట్టు సమీపంలో గలగలా ప్రవహించే 'పంపా' నది.

వీటి మధ్య కదిలే స్వర్ణరథంలా మూడువందల అడుగుల ఎత్తున అందాల 'రత్నగిరి' మీద శ్రీ సత్యనారాయణ స్వామి ఆలయం రథాకృతిలో నిర్మించబడి వుంది.

సూర్యచంద్రులు పగలు, రాత్రికి సంకేతాలు. రవిచంద్రులు చక్రాలుగా ప్రపంచ రథం సాగుతోంది. విశ్వరథానికి ఆధారంగా నిలచి సూర్యచంద్రులకు ప్రకాశం, జీవరాసులకు చైతన్యం ప్రసాదించేది— దివ్యశక్తి! దానిని గుర్తించి బాధ్యతలను సక్రమంగా నెరవేర్చడంలోనే మనిషి మనుగడ ఇమిడి వుంది— అని మన పెద్దల విశ్వాసం. ఆ సత్యాన్ని గుర్తు చేయడానికే ఇక్కడి గుడిని రథాకృతిలో నిర్మించారు.

గుడిలో అడుగు పెట్టగానే పాతబడిన ధ్వజస్తంభం మన దృష్టిని ఆకర్షిస్తుంది. దాని స్థానంలో బంగారుపూత పూసిన ధ్వజస్తంభ నిర్మాణం జరుగుతోంది. ధ్వజస్తంభం దాటి లోపలికి వెడితే ఆధునిక పద్ధతిలో అద్భుతంగా నిర్మింపబడిన కల్యాణ మంటపం కనబడుతుంది. ఈ మంటపంలోనే 'కల్యాణ మహోత్సవం' 'నిత్యకల్యాణ' కార్యక్రమాలు జరుగుతూ వుంటాయి. దీనికి ఎదురుగా గాలిగోపుర నిర్మాణానికి పునాదులు వేస్తున్నారు.

ఆలయంలోని 'మహాయంత్రం' మహిమాన్విత మైందట! 'త్రిపాద విభూతి నారాయణ ఉపనిషత్' ప్రకారం ఈ యంత్ర ప్రతిష్ఠాపన జరిగినట్టు చెబుతారు. యంత్రానికి నాలుగువైపులా గణపతి, సూర్య, బాలాత్రిపురసుందరి, మహేశ్వర విగ్రహాలు వున్నాయి. వీటికి మధ్య, పై భాగంలోనే సత్యదేవ విగ్రహం వుంది. ఈ ఐదింటినీ కలిపి "విష్ణు పంచాయతనం" అంటారు.

హిందూమతంలో వున్నన్ని దేవుళ్ళు మరే మతంలోనూ కనిపించరు. రాయీరప్పా, చెట్టూ పుట్ట, పామూ డేగ—అన్నీ దేవుళ్ళే! కనబడిన దానికల్లా కర్పూరం వెలిగించి కళ్ళకద్దుకుని చెంప లేసుకోడం చూస్తే—కరుడుకట్టిన చాదస్తంగా కనబడుతుంది. అయితే కాసే ఎండలో, కురిసే వానలో, వీచే గాలిలో, పూచే పూవులో రూపులేని దేవుని సంతకం సందర్శించినవారు మన పూర్వులు; వాటిని సూర్యభగవానుడు, వరుణదేవుడు, వాయుదేవుడు అని పేరు పేరునా స్తుతించినవారు మన పెద్దలు—అంటారు విజ్ఞులు. ఇంతవరకు బాగానే వుంది. కాని కొంతకాలం తర్వాత ఒక్కొక్క దేవుని కొలిచేవారు ఒక్కొక్క తెగగా విడి పోయారు. "మా దేవుడు గొప్ప — కాదు మా దేవుడే పెద్ద"—అన్న జుగుప్సాకరమైన కుమ్ములాటకు దిగి మతాన్ని అభాసుపాలు చేసి సభ్యతకు సంకెళ్ళు తగిలించి మనిషి మనుగడకు అడ్డుగోడలు లేపారు. విపత్కరమైన ఈ కాల ఘట్టంలో విజ్ఞులైన కొందరు పెద్దలు—గణపతి, సూర్యుడు, శివుడు, దుర్గ, విష్ణువులను ముఖ్యమైన దేవతా రూపాలుగా స్వీకరించి హైందవులందరికీ

# ఈ 8 కారణాలకోసం ...

























## భారతపు ప్రప్రథమ ప్రెషర్ కుకర్
## నేడు కూడా విరివిగా
## ఉపయోగింపబడుతున్నది



**Prestige**

**ప్రెస్టీజ్**
టి.టి. (ప్రైవేట్) లి.,
బెంగళూరు–560 016

MCA-TT-50 Tel R

ఆరాధ్య దైవాలుగా నిర్ణయించారు. దీనినే 'విష్ణు పంచాయతనం' అన్నారు.

అన్నవరం ఆలయ మూల విరాట్టు హరి హర హిరణ్య గర్భ త్రిమూర్త్యాత్మక వీర వేంకట సత్య నారాయణస్వామి వారు. వామ పార్శ్వంలో అనంత లక్ష్మి సత్యవతీదేవి, దక్షిణ పార్శ్వంలో చంద్ర మౌళీశ్వర సమేతంగా సత్యనారాయణస్వామి కొలువున్న తీరు చాలా అపురూపంగా అరుదైన దృశ్యంగా భక్తులు పేర్కొంటారు.

సత్యదేవుని సందర్శించిన తర్వాత యాత్రికులు క్షేత్రపాలకుడైన సీతారాముల వారిని, గుడికి కొన్ని మెట్లు దిగువనున్న 'వనదుర్గ'ను గ్రామదేవతగా వెలుగొందే 'కనకదుర్గ'ను దర్శిస్తారు.

అన్నవరం అన్నమాట వినగానే ప్రతి తెలుగు హృదయంలోనూ మెరిసేది సత్యనారాయణ వ్రతం. రత్నగిరి మీది శ్రీరామాలయం ఎదురుగానూ, దక్షిణంగానూ, వ్రత వేదికలున్నాయి. ఇక్కడ ఐదువందల వ్రతాలు ఒకేసారి జరిపించవచ్చు. కాని రోజు రోజుకు ఎక్కువవుతూన్న యాత్రికుల వల్ల, ముఖ్యంగా పర్వదినాలలో ఇప్పుడున్న నాలుగు వ్రతమంటపాలు చాలటంలేదు. అందువల్ల ఆలయ సౌందర్యం ఇనుమడించే విధంగా మధుర మీనాక్షి ఆలయ పద్ధతిలో 'సహస్రవ్రతశాల'ను నిర్మిస్తున్నారు.

తెలుగునాడులోని ఎన్నో కుటుంబాలు 'సత్య దేవు'ని సమక్షంలో సత్యనారాయణ వ్రతం చేస్తూ వుంటాయి. రోజూ వ్రతాలు జరుగుతూన్నప్పటికీ ఏకాదశి తిథినాడు, ముఖ్యంగా 'భీష్మ ఏకాదశి' రోజున వేలాది భక్తులు స్వామిని దర్శించి సత్య నారాయణ వ్రతం ఆచరిస్తారు.

జీవితంలోని మంచి చెడులకు, ధర్మాధర్మాలకు దర్పణం 'మహాభారతం'. భారతంలోని ధర్మరాజు ధర్మానికి సంకేతం. ఆయన తరతరాలుగా భారతీయులకు ఆదర్శ పురుషుడు. తాతగారైన భీష్ముడు తన అవసాన దశలో ధర్మరాజుకి ధర్మసూక్ష్మలను వివరించి జీవిత లక్ష్యాలను సూచించిన తర్వాత – సర్వజ్ఞుడు, సర్వవ్యాపి, సర్వశక్తి సమన్వితుడూ అయిన నారాయణుని మనసారా ధ్యానించి - ఆ దేవ దేవుని అనంత కల్యాణ గుణగణాలను నోరార స్తుతిస్తాడు. అదే 'విష్ణు సహస్రనామావళి' అన్న సహస్రదళ స్తోత్ర పారిజాతంగా పుష్పించింది. ఆ తర్వాత ఆయన విష్ణు సాయుజ్యం పొందాడట! ఇది జరిగినది ఏకాదశి రోజున. నాటి నుంచి అది భీష్మ ఏకాదశి అన్న వైశిష్ట్యం సంతరించుకుంది. విష్ణు సహస్రనామావళితో చేసే వ్రతాన్నే సత్య నారాయణ వ్రతం అంటారు!

వ్రత సమయంలో నియమ నిష్ఠలతో – దివ్య నామావళిని నోరార చెబుతూ, వాటి భావాలను మనసార ధ్యానిస్తూ - ఎదుటనున్న దేవతా రూపాలకు పుష్పాది పూజా ద్రవ్యాలను చేతులార సమర్పిస్తారు. అంటే—మనసా, వాచా, క్రియా దేవుని చేరువకు చేరే ప్రయత్నమే వ్రతం! ఇలాంటి భక్తి శ్రద్ధలనే నిజ జీవితాలలో సైతం - దివ్య స్వరూపాలుగా కీర్తించబడే ధర్మం, సత్యంపట్ల అందరూ కనబరచినట్లయితే బ్రతుకే ఒక వ్రతమౌతుందనీ, అప్పుడు ప్రపంచం ఒక పద్మవ్యూహంగా వుండకుండా నవ జీవన ఆనంద బృందావనంగా రూపాంతరం చెందుతుందనీ విజ్ఞుల నిశ్చితాభిప్రాయం. □






## ఓ జరుగుతున్న కథ
(నవల)

[రచన: పవని నిర్మల ప్రభావతి; ప్రచురణ: యం. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు - 1; వెల: రూ. 3-50]

రచన అనగానే కేవలం పేజీలు నింపి దేశమ్మీదికి విసిరేయడం అనుకోకుండా రచనను సాంఘిక ప్రయోజనాలకు ఉపయోగించాలని తపన ఉన్న కొద్దిపాటి రచయిత్రులలో పవని నిర్మల ప్రభావతి ఒకరు. 'ఓ జరుగుతున్న కథ'లో క్షణక్షణానికీ పునరావృతమౌతున్న నేటి ఉద్యోగినులైన యువతుల సమస్యను కేంద్రబిందువుగా తీసుకున్నారు రచయిత్రి.

హేమలత, వసుంధర ఒకే రకమైన పరిస్థితుల్లో ఉన్నా, విభిన్న మనస్తత్వాలు, జీవితంపట్ల వేరైన అభిప్రాయాలు ఉన్న ఇద్దరు ఉద్యోగినులైన అవివాహితలు. చిన్నప్పటినుంచీ పెంపకం వలన కానీ, జన్మ సంస్కారం వలన కానీ హేమలతలో ఒక రకమైన వైరాగ్య చింతన, తృప్తి ఏర్పడ్డాయి. కానీ వసుంధర మనస్తత్వం దానికి సరిగ్గా వ్యతిరేకమైనది. మధ్య తరగతి కుటుంబంలోని ఆర్థిక మాంద్యం ఆమెలో విసుగు, సాహసం పెంచాయి. చిన్నప్పటినుంచి ఆమె ఊహాసుందరుడికి తనకిష్టమైన పేరు శ్రీధర్ అని నామకరణం చేసుకుని, కనబడ్డ డబ్బున్న అందమైన వాడల్లా శ్రీధర్ అనుకోవడం, నిరాశ చెందడం. ఈ రకమైన జీవితపు రోడ్డుమీద తారసపడ్డాడు శ్రీధరమూర్తి. తనకు ఎంతో ఇష్టమైన సౌందర్యవతి, మంచి ఇల్లాలు అయిన ఇందిర భర్త అతనే అని తెలియదు వసుంధరకు. తెలిసిన తరవాత తట్టుకోలేకపోయింది. కానీ అప్పటికే పరిస్థితులు చేయి జారాయి. ఆకర్షణ, లొంగుబాటు ఉన్న ఆడపిల్లను గురించి ఆలోచించేటంత ఉన్నతుడు కాడు శ్రీధర్. కావాలనే అతని మీద హక్కు సంపాదించి, రెండవ భార్య స్థానాన్ని పొందడానికి కూడా సిద్ధపడింది వసుంధర. కానీ విషయం తెలిసిన ఇందిర నిర్ఘాంతపోయింది. ఆ క్షణం నుంచీ ఆమె భర్త నీడను కూడా అసహ్యించుకోవడం ప్రారంభించింది. ఎదుగుతున్న పిల్లలు తండ్రిని గౌరవించలేకపోయారు. అలా జీవితంలో అత్యంత ఉన్నతమైనవి అనుకున్న విలువలకు దూరమైపోయి, ఆ విసుగును వసుంధర మీద చూపించాడు. పదేళ్ళకి, అన్ని ఆకర్షణలు పోగొట్టుకుని కేవలం పిల్లల తల్లిగా, ప్రపంచం మీద కక్ష పెరిగిన యువతిగా, అసహ్యంగా మిగిలిపోయింది వసుంధర. పిరికితనం, భయం, జీవితంపట్ల అనిశ్చితం ఏర్పడిన శ్రీధరమూర్తి, జరిగిన పనికి పశ్చాత్తాపంతో కుమిలిపోయి, హేమలత స్థాపించిన "గీతా మందిరం"లో మనశ్శాంతి వెతుక్కుంటాడు.

గృహచ్ఛిద్రాలు, బాలెన్సులేని మనుష్యులు, ఆర్థిక మాంద్యం మధ్య పెరిగిన ఆడపిల్లల మనస్తత్వాలు చాలా చక్కగా చెప్పారు రచయిత్రి.

# లక్షవత్తుల నోము

జర్మనీ నుంచి ఒకామె వచ్చింది. వయసు అరవైలో పడుతున్నా వుత్సాహం పదారేళ్ళది! సంవత్సరం అంతా డబ్బు కూడబెట్టడం, చివర ఏదో దేశం తెరిపిగా చూడడం ఆమె హాబీగా చేసుకుంది. ఆమె చేపట్టిన వృత్తి చాలా గమ్మత్తయినది. ధ్వన్యనుకరణ విద్య (మిమిక్రీ) చూస్తేనే నాకంతంత మాత్రంగా వుంటుంది. శక్తి అంతా ధారపోసి ఏదో క్రియేటివ్ పని చేయకుండా ఈ రైళ్ళ చప్పుళ్ళూ కుక్కల అరుపులూ అనుకరించడం ఏమిటి అనిపిస్తుంది. అలాంటిది ఆమెగారు మరీ వింత నేర్పు-పెంపొందించుకుంది. జర్మన్, ఫ్రెంచి, ఇంగ్లీషు మాత్రమే కాదు – స్కాండినేవియన్ భాషల్లో ఏదైనాసరే ఒక మాట మీరు అనండి తక్షణం దాన్ని ఆమె వెనకనుంచి ముందుకి చెప్పగలదు! మనం చిన్నప్పుడు అస్తమానం అనే 'దడిగాడు వానసిరా' జ్ఞాపకం వచ్చింది. 'దీనివల్ల ఏం ప్రయోజనం' అని అడిగాను. అంటే – ఏ కళకైనా కాస్తంతేనా ప్రయోజనం కూడా వుండాలి కదా – ఉట్టి సంపాదనకోసం కళ చేపట్టినా దాంట్లో ఏదో కాస్త ఆత్మానందం లేకపోతే-మహ ఇబ్బంది అనిపిస్తుంది. "దేశదేశాలు తిరిగి ఫోటోలు తీసి వాటిని పత్రికల కిచ్చి, చూసిన విషయాలని గురించి రాసి, లెక్చరిచ్చి నేను జీవిస్తున్నాను. నాలో ఈ నేర్పుందని తెలిసిన స్నేహితులు, స్కూళ్ళు, విశ్వవిద్యాలయాలు, మహిళా క్లబ్బులు ప్రదర్శనలు ఏర్పాటు చేస్తూ వుంటాయి. ఎంత దీర్ఘమైనదైనా మీరు చెప్పిన కొద్ది క్షణాలలో నేను చివర మొదలుపెట్టి మొదటి అక్షరం దాకా చెప్పేస్తాను" అన్నారు. నాకేం అడగాలో అర్థం కాలేదు.

మద్రాసులో ఈవిడగారికి మూడు కోర్కెలు. "ఒక హిందూ వివాహం చూడాలి. ఒక రెలిజియస్ ఫంక్షన్ చూడాలి. ఒక మృత్యుతతంగం చూడాలి" అంది. చచ్చాంపో. పెళ్ళిసరే, మతం సరే. చావు ఎలా ఏర్పాటు చెయ్యాలి? ఏ మైలాపూరు స్మశానం దగ్గిరో నిలబడి దుఃఖంతో వెళుతున్న వారిని ఆపి ఫోటోలు తీస్తానంటే-ఒప్పుకోరని చెప్పాను. సరే టూరిస్టులకోసం మన అధికారులే వెడ్డింగులు చూపిస్తున్నారు! నాకిక మిగిలినది రెలిజియస్ ఫంక్షన్.

అలా - అడగని వరం లాగా పిలుపు వచ్చింది నాకు చిట్టి దగ్గిర నుంచి లక్షవత్తుల నోము చేస్తున్నాము రమ్మని. ఈ నోమూ ఈ జర్మనీ లేడీ రాకా



బహు కాకతాళీయంగా జరిగాయి. నేను చిట్టిని శివరాంని అడిగా - ఇలా యీమెగారు ఫోటోలు తీసుకుంటుందని. 'తీసుకోనీ' అన్నారు శివరాం. అలా ఆవిడ ధర్మమా అని లక్షవత్తుల నోము అంతా నేనూ చూడగలిగాను. దీనిని గురించి ఎందుకు రాయాలనిపించిందని మీరు అడగవచ్చు. ఇది ఎంత శ్రమ, ఖర్చుతో కూడుకున్నపనో అంతకంత పంతం పట్టుదల కావలసిన పని. ఎంత గుడ్డి నమ్మకం, మతంపట్ల మమకారం లేకపోతే – ఈ వ్రతం తలపెట్టరు. చిట్టిలో చాలా ఓర్పు, నమ్మకం వున్నాయని నాకు తెలుసు. యింత ఎక్కువగా వున్నాయని తెలియదు.

ఓ రోజు మార్నింగ్ వాక్‌కి వెడుతూ



- కె.రామలక్ష్మి

పేరంటాలలోనో అయిందనిపించేస్తూ వుంటారు. ఎందుకంటే దీనికయ్యే ఖర్చులో-సులభంగా ఓ చిన్న ఎత్తు పెళ్ళి చేసేయవచ్చును.

దీని పూజావిధానం చూడండి. 'మూఢము మొదలగు దోషములు లేని ఆషాఢ శుద్ధ ఏకాదశి పూర్ణతిథిగా వున్ననాడే ఈ వ్రతంబు నుపక్రమించ వలయును. అది మొదలు ఏకాదశినాడు వుపవాసం చేస్తూ కార్తీక శుద్ధ ఏకాదశి నాటికి లక్ష వత్తులను పూర్తిచేసి, కార్తీక శుక్ల ఏకాదశినాడు మండపారాధన మొదలైనవి చేసి ద్వాదశినాడు హోమము, సంతర్పణమూ చేయవలయును. ఈ దీపారాధనలు పాటు కలశపూజ చేసి – జాము జాముకీ పూజ చేస్తూ వుండాలి. రాత్రి జాగరణ చేయాలి. 'ముప్పది ఫలాల కంచుగిన్నె' యందు ఆవునేయి పోసి లాంఛనానికి బంగారు, వెండి వత్తులు వేసి దీపారాధన చేసి-వత్తులు వేయడం ప్రారంభించాలి. ఇలా పూజ ముగిశాక, మరునాటి ఉదయాన్నే తిరిగి వేయిమార్లు నారాయణప్రతిమను పూజచేసి యితర హోమములు చేసి పూర్ణాహుతి చేసి పునఃపూజ చేయాలి. పునఃపూజానంతరం పండిత బ్రాహ్మణులకి మండపదానం చేయాలి. గోదానం, కంచుచెంబు, ఆవుదూడ, బంగారుకొమ్ములు, వెండి గిట్టలు దానం





వాళ్ళింట్లోకి తొంగి చూస్తే ఒత్తులు చేస్తూ కనిపించింది చిట్టి. ఏమిటీ - హాయిగా షాపుల్లో దొరుకుతాయి కదా' అన్నాను. అప్పుడు చెప్పింది. లక్షవత్తులవ్రతం తల పెట్టానని. 'అది సర్వసాధారణంగా ఏవో ఇబ్బందులవల్ల పడనేపడదంటారు. ఏదో భగవంతుడి దయవల్ల ఇప్పటిదాకా సవ్యంగా సాగుతోంది. నేనే లక్షవత్తులూ చేస్తున్నాను' అంది. చూడండి ఓపిక. ఆ లక్షవత్తులు ఒక్కచోట చూసినప్పుడు గాని నాకు తోచలేదు—లక్షంటే ఇంతని! ఓ పెద్ద అండాలో వెయ్యి వెయ్యి కట్టలుగా లక్షవత్తులు ఆవునేతిలో నానుతూ కనిపించినప్పుడు ఎంత పట్టుదల వుంటే ఇది సాధ్యం అనిపించింది.

లక్షవత్తులనోము మామూలుగా అంతా ఏ పెళ్ళి ముగిసేదాకా [illegible] దినం నోముకోసం చేసిన వత్తులతో నేతిదీపాలు వెలిగించాలి.'' అసలీనోము అందరూ చేయలేరు కనుక ఎవరేనా చేస్తున్నప్పుడు ఆ హోమములో తాము చేసిన వత్తులు కూడా వేసేయిడం పరిపాటి.

ఈ వ్రతం కార్తీక, వైశాఖ, మాఘ, చైత్ర మాసములలో కూడా చేసుకోవచ్చునట.

మండపం ఏర్పాటు చేసి అష్టదళపద్మాలతో ముగ్గు నలంకరించాలి. దానిపై తెల్లని వస్త్రం పరిచి, ఐదు కుంచాల బియ్యం పోసి దాని నడుమ కలశం వుంచాలి. దానిపై లక్ష్మీనారాయణుని విగ్రహం ప్రతిష్ఠించి, యీ ముఖ్య కలశానికి తోడుగా చక్కగా అలంకరించిన ముప్ఫయి మూడు కలశాలు ప్రతిష్ఠించాలి. ఈ ప్రతిమా ప్రతిష్ఠతో చేయాలి. తరువాత కలశమిచ్చి - శక్తికి మించనంతవరకూ – నూతన వస్త్రాలతో, దక్షిణతో కలశాలను దానం చేయాలి. అసలీ లెక్కలో ఓ పద్ధతి వుంది. లక్ష వత్తులైతే - పదో వంతు తర్పణము, (10,000) దానిలో పదోవంతు హోమము (1000) దానిలో పదో వంతు (100) సంతర్పణమూ చేయాలి. ఈ వ్రతం భక్తితో ఆచరిస్తే స్త్రీలకు పలురకాల పాపాల నుంచీ విముక్తి లభిస్తుందని - యీ వ్రత ఫలం చెప్తోంది.

" అయ్యో! ఈ సంగతి నేను ఎలా నమ్మను? ఈ బ్రాహ్మణి భర్త చనిపోయి యిలా దుఃఖిస్తోందే - కుల స్త్రీలకీ దశ అతి దారుణమైనదే - యీమె భర్తను యీ వ్రత మహిమ బ్రతికిస్తే దాని గొప్పతనం నేను నమ్ముతాను. లేదా లేదు ''

అందట లక్షణ అనే ఒక వేశ్య. "నీవు లక్ష వత్తుల వ్రతంచేసి ఫలము ఆమెకివ్వు. అప్పుడామె భర్త సజీవుడవుతాడు; కంచు పాత్రలు, లక్ష్మీ నారాయణ ప్రతిమను దానం యివ్వు." అన్నాడట పండితుడు. లక్షణ యీ వ్రతం పరీక్షకు పెట్టింది. వ్రతంచేసి ఫలాన్ని దుఃఖంతో కృంగిపోతూ వున్న ఆ బ్రాహ్మణికి దానం యిచ్చింది. చనిపోయిన ఆమె భర్త బ్రతికాడు; లక్షణ కూడా చనిపోయాక పుణ్యలోకానికి వెళ్ళడమే కాదు, మళ్ళీ జన్మలో ఆమె విటుడు రాజై పుడితే ఆమె మహారాణి అయిందట. యీ వ్రతం చేసినా చూసినా కూడా సర్వపాపాలు తొలగిపోతాయని - శివుడు పార్వతికి చెప్పాడని - కథ.

కథ కమామీషు ఎలా వున్నా - ఈ వ్రతం చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. భారతీయ సంప్రదాయంలో సామూహిక కార్యక్రమాలకి చాలా చోటుంది. దీనికే వ్రతాలు, నోములు - అంతా కలుసుకొందుకూ కొత్త విషయాలు తెలుసుకొందుకూ చేసిన ఏర్పాటు అనిపిస్తుంది నాకు. ఏదో ఓ మిష లేకపోతే - యింత తతంగం చేసి సమారాధనమూ సంతర్పణలు చేయరు కదా!

నిజంగా చిట్టి యీ వ్రతం ఎంత శాస్త్రయుక్తంగా చేసిందో చూస్తే ఆశ్చర్యం వేసింది. భారతీయ నారీ ధర్మంవల్లనే భారత సంప్రదాయం కొంచెమేనా బ్రతికి వుందేమో అనిపిస్తుంది నాకు. సంప్రదాయంలో ఓ అందం వుంది. నోములూ వ్రతాలూ పుణ్యం తెస్తాయో లేదోగాని స్త్రీ లోకపు ఏకాగ్ర బుద్ధికి పదును పెడతాయి అనడం - నిస్సందేహం. అందుకే అందరూ సర్వసాధారణంగా చేసే సోమవారాలూ, మంగళవారాలూ గురించి కాక - ఎక్కడో ఎప్పుడో - అరుదుగాగాని చేయలేని లక్షవత్తుల నోము గురించి చెప్పాను.

ఈ పూజా సమయంలోని వేదఘోషకి, ధూప దీపాల వెల్గులకి, అంతకుమించి చిట్టిలో కనిపించిన భక్తిశ్రద్ధలకి నా జర్మన్ ఫ్రెండ్ 'జోహార్' అంది. అంతే కాదు "ఈ 'ఫెస్టివల్ ఆఫ్ లాక్ విక్స్' నేను బతికున్నంతకాలం మరిచిపోలేను. బహుశా ప్రపంచం మొత్తం మీద భారత స్త్రీకి సాటి అనదగిన స్త్రీమూర్తిని నేను చూడలేదు! అది నా అదృష్టంగా భావిస్తున్నాను. నేను తీసిన బొమ్మలు, నా వివరణ విని యిక్కడి స్నేహితులు ఆశ్చర్యపోతున్నారు" అంటూ ఆనందాతిరేకంతో ఉత్తరం రాసిందామె. భేష్!....అదే భారత స్త్రీ ఘనత. ◻

# పెద్దలు తీసుకోవలసిన జాగ్రత్తలు

సాయంత్రం ఆరుగంటలవుతోంది. రోజంతా కాసిన ఎండ తగ్గుముఖం పట్టినా, వాతావరణంలో వేడి తగ్గలేదు. 'లెమెన్ స్క్వాష్'లో అయిసు ముక్కలు వేసుకుని త్రాగుతూ చల్లదనాన్ని ఆస్వాదిస్తున్నారు ఆ కుటుంబ సభ్యులు. మూడేళ్ళ అబ్బాయి, ఏడేళ్ళ అబ్బాయి, తొమ్మిదేళ్ళ అమ్మాయి-వాళ్ళ తల్లి దండ్రి, పెత్తల్లి పెత్తండ్రిను.

అకస్మాత్తుగా ఏడేళ్ళ అబ్బాయి చేతిలోని గ్లాసు క్రిందపడి ముక్కలయింది. శ్వాస ఆడక — ఈతరానివాడు నీళ్ళలో మునిగిపోతూంటే పడే అవస్థ పడుతున్నాడు. కాళ్లూ చేతులూ కొట్టుకోవడం మొదలెట్టాడు. పచ్చటి శరీరం నీలంగా మారిపోతోంది. ఏమయిందో తెలియని పరిస్థితి.

అదృష్టవశాత్తూ ఆ అబ్బాయి పెత్తల్లి, పెత్తండ్రి - ఇద్దరూ డాక్టర్లే పెత్తండ్రి ఆ అబ్బాయి కాళ్ళు పట్టుకుని - తల క్రిందకు వ్రేలాడేలా పైకెత్తి, అబ్బాయి వీపు మీద, మెడమీద దబదబ బాదడం మొదలెట్టాడు. పెత్తల్లి కుర్రాడి నోట్లో వేళ్ళు పెట్టి కెలికింది....బయటికొచ్చి పడింది పల్చని అయిసు ముక్క. ఆ సమయానికి డాక్టర్లు దగ్గరగా వుండడం ఒక అదృష్టం. ఉన్న డాక్టరుకు జరుగుతున్నదేమిటో వెంటనే అవగాహన అయి, తగిన చర్య తీసుకోవడంతో ఆ అబ్బాయి బ్రతికి బయటపడ్డాడు. తాగుతున్న 'స్క్వాష్'లోని బిళ్ళ అయిసు ముక్క కుర్రాడి 'విండ్ పైప్' (శ్వాసనాళము)కు అడ్డం పడింది. శ్వాస ఆగిపోయేవరకు వచ్చింది. కారణం చిన్నదయినా, పరిణామం విషాదకరంగా తయారయి వుండేది. ఆ షాక్ నుండి తేరుకునేందుకు మూడు రోజులు పట్టిందా అబ్బాయికి.

చిన్నపిల్లల విషయంలో పెద్దలు తీసుకోవలసిన జాగ్రత్తలు చాలా వున్నాయి. వారి ఆట వస్తువులు ఎన్నిక చేయడంలో జాగ్రత్త చూపడం ఎంతయినా అవసరం.

సాధారణంగా పిల్లలు ఆడుకునేందుకు రంగు రంగుల రబ్బరు బుంగలు ఇష్టం. ఆ బుంగల్ని వూదబోయి, పిల్లలు లోనికిగాని పీల్చుకున్నారంటే - ఆ రబ్బరు శ్వాసనాళానికి అడ్డంపడే అపాయం వుంది.

గుడ్డ బొమ్మలతో ఆడుకోవడం వలన ఏ విధమయిన అపాయం లేదుగాని, కొన్ని గుడ్డ బొమ్మలకు- అందం కోసం — కళ్లకు బదులు బొత్తాలుగాని పూసలుగాని అమర్చడం జరుగుతూ వుంటుంది. అయితే, ఏమీ తెలియని పసిపాపలు ఆ బొత్తాల్నే పళ్ళతో పీకి, మింగే ప్రమాదముంది.

అలాగే మెత్తని ప్లాస్టిక్‌తోను రబ్బరుతోను తయారయిన ఆటవస్తువుల విషయంలో కూడా జాగ్రత్త చూపడం అవసరం. కొత్తగా పళ్ళు వస్తున్న పసిపాపలు, ఈ మెత్తని బొమ్మల్ని కొరకడానికి ప్రయత్నిస్తారు. ఆ ప్రయత్నం ఫలించిందా - ప్లాస్టిక్ ముక్కలు గొంతుకకు అడ్డంపడే ప్రమాదముంది. పనికిరాని బ్యాటరీ సెల్సును ఆడుకునేందుకు పిల్లలకిచ్చే పెద్దలు లేకపోలేదు. చప్పరు చేసుకుంటూ ఆడుకుంటారని అగ్గిపెట్టెలు ఇచ్చే పెద్దలు కూడ లేకపోలేదు.

పిల్లల బట్టల మీద చమ్కీ పువ్వులు, రంగు రంగుల పూసలు, బొత్తాలు కుట్టి తమ పనితనానికి మురిసిపోయే పెద్దలు వున్నారు.

అందిన ప్రతి వస్తువును నోట్లో పెట్టుకోవడం చిన్నపిల్లల ప్రవృత్తి. ఈ అలవాటు చాలాకాలం వుంటుంది. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకుని తగిన జాగ్రత్తలు తీసుకోవలసిన బాధ్యత పెద్దల మీద వుంది. కుంకుడు గింజలూ, చింత గింజలూ లాంటివి పిల్లల కందకుండా చూడాలి. చిన్న చిన్న నాణేలూ, గాజు పూసలూ కూడా దూరంగా వుంచాలి. మందు సీసాలు — ఖాళీవయినా, నిండువయినా — పిల్లలకు అందకుండా దాచాలి.

తీయగా వున్నాయని సీసాడు మాత్రలు ఒకేసారి తినేసి ప్రాణాలు పోగొట్టుకున్న చిన్నపిల్లల చరిత్రలు ఎన్నో బయటకొచ్చాయి. నల్లుల మందులు, ఎలకల మందులు వారికందేట్టు పెట్టి వారి ప్రాణానికి ముప్పు తెచ్చే పరిస్థితులు రాకుండా చూడాలి. చిన్న మేకులతో, మెరిసే రేకు ముక్కలతో, కాలిపోయిన బల్బులతో- పిల్లలు ఆడకుండా చూడాలి.

చిన్నపిల్లల విషయంలో పెద్దలు తీసుకోవలసిన జాగ్రత్తలు కోకొల్లలు. కారణాలు చిన్నవయినా, కొంచెం అశ్రద్ధ చేస్తే, పరిణామాలు విపరీతంగా మారిపోయే పరిస్థితులు రాకుండా చూడవలసిన బాధ్యతలు పెద్దవారిది! —తెన్నేటి రామలక్ష్మి

## నిబంధనలు

**'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి.** ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు 47' చందమామ బిల్డింగ్స్, మద్రాసు – 600 026 చిరునామాకు మే 26వ తేదీలోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1979 జూలై సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు – అడ్డము

1. పాలూ నీళ్ళూ కలపడం న్యాయం కాకపోయినా, అది కూడా న్యాయమేనట!
2. ఒక రుచికి వాడే కాయ
3. అసలే నలుపు-అందుకనే చివర లేదేమో!
4. వ్రాసేదే తిరగబడింది.
5. దించుకోడం లేదా తెచ్చుకోడం
6. సహాయం తప్పిపోయింది!
7. ఇది మాటల కొలువు కాదూ?
8. పనిచేసి, చేసి అలసిపోతే వచ్చే నీరసం
9. పాములమ్మ
10. తెల్లవారగానే, అందరికీ అవసరమయేది - తిరగబడింది.
11. భర్త ఆఫీసులో చేసేదీ, భార్య ఇంట్లో చేసేదీ.
12. ప్రతి మనిషికీ, ప్రతి వస్తువుకీ వుంటుంది.

### ఆధారములు – నిలువు

3. ప్రియుడి కోసం వెళ్ళే ఒక నాయిక
13. ఆకాశానికీ భూమికీ మధ్య
14. శిల్పము
15. ముని
16. కృష్ణుడు ధరించినా – అది వస్త్రం కాదు; నగా కాదు.
17. కంటిలోని ప్రతిమ తారుమారు!
18. పక్షంలో మూడవది
19. శివనతి
20. సర్వత్రా వర్జించవలసినది - తిరగబడింది.
21. దిగువ నుంచి పైకి వెళ్ళే కాకి అరుపు
22. ఇప్పుడు మీరు మాటల కొలువులో చూస్తున్నదే!
23. పాండవుల మామగారి పేరులోని తొలి అక్షరాలు
24. అడవి
25. ఒకటి అడ్డంలోని ఒకటి

## వనిత మాటల కొలువు-47
## రూ 150లు బహుమతి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 13 | | 14 | | 15 | 16 | ■ |
| ■ | | ■ | | ■ | 2 | | 17 |
| 3 | | 18 | ■ | 19 | ■ | 4 | |
| | ■ | 5 | | | 20 | ■ | |
| 6 | | | ■ | ■ | 7 | 21 | |
| | ■ | ■ | 8 | 22 | ■ | | ■ |
| 9 | 23 | 24 | ■ | 10 | | ■ | 25 |
| ■ | 11 | | ■ | | ■ | 12 | |

పేరు ______________________________

చిరునామా ______________________________

______________________________

______________________________

______________________________

మీ ప్రేమా, అనురాగం
వాటితో మాకుంది అనుబంధం



దానికి ఋజువు
పప్పూఫీడర్ నిపల్.
మీరు పెట్టే డబ్బుకి పూర్తి వసూలు.

ఫీడర్ : ఉత్తమ నాణ్యతగల గాజుతో తయారీ శుభ్రమైనది, మన్నిక గలది, సురక్షితమైనది. పూర్తిగా 225 మి.లీ. ఆహారం.

నిపల్ : ఉత్తమమైన దుర్గంధ రహితమైన రబ్బరుతో తయారీ, సరిసమానమైన ధారనిచ్చేది. 'ట్రాన్స్‌పెరెంట్' లేదా 'మోల్డెడ్'

మూత : మన్నుతుంది. లీక్‌ప్రూఫ్, పగిలిపోదు. దాంతోబాటే నిపల్-కవర్ ఉచితం.




# పప్పూ



## ఫీడర్ మరియు నిపల్

నూడర్ • టంబ్లర్ • మిక్సర్

మమతకి మరొక గుర్తు.





# పాయిజ్
## ప్రవేశ పెడుతోంది- మీ వ్యక్తిత్వాన్ని కొట్టొచ్చేలా చూపించే, ఉవ్విళ్ళూరించే మూడు పరిమళాలు.




మస్క్: ఆకర్షణీయమైన, వ్యక్తిత్వం మూర్తీభవించిన స్వతంత్ర నారి కోసం—సఫలత.

మిస్టిక్: రహస్యాత్మక తత్వం గలిగి, సమ్మోహింపజేయగలిగి, తననీ, యితరుల్నీ తన కాల్పనిక జగత్తులో ముంచి వేయగల స్త్రీ కోసం.

కోలోన్: చలాకీగా వుంటూ, ఎక్కడ ఎవరు కలిసినా సరే వాళ్ళనల్లా ప్రభావితంచేసే అమ్మాయి కోసం.

ఇంతకీ వీరిలో ఎవరు మీరు? గుర్తించుకోండి, ఎంచుకోండి.

# పాయిజ్

హేండ్‌కర్చీఫ్
రోల్-ఆన్ పెర్‌ఫ్యూమ్

మీ వ్యక్తిత్వాన్ని పోగొట్టుకోకండి.

మార్కెట్ చేసేవారు :
రాలిస్ ఇండియా లిమిటెడ్

# భాషలు నేర్చుకోండి

| తెలుగు | తమిళం | కన్నడం | మలయాళం | మరాఠి | గుజరాతి | ఒరియా |
|---|---|---|---|---|---|---|
| ట ఠ | ட | ಟ ಠ | ട ഠ | ट ठ | ટ ઠ | ଟ ଠ |
| టా ఠా | டா | ಟಾ ಠಾ | ടാ ഠാ | टा ठा | ટા ઠા | ଟା ଠା |
| టి ఠి | டி | ಟಿ ಠಿ | ടി ഠി | टि ठि | ટિ ઠિ | ଟି ଠି |
| టీ ఠీ | டீ | ಟೀ ಠೀ | ടീ ഠീ | टी ठी | ટી ઠી | ଟୀ ଠୀ |
| టు ఠు | டு | ಟು ಠು | ടു ഠു | टु ठु | ટુ ઠુ | ଟୁ ଠୁ |
| టూ ఠూ | டூ | ಟೂ ಠೂ | ടൂ ഠൂ | टू ठू | ટૂ ઠૂ | ଟୂ ଠୂ |
| టృ ఠృ | — | ಟೃ ಠೃ | — — | टृ ठृ | ટૃ ઠૃ | ଟୃ ଠୃ |
| టౄ ఠౄ | — | — — | — — | — — | — — | — — |
| టె ఠె | டெ | ಟೆ ಠೆ | ടെ ഠെ | — — | — — | — — |
| టే ఠే | டே | ಟೇ ಠೇ | ടേ ഠേ | टे ठे | ટે ઠે | ଟେ ଠେ |
| టై ఠై | டை | ಟೈ ಠೈ | ടൈ ഠൈ | टै ठै | ટૈ ઠૈ | ଟୈ ଠୈ |
| టొ ఠొ | டொ | ಟೊ ಠೊ | ടൊ ഠൊ | — — | — — | — — |
| టో ఠో | டோ | ಟೋ ಠೋ | ടോ ഠോ | टो ठो | ટો ઠો | ଟୋ ଠୋ |
| టౌ ఠౌ | டௌ | ಟೌ ಠೌ | ടൌ ഠൌ | टौ ठौ | ટૌ ઠૌ | ଟୌ ଠୌ |
| టం ఠం | — | ಟಂ ಠಂ | ടം ഠം | टं ठं | ટં ઠં | ଟଂ ଠଂ |
| టః ఠః | — | ಟಃ ಠಃ | ടഃ ഠഃ | टः ठः | ટઃ ઠઃ | ଟଃ ଠଃ |

[వచ్చే సంచికలో మరికొన్ని]



# వైద్య సలహాలు

కుమారి ఎస్. ఆర్.

నా వయసు పదిహేను సంవత్సరాలు. ఒళ్ళంతా అలెర్జీలాగా దద్దుర్లు కడుతుంది. ఎప్పుడూ దురదగా వుంటోంది. మా డాక్టర్‌ను సంప్రదించాను. ఏవో మాత్రలు ఇచ్చారు. ఆ మాత్రలు వాడినన్ని దినాలు బాగానే వుంటోంది. అయితే మాత్రలు వాడడం ఆపగానే మళ్ళీ యధాప్రకారం దురద మొదలవుతుంది. అది శాశ్వతంగా రాకుండా వుండాలంటే ఏం చెయ్యాలి? దయచేసి చెప్పగలరు.

**కొన్ని రకాల ఆహారంవల్ల అలెర్జీ రావచ్చు. లేదా కడుపులో చిన్న చిన్న నులిపురుగులు వుండడంవల్ల కూడా ఒళ్ళంతా దురద, దద్దుర్లు రావచ్చు. అందువల్ల మొదట మల పరీక్ష చేయించుకుని తగిన చికిత్స చేసుకోవాలి.**

శ్రీమతి ఆర్. టి. ఆర్.

నాకు పెళ్ళయి అయిదేళ్ళు అవుతూంది. ఇంతవరకు సంతానంలేదు. ఈ విషయంగా నేను మొదట ఆయుర్వేదం మందులు వాడాను. ఫలితం కనిపించలేదు. ఆ తర్వాత డి అండ్ సి చేయించుకున్నాను. ఆ సందర్భంగా జరిగిన వైద్యపరిశోధనవల్ల మా ఆయన వీర్యంలో జీవాణువుల సంఖ్య తక్కువగా వున్నట్టు తెలిసింది. వాటిని ఎక్కువ చేయడానికి మాత్రలు ఇచ్చారు. ఆ తర్వాత కొన్నాళ్ళకు 'సెమెన్ అనాలిసిస్' చేసినప్పుడు వీర్యాణువుల్లో ముప్పై శాతం కదలిక వున్నట్టు తెలిసింది. మూడేళ్ళ క్రితం గర్భం నిలిచి రెండో నెలలో గర్భస్రావం అయిపోయింది. నా ఆరోగ్యంలో ఎలాంటి లోపమూ లేదు అంటున్నారు డాక్టర్లు. మాకు సంతానం కలిగే దారి దయచేసి చెప్పగలరు.

**వీర్య జీవాణువుల్లో ముప్పై శాతం కదలిక ఎన్ని గంటల తర్వాత అన్న విషయం తెలుసుకోవాలి. అయినా ఇంతకుముందే మీరు ఒకసారి గర్భం ధరించి వున్నారు. అంచేత ఇకమీదట కూడా గర్భం ధరించే అవకాశం ఎంతైనా వుంది. గర్భధారణ జరిగిన మొదటి నెల నుంచే డాక్టర్‌ను సంప్రదించి తగిన మందులు తీసుకుంటూ వుండాలి. గర్భధారణ విషయంలో మీ ఆయన వీర్యాణువులను మీ గర్భాశయంలో వుంచగలిగితే (ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్) మంచి ఫలితం వుంటుంది.**

శ్రీమతి ఎస్. ఆర్.

నాకు పెళ్ళయి ఆరుమాసాలు అవుతుంది. నేను ఇప్పుడు రెండునెలల గర్భిణిని. డాక్టర్‌ను సంప్రదించినప్పుడు ఆయన సలహా మేరకు నేనూ మా ఆయన రక్త పరీక్ష చేయించుకున్నాము. నా రక్తం గ్రూపు 'బి'. Rh ఫేక్టర్ పాసిటివ్. మా ఆయన రక్తం 'ఒ' గ్రూపు. Rh ఫేక్టర్ నెగటివ్. ఇలా వుండడంవల్ల మాకు పుట్టే రెండో పాపాయి పచ్చకామెర్లకు గురవుతుంది అంటున్నారు నా స్నేహితులు. ఇది నిజమేనా? అలా అయితే దానిని నిరోధించడం ఎలా? సాధారణంగా Rh ఫేక్టర్ నెగటివ్‌గా వున్న తల్లికి – Rh ఫేక్టర్ పాసిటివ్‌గా వున్న తండ్రికి కలిగే రెండో సంతానానికి మాత్రమే 'కామెర్లు' వస్తాయంటారు. కాని దీనికి విరుద్ధంగా వున్న మాకు కలిగే సంతానానికి కూడా వస్తుందంటారా? మీ అభిప్రాయం ఏమిటి?

**తల్లి రక్తం Rh నెగటివ్‌గానూ, తండ్రి రక్తం Rh పాసిటివ్‌గానూ వున్నట్టయితే మొదటి సంతానమే పచ్చకామెర్లకు గురి అయ్యే అవకాశం వుంది. పుట్టిన శిశువు రక్తం వైద్య పరీక్ష చేయాలి. ఆ పాప Rh నెగటివ్ అయినట్లయితే తర్వాతి శిశువుకు కామెర్లు రాదు. అయితే మొదటి సంతానం Rh పాసిటివ్ అయినట్లయితే తర్వాతి పాపకు కామెర్లు రావడానికి అవకాశం వుంది. Rh incompatibility అనే ఈ లోపం సరిచేయడానికి anti-D imumunoglobion అనే వ్యాధి నిరోధక ఇంజక్షన్ ఇస్తారు. ఇది కొంచెం ధర ఎక్కువ. పసిపిల్లలకు వచ్చే కామెర్లను 'ఫోటో తెరపీ' లేదా 'ఎక్స్‌చేంజ్ బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూషన్' ద్వారా నయం చెయ్యవచ్చు.**

శ్రీమతి వి.

నా వయసు ఇరవైతొమ్మిది సంవత్సరాలు. పెళ్ళయి మూడేళ్ళు అవుతుంది. ఒక సంవత్సరం నుంచి మర్మావయవ మార్గం పెద్దదై వదులుగా వుంటోంది. అందువల్ల నాకూ, మా ఆయనకూ లైంగిక తృప్తి వుండటం లేదు. దీనికి మీ సలహా ఏమిటి? దయచేసి చెప్పగలరు.

**గర్భాశయ మార్గం కండరాలు సడలిపోయి వదులయి వుండవచ్చు. తగిన డాక్టర్‌ను సంప్రదించి కుట్లు వేయించుకుంటే చక్కబడుతుంది. కండరాల బలహీనతవల్ల అయితే కొన్ని వ్యాయామాలు చేసినట్టయితేనే సరిపోతుంది.**

శ్రీమతి పి.

నా వయసు ముప్ఫయి అయిదు సంవత్సరాలు. నా గర్భాశయం కొద్దిగా క్రిందికి జరిగినట్టు వుంది. అందువల్ల లైంగిక క్రియకు ఇబ్బందిగా వుంటోంది. డాక్టర్‌ను సంప్రదిస్తే–గర్భాశయం తీసివేయడం మంచిది అంటున్నారు. అలా తీసివేయడంవల్ల ఆ తర్వాత ఏదైనా అనారోగ్యానికి అవకాశం వుందా? దయచేసి చెప్పగలరు.

**గర్భాశయాన్ని లోపలికి త్రోసి కుట్లు వేయవచ్చు. అయితే కొన్నేళ్ళ తర్వాత మళ్ళీ జారడానికి అవకాశం వుంది. మీకు ముప్పై అయిదేళ్ళయింది. పైగా పిల్లలున్నారు. అంచేత ఇకమీదట సంతానం అవసరం లేదు అనుకున్నప్పుడు గర్భాశయం తీసివేయడమే ఉత్తమం. దీనివల్ల ఎటువంటి చెడ్డ పరిణామాలూ వుండవు.**

శ్రీమతి జె. కె. ఎన్.

నా వయసు ఇరవైనాలుగు సంవత్సరాలు. రెండో సంతానం కల్గి పద్దెనిమిది రోజులు అవుతుంది. అయినా ఇంకా రక్తస్రావం అవుతూనే వుంది. చాలా నీరసంగా వుంటుంది. దీనికి ఏం చెయ్యమంటారు? ప్రసవం తర్వాత ఎన్ని రోజులవరకు రక్తస్రావం వుంటుంది?

**నీరసం తగ్గడానికి మంచి బలవర్ధకమైన ఆహారంతో పాటు, పాలు, వీలైతే రాగుల గంజి తీసుకుంటే మంచిది. సాధారణంగా ప్రసవం అయిన తర్వాత ముప్ఫై, నలభై రోజుల వరకు రక్తస్రావం వుంటుంది. అయితే మొదటి పదిహేను, ఇరవై రోజుల తర్వాత రక్తస్రావం తక్కువ పరిమాణంలో వుంటుంది.**

# ముఖచిత్రం: "చౌ" నాట్యం



భరతనాట్యం, కూచిపూడి, కథక్, కథకళి, మణిపురి, ఒడిస్సి - ఈ నృత్యాలన్నీ కూడా మన దేశంలోని ప్రధాన నాట్య కళలుగా ప్రఖ్యాతి చెందాయి. అయితే వీటన్నిటికన్న పూర్వమే మరి కొన్ని నృత్యపద్ధతులు మన దేశంలో నెలకొన్నాయి. ఇవి అంతగా వెలుగు చూడకపోవడానికి కారణం - ఆటవిక జాతులకీ, గ్రామీణ ప్రాంతాలకీ కట్టుబడి వుండడమే. అటువంటివాటిలో చెప్పుకోదగ్గది - పశ్చిమ బెంగాల్‌లోని పురూలియా ప్రాంతంలో ఆవిర్భవించిన 'చౌ' నృత్యం. ఆంగ్లంలో దీనినే 'మాస్క్ డాన్సస్' అని అంటారు. కథకళి నాట్యంలో కళాకారులు మొహాలకు రంగులు పూసుకుని, కృత్రిమ వేషధారణతో పురాణ పాత్రలని తలపింపజేస్తారు. 'చౌ' నాట్యకారులు కూడా చూడడానికి యించుమించు ఆ విధంగానే వుంటారు. కాని వీరు చెక్కతోగానీ కాగితంతోగానీ చేసిన పురాణ పాత్రలను ప్రతిబింబింపజేసే 'కృత్రిమ ముఖాల'ను ధరిస్తారు.

పశ్చిమబెంగాల్ నుంచి క్రమక్రమంగా ఈ నాట్య కళ ఒరిస్సాలోని మయూర్‌భంజ్, బీహార్‌లోని సెరై కెల్లా ప్రాంతాలకు వ్యాపించింది. ఈ 'చౌ' నృత్యాలలోని విలక్షణమైన లక్షణం ఏమిటంటే ఆది నుంచి ఈ నృత్యం రాజాదరణ పొందినా ప్రజా నాట్యంగానే ప్రచారం పొందింది. ఆ ప్రాంతాల ప్రజల హృదయాలలో పీఠం వేసుకుంది. ప్రస్తుతం రాచరికాలూ, జమీందారీలు పోవడంతో యితర ప్రాంతాలలో ఆదరణ కొరవడినా నేటికీ పురూలియాలో మాత్రం ఈ నృత్యం అగ్రస్థానాన్ని అలంకరిస్తోంది.

అసలు ఈ నృత్యానికి 'చౌ' నృత్యం అనే పేరు ఎలా వచ్చింది? 'చౌ' అనే పదం 'చాద్‌మా' అనే బెంగాలీ పదం నుంచి గ్రహించబడింది. 'చాద్‌మా' అంటే మారువేషం అని అర్థం. కొందరు 'సంగ్' అనే పదం రూపాంతరం చెంది 'చౌ' అయిందని అంటారు. 'సంగ్' అంటే 'విదూషకునివలె వేషధారణ చేసినవాడు' అని అర్థం. ఈ విధంగా వేషధారణ చేసిన పలువురు శివపూజ వుత్సవాల సమయంలో వూరేగింపుగా బయల్దేరతారు. ఈ నాట్యంలో ప్రారంభంలో సన్యాసులు పాల్గొనేవారు. వీరిని బెంగాలీలో 'సంగ్' అని కూడా అంటారు. ఆ విధంగా కూడా ఈ నాట్యానికి ఆ పేరు వచ్చి వుండవచ్చునని పలువురి అభిప్రాయం. కాని పురూలియా గ్రామస్థుల నమ్మకం మరో విధంగా వుంది. వీరు ఈ నృత్యాన్ని 'చౌ' నృత్యం అని అంటారు. 'చౌ' అనే పదం ముండారి భాషలోని 'ఛావ్' అనే పదం నుండి వచ్చి వుండవచ్చును. 'ఛావ్' అంటే 'దయ్యం' అని అర్థం. ఈ నృత్య ప్రారంభికులు పురూలియాలోని ముండారి తెగవారు. ఈ నృత్యానికి 'ప్రేత నృత్యం' అని పేరు రావడానికి కారణం ఆదిలో ప్రేతాలు పరమశివుణ్ణి ఈ నృత్యం చేస్తూ పూజించేవట.

కేరళలోని కథకళి, అస్సాంలోని మణిపురి నృత్యాలవలెనే 'చౌ' నృత్యం కూడా ఆటవిక, జానపద, శాస్త్రీయ సంస్కృతులను మిళితం చేసుకుని ఏర్పడింది. 'చౌ' నృత్యంలో ఆటవికుల దేవతలను ప్రతిబింబింపజేసే కృత్రిమ వేషధారణను నాట్యకారులు వుపయోగిస్తారు. రామాయణ, మహాభారతాలు, యితర పురాణ గాధలను నాట్యం ద్వారా లయబద్ధమైన నేపథ్య సంగీతంతో ఈ వేషధారులు ప్రదర్శిస్తారు. అందువల్ల దీనిని భారతీయ సంస్కృతి సంప్రదాయాలు మేళవించుకుని ఏర్పడిన కళగా భావించవచ్చును.

సాధారణంగా ఈ నాట్య ప్రదర్శనలు బహిరంగ స్థలంలో రాత్రి పదిగంటల నుంచి తెల్లవారుఝామువరకూ జరుగుతాయి. రంగస్థలం విశాలంగా వలయాకారంలో వుంటుంది. దానిని ఆనుకుని వెడల్పాటి వసారా వుంటుంది. ప్రేక్షకులు ఈ వలయాకారం చుట్టూ కూర్చుని నాట్యం తిలకిస్తారు. ద్వారానికి ఒకవైపు సంగీత విద్వాంసులు కూర్చుని వుంటారు. వీరు ఐదారుగురు ఒక్కొక్క విభాగంగా ఏర్పడతారు. ఒక్కొక్క విభాగం వారు తమ బృందానికి చెందిన నాట్యకారుల నాట్యానికి అనుగుణంగా నేపథ్య సంగీతం వినిపిస్తారు. ప్రదర్శనకి ముందు వీరు తమ చాతుర్యాన్ని ప్రదర్శిస్తారు. ఈ ప్రదర్శన అనంతరం గాయకుడు రంగస్థలం మీదకి వచ్చి వినాయకుణ్ణి స్తుతిస్తూ ప్రార్థనా గీతం ఆలపిస్తాడు. ఆ తరువాత పెద్ద పెట్టున భేరీనినాదం వినవస్తుంది. దాంతోపాటే సంగీతమూ, నాట్య ప్రదర్శనా ప్రారంభించబడతాయి.

'చౌ' నృత్యాలలో ఏ నాట్యమైనా సరే, ప్రారంభంలో వినాయక వేషధారిని రంగస్థలం మీదకి రప్పిస్తారు. అతను రెండు చేతులూ బార

వేమూరి లక్ష్మిశారద



పదుగురికి మేలు చేయడంలోనే వుంది పరమార్థమంతా. ఆ మేలు అన్నది సాంఘిక సేవా కలాపాల ద్వారా జరిగితే అంతకన్న గొప్ప విషయం మరేముంటుంది?

అటువంటి కోవకి చెందిన విస్వార్థ సేవా పరాయణురాలు - శ్రీమతి వేమూరి లక్ష్మిశారద. గత ఇరవై సంవత్సరాలుగా ఆమె సంఘసేవా కలాపాలలో పాల్గొంటున్నారు. మధ్యతరగతి వారి కోసం, శ్రామిక జీవుల కోసం పాటుబడుతున్నారు. వారికి ఉపయుక్తమైన సహాయ కార్యక్రమాలు తాను వ్యక్తిగతంగానూ, యితర సేవా సంస్థలతోనూ చేయి కలిపి నిర్వహించారు; నిర్వహిస్తున్నారు. కార్మికులు, తదితర శ్రామిక వర్గాలకు చెందినవారు పనులలోకి వెళ్ళినప్పుడు వారి పిల్లలను చూసుకోవడానికి లక్ష్మిశారద మచిలీపట్నంలో ఒక క్రెష్ (శిశువిహార్) నడుపుతున్నారు. ఆంధ్రప్రదేశ్ శిశు సంక్షేమశాఖ సహకారంతో స్థాపించబడిన 'క్రెష్' కృష్ణా జిల్లాలో కంతటికీ యిదొక్కటే కావడం విశేషం! అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా ఆమె ఒక బాల్వాడి ప్రారంభించడానికి ప్రయత్నాలు చేస్తున్నారు.

ఇటీవల ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు 'సంఘ సేవలో స్వల్ప కాలశిక్షణ' నిర్వహించారు. ఈ శిక్షణలో పాల్గొనడానికి యాభై మంది సంఘసేవా కర్తలు అర్హులుగా నిర్ణయింపబడ్డారు. అలా ఎన్నికైన ఇద్దరు స్త్రీలలో లక్ష్మిశారద ఒకరు!

విశాఖపట్నంలో జరిగిన ఆ కోర్సులో ఒక భాగంగా ఆమె – మెంటల్ హాస్పిటల్, రాణి చంద్రమతీదేవి వికలాంగుల పిల్లల ఆస్పత్రి, సెంట్రల్ జైలు, పిల్లలను వుంచే బోర్స్టల్ జైలు, స్వచ్ఛంద సేవా సంస్థ అయిన ప్రేమ సమాజం సందర్శించారు. అక్కడి వారి స్థితిగతులు, శిక్షణా విధానం పరిశీలించారు.

అయితే వీటన్నిటిలోనూ ఆమెను అధికంగా ఆకర్షించింది ప్రేమ సమాజం. ఇందులో అనాధ శిశు శరణాలయం వుంది. వీరు వృద్ధులకు, నిరుపేదలైన అనాధ రోగులకు సేవ, అనాధప్రేత సంస్కారం చేస్తారు. కింగ్ జార్జ్ హాస్పిటల్‌లో చేరే రోగుల బంధువులు - నిస్సహాయ స్థితిలో వుంటే, వారికి భోజన, వసతి సౌకర్యాలు సమకూర్చుతున్నారు. ఇవికాక కుష్ఠు రోగులకు ఒక గృహాన్ని కూడా నడుపుతున్నారు.

"మూఢనమ్మకాలు, పూర్వాచారాలు పోయిననాడు, స్త్రీలకు సమానత్వం, సంఘంలో గౌరవం లభించిన నాడూ మనదేశం కూడా అన్ని విధాల అభివృద్ధి చెందుతుంది. అయితే యివన్నీ చట్టరూపంలో తెచ్చి ప్రయోజనం లేదు. మనుష్యులలో మార్పు రావాలి. వాటిని ఆచరించగలగాలి. అప్పుడే ఈ చట్టాలకి ఒక అర్థం ఏర్పడుతుంది. సామాన్యుల సమస్యలు కొంతవరకైనా తీరడానికి ఆస్కారం వుంటుంది" అంటారు లక్ష్మిశారద. □

జాపి నృత్యం చేస్తూ రంగసలి మీదకి వస్తాడు. వినాయక వేషధారిని అనుసరించి ప్రదర్శనలోని యితర పాత్రధారులందరూ రంగప్రవేశం చేస్తారు.

'చౌ' నాట్యాలలోని ఒక్కొక్క దృశ్యం ముగింపుకు వస్తుందనగా వాద్య సంగీతం తార స్థాయికి చేరుకుంటుంది. ఈ నాట్యంలోని దృశ్యాలు అమిత వేగంతో కదలాడుతూ వుంటాయి. దాంతో చూపరులకు ఎంతో వుత్సాహాన్ని వుత్తేజాన్ని కలుగజేస్తాయి. ప్రేక్షకులు ఒక్కొక్క దృశ్యం చరమస్థాయికి చేరుకోగానే 'చౌ' అని అరుస్తూ కళాకారులని అభినందిస్తూ వారికి వుత్సాహాన్ని కలుగజేస్తారు.

దృశ్యం అవగానే నేపథ్య సంగీతం కూడా ఆగిపోతుంది. మరో దృశ్యం ప్రారంభమవడానికి పావుగంటదాకా పడుతుంది. అంతవరకు సంగీత విద్వాంసులకి విశ్రాంతి అన్న మాట.

ఈ నాట్యాలలోని పాత్రధారులు ధరించే కృత్రిమ వేషధారణలను కాగితపుగుజ్జుతోనూ, మట్టితోనూ తయారు చేస్తారు. వీటిని తయారు చేసేవారిని 'సూత్రధారి' అని అంటారు. పూర్వకాలంలో అయితే వీటిని చెక్కతో చేసేవారు. పురాణ పాత్రల వర్ణనలను అనుసరించి వీటిని ఈ సూత్రధారులనబడే వడ్రంగులు అత్యంత శ్రద్ధతో చేస్తారు. ఇలా చేసేవాటిలో తరచు కనిపించే పాత్రలు– శివుడు, మహిషాసురుడు, ఘటోత్కచుడు, తాటకి, శూర్పణఖ మొదలైనవి. ఈ సూత్రధారులు పురూలియాలోని బాగ్‌మందిర్ సమీపంలోని 'చారిడా గ్రామంలో స్థిరనివాసం ఏర్పర్చుకున్నారు. ఆరంభంలో వీరు మట్టితో బొమ్మలు చేసేవారు. ఆ తరువాత హైందవ పురాణగాథలను అంశాలుగా తీసుకుని యిచ్చే నాట్య ప్రదర్శనలు ప్రజాదరణ పొందడం గమనించి ఈ కృత్రిమ వేషధారణలు చేయడం ప్రారంభించారు.

ఈ కృత్రిమ రూపాలను చేయడానికి వీరు ఉపయోగించే సామగ్రి – చెక్కతో చేసిన ఉలి, చెక్క సుత్తి, కత్తెర, కావాలసిన వస్తువులు బంకమన్ను, కాగితం ముక్కలు, గుడ్డపీలికలు, మైదా జిగురు, అద్దకానికి వివిధ రంగులు.

మొదట చూచాయగా కావలసిన ఆకారంలో ఒక నమూనాని మట్టితో చేస్తారు. దానిపైన కాగితం ముక్కలు అతికిస్తారు. ఇలా చేసిన తరువాత దీని మీద చిక్కటి బంకమట్టిని దట్టంగా, పూస్తారు. జిగురుతో గుడ్డపీలికను దానిపై అంటిస్తారు. అతి సున్నితమైన 'తాపీ' అనబడే ఉలితో సూత్రధారి ముక్కు, కళ్ళు, చుబుకం, పెదవులు, పళ్ళు, మొదలైనవన్నీ తీర్చి దిద్దుతాడు. ఆ తరువాత 'ఖున్నీ' అనబడే పరికరంతో ముక్కు, గడ్డం, కనులకిరువైపులా కొసలను చెక్కుతాడు. దీనిపై బంకమట్టిని పలచగా అద్దుతాడు.

ఈ విధంగా తయారైన కృత్రిమ రూపాన్ని నమూనా మీద నుంచి తీసి ఎండడానికి అనువుగా ఎండలో వుంచుతారు. ఇక మిగిలిందల్లా పైపై అలంకరణ, మెరుగులు దిద్దడం, అది ఆయా పాత్రలకి తగ్గట్టు, ఖరీదునుబట్టీ చేస్తూ వుంటారు. ఈ కృత్రిమ రూపాలని బెంగాలీలో 'ముఖోస్' అని అంటారు. 'చౌ' నాట్యానికి యివి ఆయువుపట్టు.

కేరళలోని కథకళి నృత్యం లాగేనే పశ్చిమ బెంగాల్‌లోనూ, ఒరిస్సా, బీహార్‌లలోని కొన్ని ప్రాంతాలలోనూ 'చౌ' నృత్యం విశేష ప్రజాదరణ పొందింది. మన దేశపు సాంస్కృతిక జీవనానికి, ప్రగతికి ఈ 'చౌ' నాట్యకళ కూడా యథాశక్తి దోహదం చేసిందన్నది నిర్వివాదాంశం. ❋

# పెరటితోట పెంపకం

— లలితకుమారి



**సి. ఆర్. జానకి, బెంగళూరు**

సెంటు జాజి తీగకి ఏ ఎరువులు వాడాలో తెలియ జేస్తారా?

పందిపెంట శ్రేష్టం. రేగడిమన్ను. చెత్త ఎరువు కూడా వేయవచ్చు.

**వి. విజయలక్ష్మి, కోటబొమ్మాళి**

మా యింటి పెరటిలో ఒక మందార చెట్టు వేశాము. అది వేసి సుమారు రెండు సంవత్సరాలయింది. ఒక నెల క్రిందటి దాకా బాగా పూచేది. ఇప్పుడు ఆ చెట్టుకి పువ్వులు సరిగా పుయ్యడం లేదు. దీనికి కారణమేమంటారు?

మీరు చెట్టు వేసి రెండేళ్ళు అయిందంటు న్నారు. భూసారం తగ్గి వుంటుంది. అంచేత మొక్కకి ఆరు నుంచి ఎనిమిది అంగుళాల దూరంలో మన్ను తీసి అడుగు మేరకు లోతుగా తవ్వాలి. ఆ తరువాత పశువెంట, చెత్త ఎరువు వేసి నీరు సమంగా పొయ్యాలి. సరైన ఎరువు పడకపోతే కూడా మొక్కలు పూత పుయ్యవు.

ఆ విధంగానే మా జామ చెట్టుకి చిన్న చిన్న పిందెలు వస్తున్నాయే తప్ప కాయలు కాయడంలేదు.

పైన చెప్పిన కారణమే. చెట్టు మూడడగుల దూరంలో - వేళ్ళు అంత దూరంలో వుంటాయి కాబట్టి — వలయాకారంలో బాగా తవ్వి. మట్టి తీపి, పైన చెప్పినట్లుగానే బాగా ఎరువు వేయండి. ఆహారలోపం వుంటే అవి మాత్రం ఏం చెయ్యగలవు చెప్పండి!

**కె. రత్న, మచిలీపట్నం**

మేము కరివేపాకు మొక్కలు పెట్టి ఐదు సంవత్సరాలైంది. కాని సంవత్సరం నుంచి ఆకు ముదర గానే వుండలు చుట్టుకుపోయి లోపల బూజు వుంటోంది. నులి పురుగులు చిగుళ్ళను తిని వేస్తున్నాయి. దీనిని నివారించే వుపాయం ఏదైనా చెబుతారా?

మనకి బలహీనతవల్ల కొన్ని జబ్బులు వచ్చినట్లే వాటికీ కాస్త బలహీనత ఏర్పడ గానే యిలా పురుగూ పుట్రా పడుతూ వుంటాయి. వీటిలో ఒక్కొక్కదానికి ఒక్కో రకం మందు వుంది. ఆకు పరీక్షగా చూస్తేగానీ ఏ మందు వేయాలో చెప్పడం కష్టం. కాబట్టి మీకు సమీపంలో వున్న వ్యవసాయశాఖ వారికి చెట్టు ఆకు శాంపిల్ చూపితే వాళ్లు తగిన మందు యిస్తారు. అలా చెట్టంతటికీ కాక కొద్దిగా మాత్రమే ఆ విధంగా అవుతున్నట్లయితే ఆ మేర కత్తిరించి కాల్చేయండి. కత్తిరించిన మేర ఆకు బాగా వస్తుంది.

**బి. పద్మప్రియ, విరుగంబాక్కం**

వేసవి నెలవుల్లో మా పెరట్లో పూల మొక్కలు వెయ్యాలని వుంది. ఏ మొక్కలు వేస్తే బాగా పూస్తాయో చెబుతారా?

పెటూనియా. అంటే పార్కుల్లో అక్కడా— పువ్వు మొదలు ట్యూబ్ ఆకారంలో వుండి రేకులు బాగా విచ్చుకుని అనేక రంగుల్లో

## కూరలు - పోషక పదార్థాలు

**అరటికాయ :**

అరటి చెట్టు పొడవు, వెడల్పుగల ఆకులతో వుంటాయి. చెట్టుకి కొమ్మలుండవు. దుంప నుండి పిలకలు పుట్టుకు వస్తాయి. ఈ చెట్టుకు దుంపే విత్తనం. అరటి చెట్లలో అనేక రకాలు - బంగారు అరటి, వామనకేళి, చక్రకేళి, బొంత, బూడిద బొంత, అమృతపాణి, ఏడాకుల అరటి, పచ్చ అరటి, కర్పూర చక్రకేళి - యిలా అనేక రకాలు వున్నాయి. వీటికి నీరు చాలా అవసరం కాబట్టి నీటి వసతి బాగా వున్న ప్రదేశంలో బాగా పెరుగుతాయి.

ప్రతి 100 గ్రాముల అరటికాయలోనూ - 83.2 గ్రాముల తేమ, 1.4 గ్రా॥ ప్రొటీన్లు, 0.2 గ్రా॥ కొవ్వుపదార్థం, 0.5 గ్రా॥ ఖనిజ పదార్థం, 14.7 గ్రా॥ పిండి పదార్థం, 0.01 గ్రా॥ కాల్షియం, 0.03 గ్రా॥ భాస్వరం, 0.6 మిల్లి గ్రాముల ఇనుము, 50 యూనిట్ల విటమిన్ ఎ; 0.05 మి.గ్రా॥ విటమిన్ బి1, 0.3 మి.గ్రా॥ నికోటినిక్ ఆమ్లము, 0.02 మి గ్రా॥ రిబోఫ్లోవిన్, 24 మి.గ్రా॥ విటమిన్ సి, 524.0 మి.గ్రా విటమిన్ సి, 524.0 మి.గ్రా॥ ఆక్సాలిక్ ఆమ్లము





మనకి కనిపిస్తాయే వాటినే పెటూనియా మొక్కలు అని అంటారు. అవీ, బంతీ, సూర్యకాంతి వేసవిలో బాగా పూస్తాయి. మొదట చిన్న కుండీలలో పెంచి అవి పెరిగాక తొట్టెలలోగానీ, భూమిలోకిగానీ మార్చుకోవాలి. వీటిలో పెటూనియా పువ్వులు పుయ్యడానికి వ్యవధి ఎక్కువగా తీసుకుంటుంది. సూర్యకాంతి, బంతి త్వరగా పూస్తాయి. సెలవులు వృథా చేయకుండా పువ్వుల మొక్కలు పెంచాలనుకోవడమూ బాగానే వుంది. మరి ప్రయత్నించి చూడండి.

**ఎ. కాంత, తిరుపతి**

మా పెరటిలో కనకాంబరం చెట్లలో కొన్నిటి ఆకులు ఇటుక రంగులోకి మారిపోతున్నాయి. ఇలా ఎందుకు అవుతోంది? ఏదైనా తెగులువల్లా? నివారించే వుపాయం తెలియజేస్తారా?

తెగులు కాదు. బలమైన ఆహారం పడక పోవడం వల్ల. బాగా పశుపెంట వేసి నీరు పోస్తే రంగు మారవచ్చు. అలా చేసి చూడండి.

**కె. విజయ, వరకాల**

మా ఇంట్లో దాదాపు పది సంవత్సరాల క్రితం గులాబి మొక్కలు నాటాము. సంవత్సరం నుంచి పువ్వులు పుయ్యడం లేదు. అదీకాక కొత్త మొక్కలు నాటితే రావటం లేదు. ఇందుకు ఏం చేయమంటారు?

భూమిలో లోపం వుంది. ఆ మన్ను కొంత తీయించి సారవంతమైన మట్టి వేస్తే మంచిది.

**సి. కృష్ణకుమారి, నందిగామ**

మా యింట్లో ఉసిరి, రాచ ఉసిరి చెట్లునాటి మూడేళ్లు అవుతున్నది. ఇంతమటుకు కాపు రాలేదు. అసలు ఎన్నాళ్ళకు కాపు వస్తుందంటారు?

ఉసిరిచెట్లు కాపు రావాలంటే కనీసం ఐదేళ్ళయినా పడుతుంది. మరో రెండేళ్ళు ఆగండి.

అలాగే ఆకు ఎర్రగా పూసే లిలీ చెట్లుపెట్టి రెండేళ్లు అయినా ఒక్క పువ్వు కూడా రాలేదు. కారణం ఏమిటి?

నీళ్ళలో నాటే కలువ, తామరలని కూడా లిలీ అనే అంటారు. భూమి మీద పెరిగే దుంప మొక్కలలో కూడా రెండు రకాలు వున్నాయి. నేల మీద నాటే లిలీలు వేసవిలో పూస్తాయి. మొదట పువ్వు, తరువాత ఆకులూ వస్తాయి. నీటితో పెరిగేవాటికైతే నీరులో సారం లేకపోయినట్లయితే చిన్న చిన్న గుడ్డ మూటలలో బోన్‌మీల్ ఎరువు కట్టి అందులో మొక్కలు పెట్టి వుంచాలి. ఇంతకీ మీరు లిలీ అన్నారే కానీ అది ఏ వెరైటీ అనేది చెప్పలేదు.

**పి. అరుంధతి, అనంతపూర్**

మా పెరట్లో సపోటా చెట్టువేసి ఎనిమిది సంవత్సరాల పైబడింది. కాయడం బాగానే కాస్తున్నాయి. కాయలు చెట్టుమీద మాగవని మేమే కోసి మాగబెడుతున్నాం. కానీ ఒక్క కాయా పండడం లేదు. అన్నీ కుళ్ళిపోతున్నాయి. అవి పక్వానికి వచ్చాయని ఎలా తెలుసుకోవాలో చెబుతారా?

సపోటాకాయలు కాయపళంగా కొయ్యకూడదు. పక్వానికి వచ్చాక కొయ్యాలి. అది ఎలా తెలుసుకోవడం అంటారా.... వేలుతో కొట్టినట్లయితే గుల్లశబ్దం రావాలి. అలా శబ్దం వచ్చిందంటే కాయ పక్వానికి వచ్చిందన్నమాట.

**నళినీ గిరిధరగోపాల్, హైద్రాబాద్**

నాకు చాలా రోజులుగా ఇంటి చుట్టూ మంచి తోట పెంచాలని వుంది. ఏమేం చెట్లు ఎక్కడెక్కడ వేయాలో, తోట ఎట్లా పెంచితే బాగుంటుందో చెప్తారా?

అది చాలా పెద్ద సబ్జెక్టు. అదంతా చెబుతూ కూర్చున్నానంటే ఈ సంచిక చాలదు. అందువల్ల అక్కడి హార్టీకల్చర్ నిపుణుల నెవరినైనా సంప్రదించండి. వారు సాయిల్ టెస్ట్, నీటివసతి మొదలైనవన్నీ తెలుసుకుని తోటలో ఏ మొక్కలు, ఎలా వేస్తే బాగుంటుందో మీకు తగిన సలహా యిస్తారు. □

---

వున్నాయి. కెలోరీ విలువ – 66.

అరటికాయ కూరకు ఉపయోగపడుతుంది. అరటికాయ, ఉల్లిపాయ కలిపి వేపుడుకూర చేసుకుంటే రుచిగా వుంటుంది. కొందరు ఇగురు కూర, ఆవపెట్టిన కూర, పప్పు చేర్చి కొందరు అరటికాయతో రకరకాలుగా కూరలు చేసుకుంటారు. అరటికాయను కాల్చి తాళింపుపెట్టి పచ్చడిగా కూడా చేసుకుంటారు. అరటిపువ్వుకి శనగపప్పు కలిపి పాతోళిగా చేసుకుంటే రుచిగా వుంటుంది. అరటికాయ బజ్జీలు కూడా వేడివేడిగా చేసుకు తింటే రుచిగా వుంటాయి.

అరటి ఆకుల మీద భోజనంచేస్తే మేహ శాంతి చేస్తుందంటారు. అరటికాయను వుడికించి లోపలి గుజ్జుకు ఉప్పు, కారంచేర్చి పచ్చడిగా చేసుకుని తింటే జిగట విరేచనాలు అరికడుతుందని చెబుతారు. అరటికాయ అజీర్ణం చేస్తుంది. అయితే చెవి సంబంధమైన రోగాలను, రక్తపిత్తాన్ని, దాహాన్ని అరికడుతుంది. అరటిదుంప మేహశాంతి చేస్తుంది. కాడలో బయలుదేరే ఒక విధమైన వాపుకి, చేతుల మీద వచ్చే వాపులకు అరటి దుంప రసంలో, దుప్పి కొమ్ము అరగదీసి పట్టువేస్తే నలుపు, మంట తక్షణం హరిస్తాయి-అని ఆయుర్వేద వైద్యులు చెబుతారు.



విజయవాడలో ఇటీవల జరిగిన ఐదవ అఖిల భారత పారిశ్రామిక, వ్యవసాయ వస్తు ప్రదర్శన శాలలో అందాల పోటీలు నిర్వహించబడ్డాయి. ఆ పోటీలలో 'మిస్ ఎక్జిబిషన్'గా కుమారి సరళకుమారి ఎన్నికైంది. కుమారి మోహిని, కుమారి మీతా ద్వితీయ, తృతీయ స్థానాలను పొందారు. డాక్టర్ లీల సరళ కుమారిని అందాలరాశిగా కిరీటంతో అలంకరించారు. అనంతరం విమల్ టెక్స్‌టైల్స్‌కి చెందిన శ్రీ భట్టా విజేతలకు బహుమతి ప్రదానం చేశారు.

# వార్తావనిత

విశాఖపట్నం హిందూస్థాన్ జింక్ లిమిటెడ్ ఆవరణలో అంతర్జాతీయ తెలుగు విద్యా సాంస్కృతిక సంస్థ (మదరాసు) వారి ఆధ్వర్యంలో కుమారి జయప్రద సమర్పించిన 'ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం సంగీత విభావరి' జరిగింది. ఆ సందర్భంగా హిందూస్థాన్ జింక్ లిమిటెడ్ మహిళా మండలి వారు కుమారి జయప్రదకు సన్మానం చేశారు.





కలకత్తా ఆంధ్ర కల్చరల్ అసోసియేషన్, ఆంధ్ర సమితి సంయుక్తంగా ఆలిపూర్‌లోని ఆడియోవిజువల్ కేంద్రంలో అంతర్జాతీయ బాలల వుత్సవాలను నిర్వహించారు. ఆ సందర్భంగా కుమారి కిరణ్మయి రంగప్రవేశం ఏర్పాటు చేయబడింది. ఆనాటి సభకు ఆగ్నేయ రైల్వే జనరల్‌మేనేజర్ శ్రీ జె. ఎస్. డి. డేవిడ్ అధ్యక్షత వహించారు. కుమారి కిరణ్మయి భరతనాట్య ప్రదర్శన తిలకించిన వారిలో ఆగ్నేయ రైల్వే మహిళా సమితి అధ్యక్షురాలు శ్రీమతి సిబిల్ డేవిడ్ కూడా వున్నారు.

అనంతపురం ఇన్నర్‌వీల్ క్లబ్ తరఫున ఇటీవల సేవా సమాజం అనాధశరణాలయంలోని వారికి డాక్టర్ గుంటువల్లి రాధాకృష్ణమూర్తి కంటి పరీక్షలు, డాక్టర్ ఉషాబాయి ఉచితంగా వైద్య పరీక్షలు చేశారు. ఈ చిత్రంలో ఎడమ నుంచి కుడికి - సేవా సమాజం కార్యదర్శి రుక్మిణీ విశ్వమూర్తి, ఇన్నర్ వీల్ అధ్యక్షులు జి. ఎన్. లక్ష్మిమూర్తి, కార్యదర్శి ఎ. సత్యవతీరావ్, ఇన్నర్‌వీల్ సభ్యులు వున్నారు.





తిరుపతి శ్రీ పద్మావతి ప్రార్థన మహిళా మండలి పదహారవ వార్షికోత్సవ సందర్భంగా మండలి సభ్యులచే కోలాట నృత్యం ప్రదర్శించబడింది. ఇందులో పాల్గొన్న సభ్యులు నిల్చున్నవారు (ఎడమ నుండి): శ్రీమతులు సౌభాగ్యమ్మ, అన్నపూర్ణ, అనూరాధ, లక్ష్మి, సింహాచలం, జాలి అమ్మ, కూర్చున్న వారిలో శ్రీమతులు నర్మదారెడ్డి, రమా రెడ్డి వున్నారు.



విజయవాడ రైల్వే ఇన్‌స్టిట్యూట్ హాలులో ఆంగ్ల పక్ష పత్రిక ఫెమినా, ఖటావ్ మిల్సు కలిసి నిర్వహించిన 'ఫ్యాషన్ పెరేడ్' ఫెమినా సంపాదకురాలు శ్రీమతి విమలాపాటిల్ ఆధ్వర్యంలో జరిగింది. దాదాపు గంటన్నరసేపు జరిగిన ఈ ప్రదర్శనలో భారతదేశంలోని అగ్రశ్రేణి మోడల్స్‌గా పేరెన్నికగన్న కల్పనా అయ్యర్, నందినిసెన్, రైనామెండొంకా, సంగీత బిజ్‌లానీ మున్నగువారు పాల్గొన్నారు. —మీరా వై.

అనంతపురం ఇన్నర్‌వీల్ క్లబ్ ఆధ్వర్యంలో ఇటీవల కదిరి తాలుకా తలుపుల గ్రామంలో 'రామూ' బృందంచే ఉచిత నేత్రా చికిత్సా శిబిరం డాక్టర్ గుంటువల్లి రాధాకృష్ణమూర్తిచే నిర్వహింపబడినది. రోగులకు ఉచిత సులోచనాలు, ఔషధాలు అందజేయబడ్డాయి.



విశాఖపట్నం లయన్ లేడీస్ క్లబ్ యిటీవల కిన్నెరా ఓపెన్ ఎయిర్ ఆడిటోరియంలో వనితా విభావరి నిర్వహించినపుడు శ్రీమతి ఆకెళ్ళ సీతాదేవి సాంస్కృతిక కార్యక్రమాలను అతి మనోజ్ఞంగా నిర్వహించారు. లలిత సంగీత కచేరీ, ఏకాంక నాటికలతోపాటు మహారాష్ట్ర సాంప్రదాయ పద్ధతిలో నృత్యాన్ని, దేశంలోని వివిధ రాష్ట్రాల స్థానిక స్త్రీలు వేషభాషలను తెలియజేసే 'టాబ్లో' ప్రదర్శనాన్ని లయన్స్ క్లబ్బు సభ్యురాండ్రు అతి అపురూపంగా నిర్వహించారు. ఆనాటి విభావరిని ముగింపుజేస్తూ శ్రీమతులు ఆకెళ్ళ సీతాదేవి, అధ్యక్షురాలు గ్రంధి విజయలక్ష్మి మంగరాజు, కార్యదర్శి వైదేహీ కృష్ణారావు, సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొన్న తదితర సభ్యురాండ్రు జాతీయ గీతాన్ని ఆలాపిస్తూన్న దృశ్యం.

—విలేకరి





రాజమండ్రి లయన్‌లేడీస్‌క్లబ్ 'అంతర్జాతీయ బాలల సంవత్సరం' సందర్భంగా ఇటీవల బాలబాలికలకు 'నర్సరీ రైమ్స్ పోటీ' 'వెల్ బేబి షో'లు నిర్వహించారు. ఈ చిత్రంలో నర్సరీ రైమ్స్ పోటీలో గెలుపొందిన బాలబాలికలతో న్యాయనిర్ణేతలు, క్లబ్ కార్యదర్శిని, అధ్యక్షురాలు వున్నారు.

# డాక్టర్ సోమరాజు సుశీల



"వాతావరణం పొడిగా వుంటుంది, పగటి ఉష్ణోగ్రతలో మార్పు లేదు.'' అనేది మనం ప్రతిపూటా వినే మాటే రేడియోలో. కాని, దీని వెనకాల వుండే కథ ఏమిటి-అని సహజంగా పట్టించుకోము. ఈ కథ అంతాకాదు గానీ, ఒక్క విశేషం మాత్రం తెలుసుకున్నాను-యీ మధ్య హైదరాబాదు బాలానగరులోని, భాగ్యనగరు లేబొరేటరీస్‌కి వెళ్ళినప్పుడు.

వాతావరణంలోని వత్తిడి, ఉష్ణోగ్రత, తేమ కొలవడానికి రోజూ ఉదయం, సాయంత్రం ఐదు గంటల సమయంలో మన విమానాశ్రయాల నుంచి రెండు బెలూన్లు వదిలిపెడతారు. అందులో వుండే పరికరాల్లో, ఒకటి ఉష్ణోగ్రత కొలిచేది, 'థెర్మిస్టరు' అనే చిన్న అగ్గిపుల్లంతవస్తువు. వాతావరణానికి సంబంధించిన పరిశోధనల్లో (రేడియో సోండా) దీన్ని ఉపయోగిస్తారు. ఇంతకాలమూ అమెరికా నుంచి వచ్చేవి థెర్మిస్టర్స్. ఇప్పుడు, ఒక తెలుగు వనిత డాక్టర్ సోమరాజు సుశీల మన దేశంలోనే దీన్ని తయారు చేస్తున్నారు. మరి ఇది విశేషమే: భాగ్యనగరు లేబొరేటరీస్‌లో గత ఐదు సంవత్సరాలుగా థెర్మిస్టర్స్ తయారుచేసి, దేశంలోని నలభై పైగా విమానాశ్రయాలకి సరఫరా చేస్తున్నారు.

పూనాలోని నేషనల్ కెమికల్ లేబొరేటరీస్‌లో రిసెర్చి పని చేస్తున్నప్పుడు ఆమె యీ పరికరాన్ని రూపొందించడంలో కృషి చేశారు. 1971 లో 'సాలిడ్‌స్టేట్ కెమిస్ట్రీ'లో పి. హెచ్. డి. డిగ్రీ పొందారు. ఆమె రూపొందించిన పరికరం యొక్క నాణ్యతని భారతీయ వాతావరణశాఖ (ఇండియన్ మీటియోరొలాజికల్ డిపార్టుమెంటు) గుర్తించారు. విదేశాల నుండి దిగుమతి చేసుకుంటున్నవాటికి ఏ విధంగానూ ఈ పరికరం తీసిపోదని వారు సర్టిఫై చేశారు.

1974 లో ఆమె ఉద్యోగం వదిలేశారు. హైదరాబాదులోని ఆంధ్రప్రదేశ్ చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధిశాఖతో మాట్లాడి, ఆ తర్వాత స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా నుండి లక్షన్నర రూపాయల ఋణం పొందారు. వెంటనే ఫ్యాక్టరీ తెరచి, ఉత్పత్తి ఆరంభించారు. ఏటా పాతికవేలు తయారౌతాయి ఈ థెర్మిస్టర్లు. దీన్ని డిమాండునిబట్టి, 50, 60 వేల వరకు ఉత్పత్తి పెంచవచ్చునట. తాను లాభదాయకమైన వ్యాపారం నిర్వహించడమేకాక, పాతిక మందిదాకా యువతులకి ఉద్యోగాలిచ్చారు. వీరిలో కొందరు నెలకి ఐదువందలు కూడా సంపాదిస్తున్నారు జీతంగా.

శ్రీమతి సుశీల ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బి. ఎస్‌సి., రాజస్థాన్ విశ్వవిద్యాలయంలో ఎమ్. ఎస్‌సి. ప్యాసైనారు. కొన్నాళ్ళు విజయవాడ మేరీస్టెల్లా కాలేజీలో లెక్చరరుగా పని చేశారు. 1945 వ సంవత్సరంలో పశ్చిమ గోదావరి జిల్లా సిద్ధాంతంలో జననం. తండ్రి సివిలు ఇంజనీరుగా పని చేసేవారు. 1966 వ సంవత్సరంలో, సోమరాజు రంగారావు గారితో వివాహమైంది. ఒక ఆడపిల్ల, ఒక మగ పిల్లవాడు. వ్యక్తిగతమైన యీ వివరాలన్నీ ఎందుకు వ్రాస్తున్నానంటే, చాలామంది యువతుల్లాగే ఆమె చదువుకున్నారు; ఉద్యోగంలో ప్రవేశించారు; వివాహం చేసుకున్నారు. కానీ,. తాను ప్రవేశించిన రంగంలో ఒక నైపుణ్యం సంపాదించాలన్న పట్టుదల, ఏదో సాధించాలన్న ఆసక్తి వున్నాయి ఆమెలో. ఇదే ఆమెలోని ప్రత్యేకత. నిదానంగా పథకం వేయడం, దాన్ని చక్కగా నిర్వహించగల చాకచక్యం కూడా ప్రదర్శించారామె.



"మనవాళ్ళు చాలామంది చదువుకుంటారు. పెళ్ళి కుదిరేవరకు ఏదో ఒకటి చదవాలికదా అనే గానీ, ఒక సబ్జెక్టులో జిజ్ఞాసతో, ఆసక్తితో చదవరు. ఒక విభాగంలో లోతుగా జ్ఞానం పొందాలనే కుతూహలం వుండదు. ఉద్యోగాలకోసం వెతికి, విసిగిపోవడమేకానీ, వున్నంతలో ఏదో ఒక వ్యాపకం కల్పించుకోవాలన్న ధోరణే లేదు." అంటారు డాక్టరు సుశీల.

ఆఫీసులతోనూ, బ్యాంకులతోనూ వ్యవహరించవలసి వచ్చినప్పుడు కొంత శ్రమ వుంది కానీ— ఆ శ్రమ ఆడవారికైనా, మగవారికైనా వుండేదే. తాను స్త్రీ గనుక ప్రత్యేకించి అలాంటి ఇబ్బంది ఏమీ కలగలేదన్నారామె. ఐతే, ఒక మహిళ యింత నైపుణ్యంగా ఒక వస్తువు తయారు చేసి, మార్కెట్టులో నిరాటంకంగా చెలామణీ చేసి, లక్షల విలువ గల వ్యాపారం చేస్తుందా అన్న సందేహం అందరిలో కలగకపోలేదు.

"మొదట్లో రోజుకి పన్నెండు గంటలకి పైగా శ్రమపడవలసి వచ్చేది. ఇప్పుడు అంత శ్రమ వుండటం లేదు. కానీ, ఎప్పటికైనా పోటీ ఏర్పడగల వస్తువునే — నేను తయారుచేసేది. పైగా, వాతావరణ పరిశోధనలకు మాత్రమే అవసరం యిది. అంటే, విస్తృతమైన మార్కెట్టు ఏర్పడదు. అందుకే మేము కొత్త పరికరాలు, డిజిటలు పి. హెచ్. మీటర్ల వంటివి తయారు చేసి అమ్మకం అరంభింవాం. లాబొరేటరీ అభివృద్ధి చేయాలన్న కోరిక వుంది. ఇప్పటికి స్టేట్ బ్యాంకువారి ఋణం దాదాపుగా తీర్చివేశాను." అని చెప్పారామె.

"ఆడవాళ్ళు స్వయంగా పరిశ్రమలు నడపగలరన్న మాట" అన్నాను. "ఆడ, మగ అని కాదు. ఏదైనా స్వయం ఉపాధి పథకం—అంటే చిన్న స్కీము వేసుకొని నడపడం తేలిక కావచ్చు. కానీ చిన్న పరిశ్రమ అంటే, ఒక వస్తువు నాణ్యంగా తయారు చేయడమేకాక, నిర్వహణా దక్షత, మార్కెటింగు నైపుణ్యం, నలుగురినీ కూడగట్టుకుని రావడం, అకౌంటింగు వగైరా ఎన్నో అంశాలు అవసరం. ఇన్ని రకాల సామర్థ్యం ఒక్క మనిషిలో వుండడం కష్టం. అప్పుడు మరొకరి సాయం అవసరమౌతుంది. మావారు కూడా పూనా ఇన్‌స్టిట్యూట్‌లో పనిచేస్తూ, రాజీనామా యిచ్చి వచ్చారు. ఆయన యీ లాబొరేటరీస్ పనులు చూస్తున్నారు." అని చెప్పారు డాక్టర్ సుశీల.

—దేవయాని



# వైద్య విశేషాలు

చాలామంది మధ్య వయస్కులైన స్త్రీలు ముట్లుడిగే దశలో కలిగే ఇబ్బందుల నుంచి విముక్తి పొందడానికి 'ఈస్ట్రోజెన్' మాత్రలు వేసుకుంటూ వుంటారు. ఈ మాత్రలు ఉపయోగించడం అపాయకరమని, వీటివల్ల 'కేన్సర్' (పుట్టకురుపు) వ్యాధి వచ్చే ప్రమాదం వుందని అమెరికాలోని జాన్ హాప్కిన్స్, పెనిసిల్వేనియా విశ్వవిద్యాలయానికి చెందిన వైద్యశాస్త్రజ్ఞుల బృందం ఇటీవల ప్రకటించింది. గర్భధారణ నిరోధించడానికి—ఐదు సంవత్సరాలకు పైగా 'పిల్స్' తీసుకుంటున్న వారికి కూడా 'కేన్సర్' వచ్చే అవకాశాలు ఉన్నట్లుగా వారు తెలియజేశారు.

*

స్త్రీలలో కొందరికి గర్భధారణ జరగక పోవడానికి పలు కారణాలను వైద్యశాస్త్రజ్ఞులు పేర్కొంటారు. ఐతే — కడుపులో పెరుగుతున్న నులి పురుగులు కూడా గర్భధారణ జరగకపోవడానికి ఒక్కొక్కప్పుడు కారణం కావచ్చని కలకత్తాకు చెందిన డాక్టర్ ప్రణాతి సిన్హా, డాక్టర్ ఎ. కె. దె ఈ మధ్య ప్రకటించారు. ఈ విషయంపై చాలాకాలం పరిశోధనలు జరిపిన తర్వాత వారు ఈ నిర్ణయానికి వచ్చినట్లు తెలియజేశారు.

*

విపరీతమైన ఒళ్ళు నెప్పులతో బాధపడుతూ, ఎన్ని మందులు తీసుకున్నా నయం కానివారికి సులభమైన పద్ధతిలో, త్వరితంగా చికిత్స జరిపి, వారిని ఆరోగ్యవంతులుగా చేసే ఒక ఎలెక్ట్రానిక్ వైద్య సాధనాన్ని - ఎర్నాకుళంలోని సెయింట్ ఆల్‌బర్ట్స్ కళాశాలకు చెందిన డాక్టర్ మాథ్యూ జార్జి, ప్రొఫెసర్ ఎమ్. ఎన్. నంబూద్రిపాద్ కనుగొన్నారు. ఈ 'ఎలక్ట్రానిక్ మైక్రొలిటిక్ అప్పేరటస్' ద్వారా - శరీరంలోకి విద్యుత్ తరంగాలను సరఫరా చేసి చికిత్స జరుపుతారు. ఈ విధానం ద్వారా చికిత్స జరిపి ఇంతవరకు సుమారు మూడు వేలమందిని పలురకాల నొప్పుల బారి నుంచి విముక్తి చేయడం జరిగింది. వైద్యులు తాము ఎక్కడికి వెళ్ళినా తమతోపాటు తీసుకుపోవడానికి అనువుగా రూపొందించబడిన ఈ వైద్య సాధనాన్ని కనుగొనడం — వైద్య పరిశోధనలలోనే ఒక విశిష్టమైన సాధనగా భావిస్తున్నారు. ఒకటి రెండు సంవత్సరాలలో ఈ వైద్య సాధనాన్ని విరివిగా ఉత్పత్తి చేసి, మార్కెట్‌లోకి తీసుకురావడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

*

జ్ఞాపకశక్తి తగ్గిపోకుండా ఉండడానికి — మన దేహంలో 'అసిటైకొలిన్' అనే రసాయన పదార్థం-దోహదం చేస్తుందని కొంతకాలం క్రితం న్యూరో కెమిస్టులు కనిపెట్టడం జరిగింది. ఇటీవల అమెరికాలోని మసాచూసెట్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీకి చెందిన వైద్య శాస్త్రజ్ఞులు — కోడిగుడ్డులోని పచ్చసొన, మాంసం, చేపలలో ఈ 'కొలిన్' అనే పదార్థం ఎక్కువగా వుందని, వీటిని తినడం ద్వారా దేహానికి లభ్యమయ్యే 'కొలిన్' కారణంగా వృద్ధులలో సైతం జ్ఞాపకశక్తి పెరగడానికి అవకాశం వుందనీ సూచించారు. శరీరంలో ప్రసారమయ్యే రక్తం నుంచి ఈ రసాయన పదార్థం మెదడుకు లభ్యమవుతుందట!

*

బీరులో 'నైట్రొసెమైన్స్' అనే పదార్థం వుందని, అందువల్ల పుట్టకురుపు (కేన్సర్) వ్యాధి రావడానికి అవకాశం వుందని ఇటీవల జర్మన్ వైద్య శాస్త్రజ్ఞులు ప్రకటించారు. కాని బ్రిటిష్ వైద్య పరిశోధకులు బీరులో వుండే 'నైట్రొసెమైన్స్' పరిమాణం చాలా తక్కువనీ, అంత తక్కువ పరిమాణంతో క్యాన్సరు వచ్చే అవకాశం లేదనీ తెలియజేశారు. దీనిపై బీరు ఉత్పత్తిదారులు విడిగా ఈ అంశంపై వైద్యపరిశోధనలు జరిపించారు. దీన్నిబట్టి తేలిందేమిటంటే — సంవత్సరానికి సగటున బీరు సేవించేవారిని లెక్కకు తీసుకుని అంచనాలు వేస్తే, ఇప్పటి నుంచి రెండులక్షల యాభై వేల సంవత్సరాలవరకు ఎవరైనా బీరు త్రాగడం సంభవిస్తే, అప్పటికి శరీరంలో ఒక చెంచాడు 'నైట్రొసెమైన్స్' చేరుతుందట. అంచేత 'బీరు హానికరం కాదు' అని వాళ్ళు 'సగర్వంగా' ప్రకటనలు చేశారు!


పాయిజ్‌లోని
తాజాదనం నిలిచి మురిపిస్తుంది
రోజంతా, స్నానం చెయ్యగానే
విచ్చుకున్న మనసులా




POISE
ROLL-ON DEODORANT
POISE
SPRAY DEODORANT
WILDFLOWER






camel
ISI
REGISTERED
SPECIAL
camel ink
ROYAL BLUE
TRADE MARK




camlin
SMILE





వి. భీమకిశోర్ (మారుటేరు) పుట్టిన తేదీ : 25–5–77 తల్లి పేరు : వి. విజయప్రసూన

ఈ నెల పుట్టిన రోజులు గల శిశువుల్లో– ఏడాది పిల్లల గ్రూపులో పి. ప్రవీణ; రెండేళ్ళ గ్రూపులో వి. భీమకిశోర్ 'పుట్టిన రోజు బహుమతుల'కు ఎన్నికైనారు. మూడేళ్ళ గ్రూపుకు చెందిన ఫొటోల్లో ఏదీ సరైనది కనబడకపోవడం వల్ల – ఆ గ్రూపుకు బహుమతి ఇవ్వలేదు. నిర్ణయింపబడిన పై ఇద్దరితో పాటు, మొత్తం మీద రెండు గ్రూపుల లోనూ ఆరోగ్యంగా కనిపిస్తున్న మరో ముగ్గుర్ని ఎన్నిక చేసి విడిగా ప్రచురిస్తున్నాము. జూన్ సంచికలోని ఈ శీర్షికకు ఫొటోలు పంపేవారు – వివరాలతో సహా (ఫొటో తీయించిన తేదీ ముఖ్యంగా వుండాలి. ఫొటో వెనుక పెన్సిల్‌తో వివరాలు రాయాలి. ఫొటోలు 'క్వార్టర్' సైజుకు తక్కువ సైజులో వుండకూడదు. తిప్పిపంపడానికి తగినన్ని తపాలాబిళ్ళలు గల కవరు జతపరచాలి.) మే 5వ తేదీలోగా మాకు చేరేలా పంపగోరుతున్నాము.



పి. ప్రవీణ (హైద్రాబాదు) పుట్టిన తేదీ: 14-5-78 తల్లి పేరు : పి. జయశ్రీ






జె. బాలాజీ బెంగళూరు పుట్టిన తేదీ: 19–5–78 తల్లి పేరు : జె. క్రిష్ణవేణి



బి. శేషబాల (జగ్గయ్య పేట) పుట్టిన తేది : 5-5-78 తల్లి పేరు : బి. వర్ధని



టి. ప్రశాంతి (గూడూరు) పుట్టిన తేదీ : 13–5–78 తల్లి పేరు : టి. మంజుల



# రసన. ఒక్క గ్లాసుతోనే ఆగనక్కరలేదు...
# ఔను, ఆగవలసిన పనేలేదు !

చమత్కారమైన ప్రతి చిన్నప్యాక్ రసన (పూర్తిగా ఆటోమెటిక్ ప్లాంట్‌లో తయారైంది) 2 పూర్తి సీసాల సిరప్....ఆహ్లాదకరమైన 32 గ్లాసుల పానీయానికి సరిపోతుంది. రసన నీటిలో కలపండి. లేదా సోడాతో కలిపి మజాపొందండి. మజా, మజా, మహాహుషార్ !



తయారు చేయుట చాలా సులభం రసన నీటితో పంచదారతో కలుపండి, ఎన్నుకునేందుకు 10 రకాల వివిధ రుచులతో.

125 గ్లాసుల పానీయానికి సరిపోయే పెద్ద ప్యాక్‌లలో గూడా లభిస్తుంది.

## రసన

చల్లని పానీయాల కాన్సెంట్రేట్

**మాటిమాటికీ తాగండి ఇక అందరికీ ఇవ్వండి**




OBM-2912 TL


చేతి సంచులు
"మీ హాండ్ బ్యాగ్
చాలా బాగుంది వదిన
గారూ....ఎక్కడ కొన్నారు?"
"ఆ మధ్య బొంబాయి
వెళ్ళినప్పుడు కొన్నాను

[లోకజ్ఞానం : సమాధానాలు]

1. ఆల్బర్ట్ ఐన్ స్టీన్. (మార్చి 14,1879-1955) థియరీ ఆఫ్ రిలెటివిటీ లేక సాపేక్ష సిద్ధాంత మును కనిపెట్టిన ప్రఖ్యాత శాస్త్రవేత్త. ఈ సిద్ధాంతంలో ఆయన కేవల కాలం (Absolute Time) అనేది లేదనీ, కాలం సాపేక్షమని, స్థలం, కాలం రెండూ ఒకే నాణానికి రెండు ప్రక్కలని విశ్వమంతా స్థల, కాల (Space and Time) సమాహారమనీ సిద్ధాంతీకరించి భౌతిక శాస్త్రాన్ని క్రొత్త మలుపు తిప్పాడు.

2. వుడ్ బఫెలో నేషనల్ పార్క్. కెనడాలోని ఆల్బెర్టా నగరంలో వుంది. 1922 లో రూపొందించబడిన ఈ పార్క్ వైశాల్యం 11,172,000 ఎకరాలు లేక 17,560 చదరపు మైళ్లు.

3. బాన్, విక్టోరియా, టెహరాన్, కొలంబో, రంగూన్.

4. అలెక్సీ కొసిగిన్. సోవియట్ రష్యా ప్రధాన మంత్రి.

5. యూనిసెఫ్ (unicef). రెండవ ప్రపంచయుద్ధ ఫలితంగా దుస్థితి పాలైన బాలల రక్షణకు, అభివృద్ధి కార్యకలాపాలు చూసుకునేందుకు 1946 లో అంతర్జాతీయ బాలల అత్యైక పరిస్థితి నిధి పేరిట స్థాపించబడిన సంస్థ కాస్తా 1950 లో ఐక్యరాజ్యసమితి పేరు కూడా చేర్చుకుని అభివృద్ధి చెందని దేశాలలోని పిల్లల స్థితిగతులు కూడా బాగుపరచడానికి ఆయా దేశాలకు తన కార్యకలాపాలను విస్తరింపజేసింది. 1953 లో శాశ్వత సంస్థగా రూపొందింది. ఇంతవరకు 116 దేశాలలోని బాలలకు సహాయం చేసిన ఈ సంస్థ ప్రధాన కార్యాలయం అమెరికాలోని న్యూయార్క్ నగరంలో వుంది.

6. జ్యోతిబాసు, నీలమణి రౌత్రే, ప్రకాష్‌సింగ్ బాదల్, ఎ. కె. ఆంథోని, దేవరాజ్ అర్స్.

7. ఏంజెల్ మేరీ జోసెఫ్. కేరళ రాష్ట్రానికి చెందిన ఈమె వ్యక్తిగతంగా మూడు, తమ జట్టు తరపున అది రెండు స్వర్ణపతకాలను పొందింది. అంతేకాదు — గత సంవత్సరం జరిగిన ఆసియా ఆటల పోటీలలో భారత జట్టు తరపున పాల్గొని రజతపతకం గెలు పొందింది. ఈసారి జాతీయ పోటీలలో ఆమె రెండు రికార్డులు కూడా స్థాపించింది. 100 మీటర్ల హర్డల్స్ పోటీలో ఆమె 14.4 సెకన్లలో పూర్తి చేయడంతోనూ, లాంగ్ జంప్ పోటీలో 5.84 మీటర్ల దూరం సాధిం చడంతోనూ రెండు కొత్త రికార్డులు స్థాపించింది.

8. బెంగాల్ గెజెట్. 1780 లో కలకత్తా నుంచి వెలువడింది. జె. ఎ. హిక్కి దీనిని ఆంగ్లంలో ప్రచురించారు. జాతీయ భాషలలో తొలు దొలుత ప్రారంభించబడిన వార్తాపత్రిక గుజ రాతీ భాషలో వెలువడిన 'బాంబే సమాచార్'. 1822 లో ప్రారంభించబడిన ఈ పత్రిక నేటికీ వెలువడుతోంది.

9. 42 (1976 నాటికి). 1960 నాటికి తొమ్మిది సవరణలు, 1961—70 దాకా పద్నాలుగు, 1971 — 76 మధ్యకాలంలో పంథొమ్మిది సవరణలు చేయబడ్డాయి.

10. ఆలం ఆరా. 1931 లో బొంబాయిలోని ఇంపీరియల్ ఫిలిం స్టూడియోవారిచే నిర్మింప బడింది. రెండవ చిత్రం మదన్ థియేటర్స్, కలకత్తా వారి 'షిరిన్ ఫెర్‌హద్' ఆ సంవ త్సరం టాకీ చిత్రాల శకారంభ సూచకంగా 20 చిత్రాలు నిర్మింపబడ్డాయి. 1931 లో 270 మూకీ చిత్రాలు నిర్మాణమై రికార్డు స్థాపించితే 1934 నాటికి వాటి సంఖ్య 7 కి తగ్గింది. 1836 నాటికి మూకీ చిత్రాల అధ్యాయం పూర్తిగా అంతరించింది.

వదినా.... ఈ బ్యాగ్ బాగుంటుందన్నావు కానీ అక్కడ దుకాణంలో అన్నిరకాల బ్యాగ్‌లు, యితర వస్తువులు చూసేసరికి కళ్ళు చెదిరిపోయాయనుకో. రోజుకో ఫ్యాషన్ చొప్పున వస్తున్నాయి ఈ చేతి సంచులూ అవీను.''

ఆమె చెప్పిన మాట నిజమే. ఈ రోజుల్లో కట్టు-బొట్టు మాత్రం సరిగ్గా వుంటే చాలదు. ధరించిన దుస్తులకు అనువైన కాలిజోళ్ళు, చేతి సంచులు అమరినప్పుడే అతివలకు అందమూ.... ఆకర్షణ అని భావించబడుతున్న రోజులివి. అందుకే మీరు ధరించే దుస్తులకు కలిసిపోయేటట్లుగాగానీ, ఆ దుస్తులలో కొట్టొచ్చినట్లు కనిపించే డిజైనుకి 'మ్యాచ్' అయ్యే చేతిసంచి అమర్చుకుంటే బాగుంటుంది. అంతమాత్రాన ఒక్కొక్క చీరకీ సరిపోయే చేతిసంచి అంటే ఎన్ని వుండాలో అని గాభరా పడవద్దు. కొన్ని రంగులు అన్ని రకాల చీరలకి, దుస్తులకి సరిగ్గా అమరుతాయి. అవి — నలుపు, గోధుమ వన్నెరంగు, జేగురు, తెలుపు రంగులు.

మరో విషయం ఏమిటంటే సాధ్యమైనంత వరకూ కాలిజోళ్ళు, చేతిసంచులు ఒకే రంగులో వుండేటట్లు చూడండి. ఇలా వుంటే అవి మీకూ....



మీ దుస్తులకి ఒక కొత్త అందాన్నిస్తాయి. ఈ వర్ణ చిత్రాలలో కొన్ని రకాల చేతిసంచులు కనిపిస్తు న్నాయి. అవి తోలుతోనూ, ఈ మధ్య విరివిగా వస్తున్న నేపా ప్లాస్టిక్‌తోనూ చేసినవి. కాలం మారుతున్నా యిక్కడ యివ్వబడిన చేతిసంచుల ఫ్యాషన్ మాత్రం మారలేదు. ఈ రకం చేతిసంచులు అప్పటికీ.... యిప్పటికీ-ఎప్పటికీ నిత్య నూతనంగానే వుంటున్నాయి; వుంటాయి అని చెప్పవచ్చు.

ఈ మధ్య మీరు ఒక విషయం గమనించారా... సాధారణంగా మగవారు ''అబ్బబ్బ.... మళ్ళా ఏం మర్చిపోయావు.... హాండ్ బ్యాగా '' - అని ఎగతాళి చేస్తూ వుంటారు. కాని ఈ మధ్య వాళ్ళకీ యిలా చేతి సంచులు తీసుకువెళ్ళడం ఫ్యాషన్ అయి పోయింది. ఈ చేతిసంచులని 'పౌచ్' (అంటే చిన్న సంచి అని అర్థం) అని అంటారు. మనని అని అని — వాళ్ళకీ ఈ అలవాటు అబ్బింది. చూశారా!

Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026


క్రేక్‌జాక్-జనం అంతా మనసుపడేది
విడిగా
అమ్మబడవు—
అనుకరణలుంటాయి...
జాగ్రత్త!
కొందరిది తియ్యనిదని వాదిస్తారు
మరికొందరిది ఉప్పనిదని
పట్టుబడతారు. కాని మరువలేని
మజా రుచిగలదని అందరూ
ఒప్పుకుంటారు.
పార్లే
క్రాక్‌జాక్
బిస్కట్లు—నోరూరించే ఆరుచికి మనస్ఫూర్తిగా లొంగిపోతారు మీరు.
everest/78/PP/220-tl